భారతీయ సాహిత్య నిర్మాతలు

# నానాలాల్


మూలం:

యు. ఎమ్. మనియార్

అనువాదం:

అక్కిరాజు రమాపతిరావు





సాహిత్య అకాడెమి

# విషయసూచిక

# 1

# తండ్రీకొడుకులు

కవులు తరచు కొంతకాలం శిక్షణకాలం, కొంతకాలం అభ్యసనకాలం గడపటం కద్దు. సర్వసాధారణంగా కవులందరికీ ఇది వర్తిస్తుంది. వారివారి శక్తిసామర్థ్యాలనుబట్టి ఈ కాలవ్యవధి వ్యక్తికీ వ్యక్తికీ మారుతూ ఉండ వచ్చు. వివిధదశలలో, దిశలలో, బాణీలలో కవితాసాధనచేస్తూ కవి అనే గుర్తింపును, ముద్రను, సంఘంనుంచి సంపాదించుకొనేనాకా, ఈ కాలవ్యవ ధిలో సొంతగొంతును, కవితామార్గాన్ని ఏర్పరచుకొనే ప్రయత్నాలు చేస్తూనే ఉంటారు. అయితే నానాలాల్ విషయంలో మాత్రం ఇట్లా జరగలేదు. 1905 వ సంవత్సరంనాటికే ప్రముఖ మేధావీ, సుప్రసిద్ధ నవలారచయిత అయిన గోవర్ధన్ త్రిపాఠీ అధ్యక్షతక్రింద జరిగిన గుజరాతీసాహిత్య పరిషద్ సమావేశంలోనే ప్రముఖ కవీశ్వరుడు కాంత్ (మణిశంకరభట్) నానా లాల్‌ను 'ఉదిత కవితాపూర్ణశశి' గా అభివర్ణించడం జరిగింది.

ఆధునిక గుజరాతీ కవిత్వపు కోటను ముందు హెచ్చరిక అంటూ ఏమాత్రం లేకుండానే సాధించుకొని స్థిరంగా సుప్రతిష్ఠుడైనాడు నానాలాల్ తన తొలి ఇరవైల వయస్సులోనే. నాటినుంచి సుదీర్ఘ కవితాయాత్రలో ఎప్పటికప్పుడు నవనవంగా ప్రశంసలందుకుంటూ ఇంచుమించు అర్ధశతాబ్ది కాలం సాగిపోయినాడు.

సుప్రసిద్ధ కవీశ్వరుడు దలపత్‌రామ్ కుమారుడు నానాలాల్. 1845లో దలపత్‌రామ్ ప్రచురించిన కవిత 'బపానిపిప్పర్' సంప్రదాయబద్ధమైన గుజరాతీ కవితను విస్మయచకితం చేసింది. దీర్ఘకాలికమైన తన కవితా జీవితాన్ని గడిపి 1898 వ సంవత్సరంలో దలపత్‌రామ్ పరమపదించాడు. ఆయన మృతివార్త నాటి సువిఖ్యాత సాహిత్య పత్రిక 'జ్ఞానసుధ'లో ఆయన

కౌమారుడు నానాలాల్ కవిత 'వసంతోత్సవ' తోపాటే వెలువడింది. అప్పటికింకా నానాలాల్ పట్టభద్ర పూర్వస్థాయి విద్యార్థిగానే ఉన్నాడు.

ఇది ఒక అపూర్వమైన సహసంఘటనమని చెప్పాలి. దీనివల్ల సూచిత మవుతున్నదేమంటే వెలుగుచూపి నడిపించే బాధ్యత తండ్రినుంచి తనయుడికి సంక్రమించిందని నానాలాల్ కూడా సుశ్లోకుడైన తండ్రివలెనే చాలాకాలం, అంటే సుమారు యాభైసంవత్సరాల కాలం కవితారచనలు చేశాడు. ఆధునిక గుజరాతీ కవితాసేవలో దలపత్‌రామ్ నానాలాల్‌లవలె ఒక శతాబ్దికాలం అవిచ్ఛిన్నంగా తమనుతాము అంకితంచేసుకున్న తండ్రికొడుకుల వర్తమానం సాహిత్యచరిత్రలో బహుసకృత్తుగా మాత్రమే కనిపిస్తుందేమో ననుకోవాలి. ఇంతేకాకుండా దలపత్‌రామ్, నానాలాల్‌లు ఉభయులుకూడా నూత్న పథ ప్రవర్తకులు కావడం విశేషం. ఆధునిక గుజరాతీ కవితాచరిత్రలో 1845 వ సంవత్సరంలో వెలువడిన దలపత్‌రామ్ కవిత 'బపానిపిప్పర్' చెప్పుకో దగిన మైలురాయి. 1898 లో వెలువడిన నానాలాల్ రచన 'వసంతోత్సవ' నూత్న కవితాయుగ ప్రవర్తకమైన సంఘటన.

1877 వ సంవత్సరం మార్చి 16 శుక్రవారంనాడు అహమదాబాద్‌లో నానాలాల్ జన్మించాడు. 1848 వ సంవత్సరం మొదలుగా దలపత్‌రామ్ అక్కడ స్థిరనివాసం ఏర్పరుచుకొన్నాడు (సౌరాష్ట్రలో ఇప్పుడు సురేంద్ర నగర్‌గా వ్యవహృతమవుతున్న వఢ్వాన్‌నుంచి తరలివచ్చారాయన). ఏ. కే ఫోర్బ్స్ అనే స్కాట్ దేశీయుడైన ఉన్నత ప్రభుత్వోద్యోగి ఆహ్వానంపై దలపత్‌రామ్ ఇక్కడికి వచ్చారు. ఈ ఉన్నతోద్యోగి ఉత్తమ సంస్కారి. విజ్ఞాని. ఈఫోర్బ్స్ దొరకు 'రాసమాల' విషయసేకరణలో సహాయపడిన తర్వాత దలపత్‌రామ్ గుజరాత్ దేశభాషా సభలో ఉద్యోగిగా చేరడం జరిగింది. తర్వాత ఈ సంస్థనే గుజరాత్ విద్యాసభగా పిలుస్తూ వచ్చారు. కవిగా దలపత్‌రామ్ ఆర్జించిన కీర్తిప్రతిష్ఠలు, దేశీయుల ఆదర గౌరవాలు ఎటువంటివంటే వంశపారంపర్యంగా వస్తున్నవారి ఇంటిపేరు తర్‌వేది (త్రివేది) క్రమంగా విస్మృతిలోకి జారిపోతూ లోకంలో సర్వసాధారణంగా ఆయన కవిగా పరిచితుడైనాడు. నానాలాల్‌న్నూ ఆయన వంశస్థులున్నూ అందువల్ల అటుతరవాత 'కవి' అనే పదాన్నే తమ గృహనామంగా స్వీకరిస్తూ వచ్చారు. పేరులోకాని ఇంటిపేరులోకాని విశేషమేమీ ఉండక

పోవచ్చు కాని నానాలాల్ విషయంలోమాత్రం ఇది ఎంతగానో సార్థక మైంది. అర్హతను కూడా సంపాదించుకుంది. కేవలం పేరులోనేకాదు క్రియ లోనూ ఆయన పూర్తిగా కవి.

మామూలు బాల్యచేష్టలతో ఒక్కొక్కప్పుడు వయోధికుడైన తండ్రికి (నాలుగోకొడుకైన నానాలాల్ పుట్టేనాటికి ఆయన వయస్సు 57 సంవత్స రాలు) సహజంగా కలిగే ఆందోళనను కలిగిస్తూ, పాఠశాల చదువుముగించి 1893 వ సంవత్సరం శ్లాఘాపాత్రమని చెప్పదగినట్లు 16 వ ఏట నానాలాల్ మెట్రుక్యులేషన్ పరీక్షలో కృతార్థుడైనాడు నానాలాల్ స్వయంగా వ్యక్తం చేసినట్లు కొంతవరకు ఈ శ్లాఘన ఆయన గురుదేవుడికే దక్కవలసిఉంది. ఆయన గొప్ప వ్యక్తి. సౌజన్యమూ సానుభూతీ చూపగల ఉపాధ్యాయుడు. ఆయన పేరు కాశీరామ్‌దవే. తన శిష్యుణ్ని విద్యావ్యాసంగంలో ప్రోత్స హించడంతో మాత్రమే ఊరుకోక ముఖ్యంగా సాహిత్యాభిలాషనూ అందునా ప్రత్యేకించి కవిత్వంపట్ల అభిరుచినీ అనురాగాన్నీ కలిగించాడు. దీనికి తోడు యువకుడైన నానాలాల్‌కు ప్రత్యక్షంగా తండ్రిగారి సజీవ కవితావారసత్వం ఉండనే ఉంది.

కళాశాల విద్యాభ్యాసపు వివిధదశలలో బొంబాయి, పూనా, అహమదా బాద్‌లలోని కళాశాలల్లో చేరి విద్యాభ్యాసం సాగించి 1901 లో బొంబాయి విశ్వవిద్యాలయంనుంచి నానాలాల్ ఎమ్. ఏ. డిగ్రీ సంపాదించుకున్నాడు. ఈ విశ్వవిద్యాలయమే తరవాత కాలంలో ఆయన యాభైయవ జన్మదినోత్సవ సందర్భంగా తన విశిష్ట విద్యార్థిగా ఆయన్ను అభినందించడం జరిగింది. ఇంతటి గాఢమైన అభిమానంతోనూ కవి నానాలాల్ ప్రతిస్పందించడం జరిగింది. 'బొంబాయి విశ్వవిద్యాలయం ఉన్నది కనకనే నానాలాల్ ఉన్నాడు' అన్నాడాయన. అంటే సహజ సిద్ధమైన స్వీయ ప్రతిభా, తండ్రి నుంచి సంక్రమించిన కవితా వారసత్వ పూర్వరంగం తనకున్నా బొంబాయి విశ్వవిద్యాలయంలో విద్యార్జనం ద్వారానే తాను ఇంతవాణ్ణి కాగలిగాననీ, లేకపోతే ఈ స్థాయికి చేరుకొని ఉండేవాడినికాననీ ఆయన భావం.

కళాశాలలో చరిత్ర, తత్త్వశాస్త్రం, ఇంగ్లీషు సాహిత్యం అభిమాన విషయాలుగా అధ్యయనంచేస్తున్నా, నానాలాల్ కవితా రచన కూడా ప్రారంభించాడు. ఆయన పట్టభద్రుడు కాకపూర్వమే ప్రారంభించిన కవితా

పరిశ్రమ పరిపక్వస్థాయికి చేరుకొన్న రచన ఆయన 'వసంతోత్సవ'. తొలి కవితా ప్రాతిభస్థాయిని సుస్థిర ప్రాతిపదికమీద నిరూపించే విధంగా తరవాత క్రమంగానూ, వెంట వెంటనే ఆయన ఇతర కవితలు వెలువడ్డాయి.

ఎమ్. ఏ. పూర్తికాగానే నానాలాల్ సద్రాలోని స్కాట్ కళాశాల (భారతదేశ సంస్థానాధిపతుల సంతానానికై ఉద్దేశించినది) ప్రధానాధ్యాపక పదవి స్వీకరించాడు. తర్వాత కొద్ది సంవత్సరాలకు రాజ్‌కోట (సౌరాష్ట్ర) లోని రాజకుమార్ కళాశాలలో చేరాడు. ఈ సంస్థలోనే ఆయన పదమూడేళ్ళు ఉన్నాడు. మధ్యకాలంలో ఆయన సివిల్‌కోర్టు జడ్జిగాను, రాజకోట్ సంస్థానపు సహాయ దివాన్ పదవిలోనూ పనిచేశాడు. వృత్తి సంబంధమైన బాధ్యతలను నిర్వహిస్తూనే, నానాలాల్ కవితారచన కొన సాగించాడు. ఆయన కవిత్వం బాగా ప్రాచుర్యం పొందుతూ వచ్చింది.

1918 వ సంవత్సరంలో నానాలాల్ అధ్యాపక పదవిని వదలిపెట్టి సౌరాష్ట్ర విద్యాశాఖాధికారి పదవిని చేపట్టాడు. ఇంతలో మహాత్మాగాంధీ నాయకత్వంలో భారతదేశ స్వాతంత్ర్యోద్యమం ప్రారంభమైంది. అటు తర్వాత నానాలాల్ 'గుజరత్న తపస్వి' అనే శీర్షికతో మహాత్మాగాంధీకి ఉజ్జ్వలమైన కవితా నివాళు లర్పించాడు. 1920 వ సంవత్సరంలో చాలా పలుకుబడీ విశేషించి చెప్పుకోదగిన రాబడీ ఉన్న ప్రభుత్వోద్యోగానికి రాజీనామానిచ్చి నానాలాల్ 1921 నుంచి అహమ్మదాబాద్‌లోనే స్థిరంగా ఉండి పోయినాడు. 1946 వ సంవత్సరం జనవరి 9 వ తేదీని ఆయన మృతినొందినంతవరకూ పాతిక సంవత్సరాలకాలం అవిశ్రాంతంగా కవితా రచనచేస్తూ తనకూ కుటుంబానికీ సరిపొయ్యే జీవనోపాధిని నానాలాల్ సంపాదించుకొన్నాడు

'బూటులేసులు కొనడానికి సరిపడినంత రాబడికూడా కవిత్వం ద్వారా నేను రాబట్టుకోలేకపోయినానన్న' వర్డ్స్‌వర్త్ కవి మాటలను ఎరిగున్నవాళ్ళు అటి మంచికాలంలో కూడా కవిత్వాన్ని వృత్తిగా చేపట్టి జీవికను సాగించడం ఎంత కష్టమో తెలుసుకోగలరు. కాని నానాలాల్ ఏనాడూ ఆర్థిక సమస్యలకు తలవంచలేదు సగౌరవంగా తల యెత్తుకొనే జీవించగలిగాడు. బాగా ఆదాయం వచ్చే ఇతర ఉద్యోగాల ప్రలోభాల కెన్నడూ లొంగి పోలేదు ఆయన. తాను ఎంచుకొన్న కవితారచనా వృత్తితోనే జీవిక సంపాదించు

కున్నాడు తుది క్షణం వరకూ. కృతజ్ఞతాభరితమైన గుజరాతు రాష్ట్రం కవిగారి జీవిత కాలంలోనే ఆయన జన్మదిన రజతోత్సవ, స్వర్ణోత్సవాలు ఘనంగా జరిపి నానాలాల్ పట్ల తన ఋణం తీర్చుకుంది.

తనయుడన్నపదానికి నిర్వచనం చెపుతూ నానాలాల్ తండ్రి విడిచి పెట్టి పోయిన పనిని పూర్తి చేసేవాడు అన్నాడు ఒక సందర్భంలో. ఇంతే కాక, కౌమారుడంటే అభ్యుదయానికి సంకేతం అనే అభిప్రాయం వెలి బుచ్చాడు. అందువల్ల తనను గూర్చి సగర్వంగా పరిపూర్ణవికసన దశలోని దలపత్‌రామ్‌గా అభివర్ణించుకోవడం సమంజసమే. ఏమంటే గుజరాతీ కవితను ఆధునికీకరణం చేయడంలో దలపత్‌రామ్ ప్రారంభించిన పంథా నానాలాల్ ద్వారా విలక్షణమైన విశిష్టమైన ఫలితాలు సాధించింది ఇతరత్రా విషయాలలో తండ్రీ కొడుకులు భిన్న దృక్పథాలుగలవారే దలపత్‌రామ్ వ్రాసిన కవిత పూర్తిగా ప్రాపంచికమూ, లౌకిక విషయికమూ అయి ఉండగా, నానాలాల్ కవిత మహాకవి కాళిదాసు అభిరామమైన ఉపమతో శాకుంతలంలో వర్ణించినట్లు భూమిమీద కాక దాని మించిన ఉన్నత స్థానం లోనే విహరిస్తుంది. ('వియతిబహుతరమ్ స్తోకముర్వ్యాం ప్రయాతి.')

దలపత్‌రామ్ (1820–1898) ఉభయ లోకాలకు చెందినవాడు. పాత కొత్తల మధ్యవంతెనగా ఉన్నవాడు. పాత సంప్రదాయాన్ని పాటిస్తూనే గుజరాతీ కవితలో నవ్యమార్గాన్ని ప్రవేశ పెట్టినవాడు. ఒకవైపున ఆయనను 'కవిరాజు' అని కీర్తించారు. ఇంకొక వైపున 'గర్బిభట్' అంటే అతి సామాన్యమైన పద్యాల కూర్పరి అని సమకాలికుల నిందాపూర్వకమైన నిరసనకాయన గురి అయినాడు. పరస్పర విరుద్ధమైన లక్షణంతో ఆయన ఏకకాలికంగా మధ్యయుగపు కవీ, ఆధునిక కవీ కూడా కావడం విచిత్రం. పూర్వకాలపు సంస్కృత పాండిత్యం, బ్రజభాష, మధ్యయుగపు గుజరాతీ కవిత, అలంకారచ్ఛందశ్శాస్త్ర సంప్రదాయాలతో సుశిక్షితుడవుతూ, దలపత్‌రామ్ పూర్వకాలపు శిష్టాచారమత వాతావరణంమధ్య పెరిగి పెద్దవాడవుతూ దేశీయ పద్ధతులలోనే విద్యార్జనం చేశాడు. ఇంగ్లీషు విద్యతో ఆయనకేమీ పరిచయంలేదు. అందువల్ల ఇంగ్లీషుభాషా సాహిత్యాలలో ఆయనకు పరిజ్ఞానం లేదు. అయినా కొన్ని సందర్భాలు పరిశీలిస్తే ఆయనలో ఆశ్చర్యకరమైన నవ్యతా దృక్పథం కనపడుతుంది. నూతనధోరణులెన్నో ఆయన వ్యక్తిత్వ

రించాడు. సమకాలీనమైన క్రొత్తతరంతోనూ నూత్నవికాస వైఖరులతోను దలపత్ రామ్‌కు సాన్నిహిత్య మేర్పడింది. ఆయనకన్నా కూడా ఎక్కువ చైతన్య స్ఫూర్తిని ప్రదర్శించినవాడూ సమకాలిక కవీ ప్రతిస్పర్థీ అయిన నర్మద్ బాహాటంగా అంగీకరించినట్లు దలపత్ రామ్ పంథొమ్మిదో శతాబ్ది మధ్యకాలంలో గుజరాతీ కవులలో పాతతరానికి చివరివాడూ, కొత్తతరానికి మొదటివాడూనూ. తన సమకాలిక కవి అయిన నర్మద్‌లాగానే దలపత్ రామ్ కూడా నూతన సంఘర్షణలను అవసరాలను గుర్తించి ప్రతి స్పందించడం చూడవచ్చు. అయితే నర్మద్ తరవాత దశలలో తన భావాలు మార్చుకొన్నాడు. దలపత్ రామ్ మాత్రం తన భావాలు ఏ దశలోనూ ఉపసంహరించుకొని మార్పుకు లోనుకాలేదు. ఆయన రచనల్లో ఎంతో వైవిధ్యం చూపాడు. సాంఘిక రాజకీయ, ఆర్థిక విద్యాసమస్యలను గూర్చిన కవితల్లో ఈ విషయ వైవిధ్యం కనపడుతుంది. తన రచనల్లో వితంతు వివాహాన్ని గూర్చి, పారిశ్రామికీకరణ ప్రభావాన్నిగూర్చి, పాలితులపట్ల పాలకుని బాధ్యతనుగూర్చి, దేశభక్తి, మతసామరస్యాలగూర్చి, స్త్రీ విద్యను గూర్చి దలపత్ రామ్ వర్ణించాడు. బాహుళ్యంమీద చూస్తే కేవలం పద్య బంధమూ, శబ్దాడంబరమూ, ప్రచార ధోరణీ కూడా ఈయన కవిత్వంలో కన్పిస్తాయి. సమస్త విషయాలు ఆయన పద్యంలోనే ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, ఆరోజుల్లో పద్యం మాత్రమే సాహిత్యాభివ్యక్తికి అర్హమైన సాధనంగా పరిగణించడంవల్లనే.

అర్ధశతాబ్దినిమించి దలపత్ రామ్ సృష్టించిన కవితా బాహుళ్యం, గుణం సంగతి ఎట్లాఉన్నా, గణాన్ని దృష్టిలో పెట్టుకొంటే శ్రోతలను వినోదింపజేయడంలో, ఆనందింపజేయడంలో కృతకృత్యమైందనే చెప్పాలి. సామాజిక నైతిక ప్రయోజనాలతో నిండి నిబిడీకృతమవుతూ ఉన్నందువల్ల తరచు ఆయన కవిత్వం ప్రబోధాత్మకంగాను ఉపదేశాత్మకంగానూ ఉండటంలో అసహజమేమీ లేదు. ప్రజలను ఆకట్టుకోవడానికి బహుళ ప్రాచుర్య సాధనమైన విధంగా కథాకథనాత్మకధోరణీ, పురాగాథాత్మక మైనధోరణీ, దృష్టాంతకథలు, సూక్తిచిత్రణల ద్వారా తన రచనా శిల్పాన్ని ఆయన ఎన్నుకొన్నాడు. లౌకిక, సాంఘిక నవ్యేతి వృత్తాలను రచించడంలో పాత ఛందోరీతుల నాయన వినియోగించుకున్నాడు.

బొంబాయి నగరంలోని దర్జీలను గూర్చి, పార్శీలను గూర్చి ఆయన వ్రాసిన 'గర్బీ'లు, ఇంకా ప్రముఖ వ్యక్తులను గూర్చి ప్రజాసంస్థలను గూర్చి, మిస్‌మేరీ కార్పెంటర్‌పై వ్రాసిన రచనను కూడా కలుపుకొని (దీనికిగాను ఆమెనుంచి ఆయన కృతజ్ఞతాభివాదాలు పొందారు) ఆయన వ్రాసిన ఇతర రచనలూ, సత్యేంద్రనాథ్ ఠాగోర్‌పైన, లండన్‌లోని ఇంపీరియల్ ఇన్‌స్టిట్యూట్‌పైన వ్రాసినవి, దలపత్‌రామ్ పాతఛందాలలోనే వ్రాసినా రచనా వస్తువు కొత్త అనే విషయాన్ని చూపుతున్నవి. నవీన ధోరణిలో ఆయన రచించిన తొలిగీతం 'బపాని పిప్పర్'. ఇది పిప్పల వృక్షాన్ని గూర్చి వ్రాసింది. 1845 లో రచితం. ఆయన వ్రాసిన గ్రీష్మాన్ని గూర్చిన దీర్ఘ వర్ణనాత్మక కావ్యంలో ఇది ఒక భాగం. దీనిని ఒక విధంగా నవ్యసృష్టి అని చెప్పవచ్చు. అంతకు పూర్వం గుజరాతీ కవితలోని ఏ శాఖలోనూ ఇది ఇముడదు. ఇటు తర్వాత అగ్నిమాపకదళాన్ని గూర్చి, విదేశయానం గూర్చి, నల్లులను, ఎలుకలను, పొగాకును గూర్చి, చెప్పులు కుట్టే అతనిరాయిపైన, ఈగకూనపైన, మొండికెత్తిన ఎనుముపైన, ఆయన వ్రాశాడు. కుర్చీని సంబోధిస్తూ ప్రశంసాపద్యాలు వ్రాశాడు. అరిస్టోఫేన్ కృతమైన రూపకాల ధోరణిని అనుసరించిన మోదాంతరూపకాలు కూడా ఆయన వ్రాశాడు. ఇంగ్లీషు కావ్యధోరణిలో మొట్టమొదటి స్మృతిగీతం రచించాడు. బాలబాలికల కోసం సులభ సుందర శైలిలో పద్యాలు రాశాడు. నిసర్గ విజ్ఞానబోధలో గాని, హాస్యధోరణికిగాని, ఈ రచనలు మించిన రచనలు ఇంతవరకూ రాలేదనడం అతిశయోక్తిగాదు. వీటితో సమస్థాయిని నిలబడగల రచనలు సకృత్తుగానైనా వచ్చాయో లేదో.

## సంలీనతాయుగం

1852 వ సంవత్సర ప్రాంతంలో గుజరాతీ కవిత్వంలో నవీన పథం ప్రారంభమైంది. భారతదేశంలోని పునరుజ్జీవనోద్యమపు తొలి దశతోనే నవీన కవితోద్యమం కూడా మొదలైంది. ఈ దశలో గాఢమైన అనుకరణతోను, విశేషమైన ఆకర్షణకు గురిఅయీ పాశ్చాత్యమైన సర్వస్వాన్ని మన వారు అభిమానించడం జరిగింది. ఆ తరవాత దశలో విచక్షణాత్మకమైన దృక్పథంతో ప్రాచ్యపాశ్చాత్య మేలి సంస్కృతుల కలయికతో, పాతకొత్తల

కలయికతో, ఒక సంశ్లేష దృక్పథం రూపొందింది. తూర్పుపడమరలు ఎన్నటికీ కలవవు అనే నిరాశాపూరితమైన భవితవ్య ప్రతిపాదనలు వినబడుతున్నప్పటికీ ఈ రకమైన సంగమం సంభవించింది. భారతీయాధునిక సాహిత్యాలు, ఆధునిక భారతదేశ చరిత్ర ఈ విషయాన్ని రుజువుచేశాయి. పందొమ్మిదోశతాబ్ది మధ్యకాలంనుంచీ ఈ కలయిక గుజరాతులో పాత కొత్తల విశ్లేషణ, సంశ్లేషణ రూపంగా, ఒక్క కవిత్వమూ, సాహిత్యాలలోనే కాక, సాంఘిక, విద్యా, సాంస్కృతిక జీవనంలో కూడా సంభవిస్తూనే వచ్చింది. నానాలాల్ రంగంలో ప్రవేశించడానికి ముందుగానే వాస్తవానికి ఈ సమన్వయ ప్రక్రియ దలపత్ రామ్, నర్మద్, నరసింహారావు దివితియ, కాంత్, కలాపి మొదలైన వారితోనే ప్రారంభమైంది. వచన రచనలో గోవర్ధన్‌రామ్ త్రిపాఠీ, ముఖ్యంగా ఆయన మహత్తర బృహద్రచన 'సరస్వతీచంద్ర'లో ఈ అపూర్వ సాంస్కృతిక సంశ్లేషణ దర్శించడమూ, మిక్కిలి ప్రత్యయంతో వ్యాఖ్యానించడమూ జరిగింది. అటు తరవాత కొద్ది కాలానికే కవితారంగంలో ఈ బాధ్యత వహించి విస్పష్టంగా, కంఠోక్తిగా, లయాత్మకశైలిలో నానాలాల్ దీనినే కొనసాగించడమూ జరిగింది.

ఆనాటి ఆకర్షణీయమైన నినాదాల ద్వారా, ఆకట్టుకొనే సూక్తుల ద్వారా యుగ నిర్ణయాన్ని ప్రతిపాదించడం జరుగుతుంది అంటాడు ఇస్రాక్స్ అనే ఇంగ్లీషు విమర్శకుడు (ఇరవయ్యోశతాబ్ది సాహిత్యాన్ని గూర్చిన మదింపు, పు. 29.). పంధొమ్మిదో శతాబ్దం ఉత్తరార్థంలోను, ఇరవయ్యో శతాబ్దపు తొలిపాదంలోనూ గుజరాత్ జీవితంలోనూ సాహిత్యంలోనూ అత్యధిక ప్రాచుర్యనినాదం 'సంలీనత' అనేదే. జీవితంలోనూ సాహిత్యం లోనూకూడా ఈ సంలీనతాయుగపు లక్ష్యం ప్రాక్పశ్చిమాల మేలిమినీ, పాత కొత్తలనూ అనుసంధానం చేయడమే. విలీనం చేయడమే 'సమస్తదిక్కుల నుంచి సర్వసద్భావాలు మమ్ములను సమీపించుగాక' అనే వేదస్తుతిని పునఃస్మరణీయంగా ప్రతిపాదించడమే ఇది. దీనిని స్వీకరించడమే జరిగింది. ఈ వినతితోపాటుగా మహాత్మాగాంధి ప్రతిపాదన కూడా అనుసంధానించడం జరిగింది. ఆయన ఏమన్నాడు. 'సమస్తదేశ దేశసంస్కృతులు నా ఇంటి చుట్టూ ఎటువంటి నిరోధమూ లేకుండా స్వేచ్ఛగా వీచడమే నే నాశిస్తాను. అయితే ఏ గాలీ నా పాదాలనే తొట్రుపడజేసి నేను కొట్టుకొని పోవడం

మాత్రం ఒప్పుకోను.' అని. ఆనాడు గుజరాత్‌లో ఈ ఆదర్శాన్ని దృష్టిలో ఉంచుకొని కవులు, కళాకారులు సమన్వయ సాధనకు పూనుకున్నారు. నానాలాల్‌కు అవ్యవహిత పూర్వంగా ఉన్న కవులు కూడా ఈ సంశ్లేషణ దృక్పథం పాటించారు. ఆయన సమకాలికులు ఈ దృక్పథం ప్రభావానికి లోబడి రచనలు చేసే బాధ్యతను ఆయన వహించాడు. నానాలాల్ రచనలలో పాత చాలా ఉంది. అదే విధంగా కొత్తకూడా చాలా ఉంది. ఆయనలో కనిపించే పాత అంతా అమూల్యమైన భారతీయ సాంస్కృతిక వారసత్వంలో ఒక భాగమైన నాశరహితమైన, జీవిత విలువల నైతిక ప్రాతి పదికమీద ఏర్పరచుకొన్న జీవన దృక్పథం. ఇక నవ్యత చాలావరకు పదాల కూర్పులోను, అభివ్యక్తిలోనూ, చిత్రణలోనూ ఇంకా విశాలమైన మానసిక దృక్పథంలోనూ, పాతనంతా పరిత్యాజ్యంగానూ, కొత్త అంతా పరిగ్రహణయోగ్యంగానూ తలచకపోవడంలోనూ కనపడుతుంది. పాత కొత్తల మేలు కలయికగా సమవసించిన, ప్రాక్పశ్చిమాల భావ సంలీనంగా పర్యవసించిన యీ వశీకరణవాగ్ నినాదం వెన్నంటి విచక్షణ దృష్టికూడా పనిచేస్తూనే ఉంది. హెచ్చరికగా కూడా ఇది పని చేసింది. గుజరాత్‌లో నానాలాల్ జీవిత కాలంలోని సాంఘిక సాంస్కృతిక జీవితంలో వ్యాపనం చెంది ఉండేది ఈ దృక్పథం. ఈ విధమైన వివేచనాయుతమైన సంలీనతా లక్షణాన్ని తన పాటలలోను, పద్యాలలోను, రూపకాలలోను, రాగభరితంగా, భావసుభగంగా, లయాత్మకంగా వ్యవస్థాపించిన వారిలో అగ్రగణ్యుడు నానాలాల్.

# 2

# పద్య కృతులు

నానాలాల్ రచనలు సంపుట బాహుళ్యం కలవి. ఇంచుమించుగా శత సంపుట రచయిత ఆయన. లయాత్మక శైలిలో ఆయన రచించిన పద్య గద్యకృతులు వైవిధ్య విలసితములూ బహుసంఖ్యాకములూ కూడా. పద్య రచనాసంకలనా లాయన ఎన్నిటినో ప్రచురించాడు. పాటలు, భావగీతాలు, రాసగీతాలు చాలా సంపుటాలే వెలువరించాడు. ఇంతకన్నా దీర్ఘరచనలైన కథనాత్మక కావ్యాలు వసంతోత్సవ, ద్వారికాప్రళయ మొదలైనవి, సువిస్తృత ప్రాతిపదికపై మహోన్నతంగా రచించిన మహాకావ్యం కురుక్షేత్ర పన్నెండు భాగాలు, ఇందుకుమార్, జయ–జయంత్, జహంగీర్–నూర్జహాన్, షహన్ షా అక్బర్, విశ్వగీత మొదలైన రూపకాలు – ఈ రూపకాలు పన్నెండు పైనే ఉన్నాయి – ఉష, సారథి మొదలైన నవలలు, పంఖాడి వంటి కథలు, ఉద్బోధన్, సంసారమంథన్ పేర్లతో ఎనిమిది సంపుటాల బహిరంగోపన్యాసాలు, సాహిత్యవిమర్శ, కవీశ్వర దలపత్ రామ్ పేరుతో తన తండ్రిగారి జీవితచరిత్ర నాలుగు సంపుటాలు, శకుంతల, మేఘదూత, భగవద్గీతవంటి వాటికి సంస్కృతం నుంచి అనువాదాలు, ఆయన వెలువరించారు. సుదీర్ఘమైన అర్థశతాబ్ది సాహిత్య జీవితాన్ని 'హరి సంహిత' అనే అసంపూర్ణకావ్యరచనతో పరిసమాప్తి చేశాడు. ఇది బృహత్కావ్యం. ఈయన తండ్రిగారు కూడా ఇదే విధంగా సుదీర్ఘమైన తమ సాహిత్య జీవితాన్ని హరిలీలామృతమనే దీర్ఘకావ్యంతోనే పరిసమాప్తం గావించారు.

## వసంతోత్సవ

విలక్షణంగా తన కావ్యరచనా ప్రయత్నాన్ని నానాలాల్ కథనాత్మక కావ్యరచనతో ఆరంభించాడు. ఇది వసంతోత్సవ అనే కావ్యం. వసంతర్తు

శోభను గూర్చి యథా దృశ్యంగాను, ప్రతీకాత్మకంగానూ కూడా గానం చేశాడు. జీవనానందసార స్ఫూర్తినంతా ఆయన కవిత స్రవిస్తూనే ఉంటుంది. కాంత్ కవి విరచిత 'వసంత విజయ', టెన్నిసన్ రచించిన 'ఇనాక్ ఆర్డెన్'లను దృష్టిలో ఉంచుకొని, వాటి ధోరణిలోనే రచించాలని మొదట సంకల్పించుకొని ప్రారంభించినప్పటికీ, తన స్వీయపథంలోనే ఆయన ప్రయాణించాడు. తనదైన వ్యక్తిత్వాన్నే ప్రదర్శించుకున్నాడు. ఎందుకంటే ఆ ఉభయులలోని విషాద శబలిత, దుఃఖచ్ఛాయలు ఈయనకు దూరస్థమైనవి. వాటిలో ఈయన కే మాత్రమూ సంబంధంలేదు. తన ఆగమనం జీవితంలోని ఆహ్లాదాన్ని, ఉల్లాసాన్ని గానం చేయడానికేనని ఆయన ప్రకటించాడు. జీవితం చుట్టూ వేదన ఇదివరకే ఉంది. ఇంకా ఎందుకు తెచ్చిపెట్టడం అని ఆయన భావన. "కవి చేయవలసిన పని కొత్త ఆశలను చిగురింపచేయడం, నవజీవనం ప్రసారింపచేయడం, ఉన్నతాదర్శాలతోను, దర్శనాలతోను మానవులను ఉత్తేజపరచడం" అన్నాడాయన. అందువల్ల ఆయన దుఃఖోద్గారితమైన స్వరంతో విషాదగీతాలు ఆలాపించడు. జీవితంలో దుఃఖాలు విననొల్లడు. గీతాలుగా అననొల్లడు.

సంస్కృతకవులు, గుజరాతీకవులు కూడా గతంలో వసంతాన్నిగూర్చి వర్ణించే ఉన్నారు మధుమాస సౌందర్యోల్లాసం, సౌందర్యం, ప్రస్తావికంగా వియోగ ప్రేమికుల దుర్భరవ్యథ, దీర్ఘకాల వియోగానంతరం ప్రేమికుల సంతోషం కవులు వర్ణించే ఉన్నారు. ప్రాచీన గుజరాతీ కవిత్వంలోఫగు, బారామసి అనే కావ్యరీతులలో ఈ మధుమాస శోభవర్ణితం. అయితే ఇది వరకటి కవుల ఈ చిత్రీకరణ స్వానుభూతి నిష్ఠంకాదు. అనేక వర్ణితాంశాలలో ఒకటిగా మాత్రమే ఉండేది కాని ప్రత్యేకాస్తిత్వంతో వర్ణితంకాదు. కథాగతమైన ఏదో సందర్భాన్నిబట్టి ప్రసక్తమవుతూ ఉండేది. అయితే నానాలాల్ వర్ణించిన వసంత వైభవానికి విశిష్టమైన విలక్షణత చేకూరింది. పందొమ్మిదోశతాబ్ది మధ్య భాగానికి దేశాన్ని మిక్కిలి ప్రభావితం చేస్తున్న పునరుజ్జీవనోద్యమాన్ని ప్రతిబింబింపజేయడమే అది.

షెల్లీ రచించిన 'వోడ్ టు ది వెస్ట్ విండ్' (పశ్చిమ పవన గీతిక)లో ఆయన వసంతర్తువును 'స్వాప్నికవసుధాజగతికి సుషిరవాద్యప్రబోధంగా' వర్ణించాడు 'వియ్యని .విరి మొగ్గలగములు వాయు మైదానాల విహరించేం

దుకు ఆయత్తపరుస్తున్నట్లు' 'పచ్చని మైదానాలు, పర్వతసీమలు జీవకాంతులతో రంగులతో నింపుతూ' ఉన్నట్లు షెల్లీ కవి దర్శనం. వసంతోత్సవ ఉపోద్ఘాతం ద్వారా నానాలాల్ కూడా ఇంచుమించుగా ఈ ధోరణినే అవలంబించడం చూడవచ్చు. 'వసంతం పునరుజ్జీవన ప్రతీక అని, జడ హేమంత దీర్ఘ శీర్ణమైన జగతికి శీఘ్రగతిని నూత్నజీవన ప్రసాదిని వసంతమనీ, వర్ణిస్తూ ఈ మధుమాసోదయోత్సవం, భారతదేశానికి గుజరాతుకూ కూడా పునరుజ్జీవన శోభోత్సవం అని వర్ణించాడు నానాలాల్.

ఈ కావ్యంలో సుందర యువతి, తరుణ యువకుడు ప్రేమించుకోవడం ఇతి వృత్తం. ఈ సుందర యువకుని చేతిలో వేణు వుంటుంది. మధుమాస శోభాప్రకృతి వీరికి నేపథ్య భూమికను సమకూరుస్తున్నది. కవి ప్రధాన కథకు సమాంతరంగా సాగే ఇంకొక తరుణ యువతీ యువకుల జంటను కూడా ప్రవేశపెడతాడు ఇందులో. ప్రధాన కథలోని నాయికా నాయకులకు ఉద్దీపనగా అవాంతర కథను నిర్వహిస్తాడు కవి. ప్రధాన కథకు కావలసిన విస్తృతిని చేకూర్చడానికి ఈ కథ ఉపకరిస్తుంది. ఒకనాటి వాసంతోదయాన కుసుమ సాంద్రకానన వీథులలోను, లతానికుంజాలలోను పుష్పాపచయం చేసేందుకు కన్నె గుంపు ఒకటి బయలుదేరుతుంది. గులాబి పూలపై ఉదయహిమం ఇంకా పేరుకొనే ఉంది. తరుణతరణి పసిడికాంతులు పల్లెలోని ఇంటి కప్పులకు వింత సోయగాన్ని కలిగిస్తున్నాయి.

నాయిక తన చెలికత్తెలతో గూడి ఒక లతానికుంజంలో ప్రవేశించి పూలతీగెల ఉయ్యాల ఊగుతున్న నాయకుణ్ణి చూస్తుంది. ఇంతలో కోకిల మావితోపునుంచి కలకూజితం చేస్తుంది వసంతర్తు అభివాద సూచకంగా. నాయికా నాయకుల చూపులు కలుసుకుంటాయి. ప్రణయం అంకురిస్తుంది. నాయిక ఒక పుష్పాన్ని నాయకుడి చేతి కందిస్తుంది. దానితోపాటే తన హృదయం కూడా. ఇక్కడ కథా నాయికా నాయకులు ఏ అవస్థ ననుభవిస్తూ ఉన్నారో, అక్కడ సమాంతరంగా నడుస్తున్న కథలోని యువతీయువకులకు కూడా అదే సన్నివేశం తటస్థిస్తుంది. ప్రణయానుభూతిని విశ్వజనీన మొనర్చే రీతిగా ఈ ఇతివృత్త నిర్వహణం జరిగింది. ప్రేమను గూర్చి ఆయనకు గల స్థిరాభిప్రాయమూ, వివాహంపట్ల ఆయనకు గల దృక్పథమూ, ఈ పద్య కృతిలో సూక్తులవలె, సూత్రాలవలె ఆయన వ్యక్తం చేశారు. ప్రేమికుడు

కావడమంటే దివ్యలోకానంద పారవశ్యాన్ని అనుభవించడమే. ప్రణయ పదవీ, స్వర్గపదవీ రెండూ వేరువేరు కావు. ప్రేమ అంటే ఆత్మనుంచి వెలువడే పరమోత్కృష్టమైన స్ఫులింగం. ప్రేమికులు పరమ పవిత్ర సత్యాలు సాక్షాత్కరించుకొంటారు. ప్రేమ వృత్తాంతమంటే ఆత్మవృత్తాంతమే. ప్రేమాలయమే దేవాలయం. దివ్యప్రభువు కొలువు కూటంలో ఒక ఆత్మ ఇంకొక ఆత్మకు అంకితం కావడమే వివాహం. పరిశుద్ధము, పరమసత్యము, ఉదాత్తము అయి ప్రేమించి చేసుకొన్న పెండ్లి జీవితానికంతటికీ పరమోత్కృష్టమైన దివ్యక్షణం. దివ్యత్వ ప్రభాతం.

ఈ వసంతోత్సవపు పూలకథ – వాచ్యంగాను, ప్రతీకాత్మకంగానూ – ప్రకృతి సుందర దృశ్యాలనే పద్యంగా వర్ణించాడు కవి. ఈ ప్రకృతి సౌందర్యం గుజరాత్‌కు ప్రత్యేకమైన విలక్షణత కలిగిస్తున్నది. అందువల్ల ఈ కావ్యం గుజరాత్ ప్రకృతి సౌందర్యానికీ సుసంపన్నతకూ ఒకస్తుతి గీతం లాగా కూడా రూపొందింది.

పట్టభద్రస్థాయి కింది తరగతులలో చదువుకుంటున్న రోజులలోనే నానాలాల్ 'విశ్వవ్యవస్థలో ప్రేమ వివాహపు ప్రయోజనం' అనే వ్యాసం రచించాడు. ఇది 'జ్ఞానసుధ' అనే పత్రికలో ప్రచురితమైంది. ఈ విషయంపై టెన్నిసన్ కవీశ్వరుడు వెలువరించిన అభిప్రాయాల ఛాయలు ఈ వ్యాసంలో కొన్ని కనపడతాయి. టెన్నిసన్ అభిప్రాయాలనే కొన్నిటిని తన ప్రతిపాదనలకు ఉపబలకంగా నానాలాల్ స్వీకరించాడు అటు తరవాత తన పద్యకృతులలోను, రూపకాలలోను, పాటలలోను ప్రతిపాదించిన విషయాలనే ఆయన ఈ వ్యాసంలో వచన రూపంగా ప్రతిపాదించారు.

అయితే ఒక విషయం మాత్రం స్పష్టంగా గమనించవలసి ఉంది. నానాలాల్ విశ్వసించిన ప్రేమ ప్రాపంచికార్థంలో మాత్రం కాదు. అసలే దిగజారిపోయిఉన్న ప్రాపంచిక అర్థాన్ని ఆయన మరింత దిగజార్చదలచ లేదు. వాడుకలో ఈ పదానికి తేలిక అర్థం సంక్రమించింది. పెద్దవాళ్ళ సమ్మతితో నిమిత్తం లేకుండా ఇంట్లోంచి పారిపోయే అతి సామాన్యార్థం కాదు నానాలాల్ ప్రేమ వివాహానికి ఆపాదించే అర్థం. మామూలుగా లోకంలో అపరిణతచిత్తులైన యువతీయువకులు ప్రేమపేరుతో ఇంట్లోంచి పారిపోయి తొందరపడి పెళ్ళిచేసుకొని తీరుబడిగా విచారించే విషయంగాదు నానాలాల్

భావనలో ప్రేమ వివాహమంటే. శారీరకమైన వాంఛగాని, ఉద్రేకాలుగాని, నైతిక విరుద్ధతగాని ఆయన ఆశించే ప్రేమలో ఉండవు. ప్రేమ వివాహ భావనలో చోటుచేసుకోలేవు. ప్రేమను గూర్చి, ప్రేమ వివాహం గూర్చి, నిజమైన ప్రేమతో కూడిన పెళ్ళినిగూర్చి నానాలాల్ కవితాజీవిత ప్రారంభదశలో ఏర్పరచుకొన్నభావాలు, ఆశయాలు, అటు తరవాత ఆయన రచించిన ఎన్నో పద్యకృతులలోను, పాటలలోను, రాసలలోను, రూపకాలలోను, వివిధ సన్నివేశాలతో, వివిధ కాంతులతో వెల్లడి కావడం చూడవచ్చు. కాని నానాలాల్ ప్రతిభ దర్శించవలసింది ఆయన భావౌన్నత్య విషయమై కాదు—అవి విశ్వజనీనమైనవే—స్వీయ కవితా ప్రతిభతో ప్రత్యేకమైన తన ముద్రతో వాటిని కవితామయం చేయడంలోనే ఆయన ప్రతిభ గొప్పగా ప్రకాశిస్తుంది.

## డోలన్ శైలి

'శతాబ్దాలక్రితం ఎప్పుడో ఛందోవేత్తలు బలవంతంగా పాదాలకు తగిల్చిన సంకెలలు ఆధునిక యువ కవితా దేవికి బాధాకరంగా ఉన్నవి' అన్నాడు నానాలాల్. కవిత్వంలోని నిసర్గ స్వేచ్ఛాయుతమైన భావ ప్రకటనకు ఈ బంధాలు బాధాకరంగా ఉన్నవన్నారాయన. అందువల్ల కవిత్వాన్ని ఈ బంధాలనుంచి విముక్తం చేయడానికి తాను నిశ్చయించుకున్నానని, ఇందు కనుగుణంగా 'డోలన్‌శైలి' అనే లయాత్మకమైన శైలిని రూపొందించానని ఆయన చెప్పుకున్నాడు. 'ఇరవైయొక్క సంవత్సరాల తరుణ వయస్కుడు ఇరవైరెండు శతాబ్దాల ప్రాతకాలపు పాలనాధికారంపై చేసిన తిరుగుబాటుగా' ఈ శైలి నాయన అభివర్ణించాడు.

ఛందస్సులో కొత్త కొత్త ప్రయోగాలు చేయడం గుజరాతీ ఆధునిక కవితలో కొత్తకాదు. నానాలాల్‌కు పూర్వమే ఇటువంటి ప్రయోగాలు కొన్ని సాగుతూవచ్చాయి వివిధ ఛ్ఛందాల వినూత్నమైన సంయోగాలు, ప్రస్తారాల ద్వారా సాంప్రదాయికమైన సంస్కృతచ్ఛందోరీతులలోను, దేశిచ్ఛందస్సుల లోను ఇటువంటి నవీనరీతులు సృష్టించడం ఆధునిక గుజరాతీ కవితలో నానాలాల్‌కు పూర్వమే కొంత ప్రవేశించింది. ఈ ప్రయత్నాలన్నీ భావ వ్యక్తీకరణలో కవి వాంఛించిన స్వేచ్ఛను సూచిస్తున్నాయి. ఇటువంటి

స్వేచ్ఛను గూడా కవులు కొంతవరకు ఇదివరకే సాధించడమూ జరిగింది. అయితే మొట్టమొదటిసారిగా పూర్తిగా ఛందస్సు కట్టుబాట్లను పరిత్యజించడం నానాలాల్‌తోనే ప్రారంభమైంది. నవ్యసృష్టి అయిన లయాత్మకశైలీ విన్యాసం ద్వారా దీని నాయన సాధించడం జరిగింది. కవితారచనకు సంగీతలయను నియమబద్ధంగా అనుసరించాడు నానాలాల్. దీనిద్వారా ఆయన తనలయాత్మకశైలి 'ఒక విశిష్ట వాక్యరచన నిబద్ధతకులోగి రూపొందిందేకాని ఇష్టంవచ్చిన పద్ధతిలో క్రమరహితమైన మాటలకూర్పు, పేర్పుకాదన్న' విషయం ప్రకటించినట్లయింది.

నర్మద్‌కవి అడుగుజాడలు అనుసరించి – ఆయన మహా ఛందం (గ్రాండ్‌మీటర్) సృష్టించడానికి ఎంతగాతపనపడి రూపొందించారో – ఇది గుజరాతీలో మృదుచ్ఛందోరీతికి తుల్యస్థానీయము – నానాలాల్ తానుకూడా లయాత్మకశైలిని ప్రత్యక్షీకరించుకొని 'కొలంబస్ అన్వేషణస్థాయిలోని' తప్పిబ్బుకు గురి అయినానని తెలియజేశాడు. ఈ విషయంలో తాను సువిఖ్యాతులైన వాల్ట్‌విట్‌మన్, ఇంకా ఇతర ఫ్రెంచికవుల సహస్థాయిత్వం సంపాదించుకోగలిగానని చెప్పుకున్నాడు. ఈ ప్రసిద్ధులైన కవులు తమ కవితా రచనకు ముక్తచ్ఛందంలేదా స్వేచ్ఛాగీతం స్వీకరించినవారు. మొట్ట మొదటిసారిగా నానాలాల్ వసంతోత్సవ కావ్యరచనలో ముక్తచ్ఛందం ప్రయత్నించాడు. తరవాత విరివిగా ఎన్నో రచనలలో పద్యకృతులలో, రూపకాలలో దీనినాయన వినియోగించారు. దీనినిగూర్చి కొందరు లయబద్ధ మైన వచనంకన్నా విశేషించి ఇందులో ఏమీలేదని కొన్నిసార్లు వ్యాఖ్యానించి ఉన్నా, నానాలాల్ స్వీయసృష్టి అయిన దోలన్‌శైలి, దాని పారమ్యస్థాయిలో ఆ మాధ్యమంలో విశిష్టమైన సత్ఫలితాలనే సాధించి ఆయనను అగ్రశ్రేణి కవులకోవలో నిలిపిందని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఇక్కడ ఒక విషయం కూడా అనుసంధించుకోవాలి. నానాలాల్ పూర్వచ్ఛందో రీతులలో కూడా చాలా రచనలు చేశాడు. ఈ రచనలలో ఆయన ప్రదర్శించిన గొప్ప కవితా ప్రతిభనుచూస్తే, మార్గకవితారీతులలో చూపడానికి శక్తుడుకాని ప్రతిభా దారిద్ర్యాన్ని కప్పిపుచ్చుకునేందుకుగాను, లయాత్మకమైనశైలిని ఆయన ఆశ్రయించాడనటం, ఎంత సత్యదూరమో అవగతం కాగలదు. లయాత్మక శైలి నాయన స్వీకరించడం మాత్రం కొందరికి ఏమాత్రమూ ఇష్టంలేక

పోయింది. బొమలు సాగదీసుకొనే వైముఖ్యాన్నే ఈ ప్రయత్నంపట్ల వారు వ్యక్తం చేశారు. ఛందోగణబద్ధంకాని ముక్త కవితవైపే ఆయన మొగ్గు చూపాడు. అయితే సమకాలీన సాహిత్యంలోను (ఇతరత్రాను) కనిపించే కవితవంటిదిగాదు అయన కవిత్వం. ఆయన ఏనాడూ పద్యాన్నీ కవిత్వాన్నీ అవినా భావంకలవిగా చూడలేదు. ఇటు వచనరచనా నియమనిబంధనలూ అటు పద్య రచనా నిబంధనలూ తన కవిత్వంలో ఆయన ఛేదించివేశాడు.

## గుజరాత్‌నుగూర్చి భారతదేశాన్నిగూర్చి రచించిన కవితలు

1903, 1908, 1935 సంవత్సరాలలో నానాలాల్ తన గీతాలను 'కెతలంక్‌కవ్యో' (కొన్ని కవితలు) అనే పేరుతో మూడు సంకలనాలుగా ప్రచురించాడు. అటుతరవాత ఇవి చాలా ముద్రణలే పొందాయి. (ఇందులో కొన్ని గుజరాత్ ప్రజలనోళ్ళలో నర్తించాయి). ఇందువల్ల కవిగా ఆయన ఎంత ప్రసిద్ధి సాధించాడో తెలుస్తున్నది. ఇవి కాకుండా ఇంకా ఆయన రచించిన పాటల సంపుటాలు, రాసలు, భక్తిగీతాలు, వ్యక్తిగీతాలు ఉన్నవి. వీటికితోడు 'చిత్ర–దర్శనో' అనే చిత్రగీతాలు కూడా వెలువడ్డాయి. చిత్రపట రచనవంటివి పద్యాలు. ఇవన్నీ చాలా సంపుటాలుగా వచ్చాయి. ఆయన అన్నట్లు కవితారచనలో ఒక అంతర్జాతీయ సంప్రదాయాన్నే, ఆదర్శాన్నే తాను అవలంబించినా ఆయన దృష్టి గుజరాత్‌ను ఏ మాత్రమూ విస్మరించ లేదు. విలక్షణమైన ఈ ప్రాంతపు ప్రకృతి సౌందర్యం, జీవితం, సంస్కృతి, ఆయన తన కవితావస్తువుగా చేసుకున్నాడు ఆయనకు పూర్వంగాని, ఆ తర్వాతగాని ఈ విషయం ఈ విధంగా నిర్వహించినవాళ్ళు తక్కువమంది మాత్రమే కనపడతారు. అయినప్పటికీ నానాలాల్ కవిత్వాన్ని ఒక ప్రాంతీయ మైనదిగా, ఆ సంకుచితార్థంలో మనం అర్థం చేసుకోకూడదు. ఎందుకంటే ఆయన తన కవిత్వంలో ప్రదర్శించిన కవితోద్వేగాలు, ప్రేమ భక్తి, దేశ భక్తి, శౌర్యము, ఆనందం, ఉల్లాసం, విశ్వజనీనమైనవి. అయితే వాటి ప్రవృత్తి స్థానికంగా గుజరాత్ దేశీయమై ఉండవచ్చు.

గుజరాత్ దేశసౌందర్యాన్నీ మహత్వాన్నీ ఇంతగా నానాలాల్ రచనలు గర్భీకరించుకొన్నవి కాబట్టే, గుజరాత్‌నుగూర్చి వెలువడిన అత్యంత సుందర గీతాలలో ప్రముఖమైనది నానాలాల్ కలంనుంచే వెలువడి

ఉండటంలో ఆశ్చర్య మేమీ లేదు. ఈ కవిత కీర్తనరూపంలో వ్రాశాడాయన. దీని నాయన మంత్రపఠనంలాగా పఠించడానికి అనువుగా ఉండేట్లు కూర్చారు కాని, కేవలం పాడుకోనే పాటగా మాత్రమే కాదు. ప్రాంతీయాభి మానోన్మాదాన్ని రెచ్చకొట్టడానికి ఉద్దేశించింది ఎంతమాత్రమూ కాదది. గుజరాత్ దేశపు సుందరోజ్జ్వలరూపపట చిత్రణ మిది. ఈ ప్రాంత చరిత్ర, నైసర్గిక భూగోళ పరిస్థితులు, ప్రకృతి సౌందర్యం, నగరాలు, పల్లెలు, స్త్రీ పురుషుల విశిష్ట జీవితవిధానం, వర్ణితమైనది. సూక్ష్మంగా చెప్పాలంటే గుజరాత్‌కు కవి అర్పించిన జయాభివాద వందన గీతం ఇది.

ధన్యమహో ధన్యమహో, ఈదేశం ధన్యం
మామంచి గుజరాతుదేశం
శ్రీకృష్ణుడు తనదిగా చేసుకొన్నదేశం
మామంచి గుజరాతుదేశం
ఇక్కడ యుగయుగాలుగా ధ్యానముద్రలో ఉన్నవాటిలా
సోమనాథ్, గిర్నార్, ద్వారకలు
ఇక్కడ ఎక్కడ చూసినా
అప్పుడే అరవిరిసిన పువ్వులు
లతానికుంజాలు
నదీ తటమ్ముల, కాలువ ఒడ్డుల
ఇక్కడ సంద్రం తనపురావైభవ గీతికను పాడుతుంది
ఇక్కడ సింహం గర్జిస్తుంది
తన కాననములలో
గిరి శృంగముల దేశ మిది
దేవమందిరములు, విద్వాంసులు, యోగులు
ధన్యమహో ధన్యమహో ఈదేశం ధన్యం
మామంచి గుజరాతు దేశం
దయానందునిదీ దేశం
గాంధీ పుట్టిన దేశం
మా మంచి గుజరాతు దేశం,

గుజరాత్ దేశాన్ని గురించి అత్యంత భావోద్వేగంతో అభిమానంతో వ్రాసిన ఈ గీతాన్ని కేవలం కవి ప్రాంతీయాభిమాన తత్త్వమని, స్థానికారాధన తత్పరత్వమని భావించటం సమంజసం కాదు. భారత దేశాన్ని స్తుతిస్తూ (ఇందుకుమార్), భారతీయులను ఉత్తేజపరుస్తూ, ప్రాచీన వారసత్వాన్ని సంరక్షించుకుంటూ, సుదృఢం గావించుకుంటూ, ఈ యోగ్యత నిలుపుకుంటూ, ఉండవలసిందన్న ప్రబోధగీతం, గుజరాత్‌పై వ్రాసిన గీతంతో పోల్చి పక్కపక్కగా వాటిని ఉంచి చూడవచ్చు. (రాజ్ సూత్రోని కావ్య త్రిపుటి).

భౌతిక దృష్టికి సులభమే
భారతదేశపు రాయి రప్పల పొరలూ
కశ్మలమూ దర్శించడం
నగల నాణ్యం తెలిసినబేహారి మాత్రమే తన కంటితో
నిక్షిప్తమై ఉన్న వజ్రాన్ని కనుక్కో గలడు
ముత్యపు చిప్పను తొలుచుకొని పోగలిగిన
చూపు మాత్రమే అందులో ముత్యపు ఉనికినిగూర్చి తెలియగలదు
సూర్యుడిలో కూడా మచ్చ లున్నాయి
అందువల్ల ఉజ్జ్వలనభోమణిని
చీకటి కమ్మివేయగలదా
వెలుతురులా స్పష్టంగా ఉన్నది మా చరిత్ర
పశ్చిమదేశపు ఉయ్యాల తొట్టి
ప్రాచీన గ్రీసుకు, రోము నగరానికి;
ప్రాచీన ఈజిప్టుదేశపు, బాబిలోనుల
పెద్దక్కగారు భారతదేశం
ప్రాచీనదేశాలలో కెల్లాప్రాచీనమైనది
యుగయుగాలుగా కొల్లగొట్టారు. అయినా సుసంపన్నం
ప్రతి యుగంలోనూ బాధించారు, గాయపరిచారు
అయినప్పటికీ చిరంజీవి
సర్వలోకాధినాథుడే సృష్టించాడు
ప్రపంచ ఆధ్యాత్మిక సంపదను పెంపొందించేందుకు

సత్యమొక్కటే జయిస్తుంది, అసత్యం కాదు
అని చాటి చెప్పేందుకు
భారతదేశం ఇంకా సజీవంగా ఉంది.

ఈ గీతాన్ని నానాలాల్ 1909 వ సంవత్సరంలోనే రచించారు. ఈ గీతపు చివరి చరణమైన 'సత్యమేవజయతే' అటుతరవాత భారతదేశపు అధికారమకుట ముద్రలో స్థానం సంపాదించుకొన్నది.

గుజరాత్ వట్ల కాని, భారత దేశంపట్లకాని కవి ప్రదర్శించిన వైఖరి పొగడ్తలతో కూడి ఉంది. అతిశయ కాల్పనికమైన ఊహావిహారమైనదావైఖరి. అయితే బహుశః ఇటువంటి గీతాలలో ఇది సహజమూ అపరిహార్యమూ కూడా కావచ్చు.

## వైయక్తిక గీతాలు

తన గురువూ ఉపదేశకుడూ అయిన కాశీరామ్ దవేనుగూర్చి, మిత్రుడైన అమృతలాల్ పఢియార్‌ను గూర్చి, తండ్రిగారైన దలపత్‌రామ్‌ను గూర్చి, ఇల్లాలు మానెక్‌బాయిని గూర్చి ఆయన వ్రాసిన గీతాలు ఈ విభాగంలో చేరుతాయి. వీటన్నిటిలోనూ చాలా కదిలించే గీతం, చిరస్మరణీయమైనదీ తన తండ్రిగారినిగూర్చి వ్రాసిన 'పితృతర్పణం' అనే స్మృతి గీతి కానివాళి. నానాలాల్ వ్రాసిన ఈ గీతాలలో అతి సన్నిహిత వ్యక్తిగత విషయాల ప్రస్తావన ఉండడం సహజమే. జరిగిపోయిన సంగతులను జ్ఞాపకం తెచ్చుకుంటూ మననం చేసుకుంటున్నధోరణిలో తండ్రి కొడుకుల జీవితంలో జరిగిపోయిన వివిధ సన్నివేశాలను, ఘటనలను, గూర్చి సాగింది. అయితే అశ్రు మలినంగానూ, వెక్కులాపుకొంటున్న ధోరణిలోనూ కాకుండా ప్రశాంతమైన మనస్సుతో, గౌరవంతో, గాఢమైన ప్రపత్తితో, భావోద్వేగాలతో ఈ రచన సాగింది. అంతేకాని యౌవన ప్రాంగణంలోకి అడుగుపెట్టబోతూ తెలిసీ తెలియని వయసు కుమారుడు వృద్ధాప్యపు కునికిపాట్ల తండ్రి యెడల కనపరచిన అవిధేయతలను గూర్చి బాధాకరమైన పశ్చాత్తాప చింతతో మాత్రం కాదు. చిత్రదర్శనోలోని పద్యచిత్రాలలో (ఈ రచన కూడా ఇందులోనిదే) 'రంగులతో చిత్రించినంత సజీవవాస్తవికత ఉట్టిపడుతున్నది. ఈ అభిప్రాయాన్ని నానాలాలే వెలిబుచ్చాడు. తన తండ్రిగారిని

గురించి చిత్రించిన ఈ పితృచిత్రంలోనైనా కనీసం ఈ అభిప్రాయం నిజంగా వర్తిస్తుంది. భక్తి ప్రపత్తులతోనూ, ప్రేమానురాగాలతోనూ కవి పుత్రుడు చిత్రించిన వర్ణచిత్రంనుంచి పద్యాకృతి అనే వర్ణ చిత్రపటంలో రూపరేఖలతో స్పష్టాకృతికంగా ఆయనతండ్రిగారు దర్శనమిస్తున్నాడు.

వ్యక్తిగతమైన కవితల విభాగంలోనే ఒక ప్రత్యేకవర్గానికి చెందిన కవితలు తన ఇల్లాలు మానెక్బాను ఉద్దేశించి ఆయన కూర్చిన కవితలు. తమ దీర్ఘకాల సంతోష వైవాహిక జీవితానికి సంబంధించినవీ కవితలు. కవికి ఆమెపట్ల గల ప్రేమానురాగాలను, అరాధనాభావాన్ని చిత్రించే రచనలివి. పరిపక్వమైన ప్రణయ తత్త్వ ప్రదర్శకములై, ప్రేమనుగూర్చి, ప్రేమవివాహాన్ని గూర్చి, ప్రేమాదర్శాన్ని గూర్చి రెండు ఆత్మలుపరస్పర సామరస్య పరిపూర్ణంగా ఏకంకావడమే ఆయన దర్శించే ప్రేమాదర్శం. వ్యక్తిగతమైన అనుభూతుల స్థాయిలో ఈ కవితలు, ఆయన భావాలకు ఉదాహరణలుగా ఉన్నవి. కూర్పులో ప్రణయగీతాలే అయినప్పటికీ శరీరకమైన సౌందర్యాన్ని గూర్చి గాని ఆనందాన్ని గూర్చిగాని ప్రస్తావన ఏమాత్రమూ వీటిలో కనపడదు. శాశ్వతమైన భార్యాభర్తల అనుబంధంలోని ఆనంద సౌందర్యాలమధ్య ఇటు వంటి ఆకర్షణలకు తావులేదని భావం. సనాతన భారతీయాదర్శానికి అను గుణంగా కవి తమ ధర్మపత్నిని సంబోధిస్తూ 'జీవన సతిని' అనీ 'ప్రాణే శ్వరి' అని పేర్కొంటారు ఒక కవితలో. జీవితంలో ఆమె ప్రసాదించిన వెలుగుకు, సౌఖ్యానికి ఆమెకు మనోహరమైన రీతిలో కృతజ్ఞతలు తెలుపు కుంటారు. తొట్టతొలుతటి కవితాసంకలనాన్ని కవి ఆమెకే అంకితం చేశాడు (1903). ఆయన వ్రాసిన కవిత లన్నింటిలోనూ పరమ సుందరంగా కొన్ని చరణాలలో పున్నమ చంద్రుణ్ణి ఆయన తమ ఇల్లాలిని గూర్చి వ్రాసిన కవి తలో వర్ణించాడు. మబ్బులోంచి చీల్చుకుని వస్తూ, చల్లని ధవళకాంతితో వెన్నెల కురిసే చందమామను పరమ రమణీయంగా భావుకతాసుందరంగా ఆయన వర్ణించాడు.

ఇవాళ సంతోష ప్రదమైన పున్నమరోజు
చూడు; కోకిల కలగీతం
మేఘపు నల్లని ముసుగును చీల్చి తొలగించింది ఆ
ముక్తప్రదేశంనుంచి, పైకి వస్తున్నాడు

ఆకాశం తెరచిన కన్నులా
పున్నమ చంద్రుడు, వెన్నెల కురుస్తూ

యాదృచ్ఛికంగా ఈ చివరి పాదాన్నే తీసుకొని అన్వయింపజేస్తూ 'పున్నమచంద్రుడు, వెన్నెలలు కురుస్తూ' అనే భావంతోనే, 1905 న సంవత్సరంలో గుజరాతీ సాహిత్యపరిషత్ వేదికనుంచి, నానాలాల్ కవితా రంగంలోకి అడుగుపెట్టడాన్ని సాటికవి అయిన కాంత్ అభివాదపూర్వకంగా వర్ణించాడు.

ఇదే ధోరణిలోనూ బాణీలోనూ ఇంకెన్నో కవితలు వ్రాశాడాయన. ఇల్లాలి నుద్దేశిస్తూ, పదాలు, పదచిత్రాలు, సన్నివేశాలు మారుతాయేకాని. తన ఇల్లాలిపట్ల కవికి గల మెప్పుదల, అనురాగమూ అన్నీ కవితల్లోనూ ఒకేవిధంగా కనపడతాయి. అయితే ప్రియపత్నిపట్ల ఉండే ప్రేమాభిమానాల గాఢోద్విగ్నతవల్ల తరచు ఈ కవితలలో అతిశయోక్తులు, కవిత్వపు ఇంద్రజాలాలు, కవి సమయాలు ప్రవేశించడం నిజం. ఉదాహరణకు కిరీటం (కొన్ని కవితలు), వివాహ వార్షికోత్సవం (అదే సంపుటం), మా పెళ్ళి రోజు (కొన్ని కవితలు, II) చూపవచ్చు. ఈ కవితలలో కవి ప్రియపత్నికి ప్రేమపూర్వకంగా కిరీటాన్ని అలంకరిస్తాడు. అప్పుడే కోసినపూలతోను, వాటిమధ్య నగలతోనూ అలంకరించిన కిరీటం అది. ఆ పూలు ఎన్నటికీ వాడిపోవు. అంటాడాయన. ఇంకొక కవితతో తమ పరస్పర బాంధవ్యాన్ని వర్ణిస్తూ 'యజ్ఞవేదికలోని రెండు శిఖలు పెనవైచుకొని ఒకే జ్వాలాశిఖవలె వెలుగొందడంగా' పోలుస్తాడు.

ఈ భావోద్వేగాలలో ప్రదర్శితమయ్యే చిత్తశుద్ధి, ఆర్జవం, భావ తీవ్రతలు ఎప్పుడూ హృదయావర్జక లక్షణాన్నే వెలారుస్తుంటాయి.

## ప్రే మ గీ తా లు

గీతాలుగాను, నాటకీయ సన్నివేశాలుగానూ, ఆయన పద్యకృతుల లోను, రూపకాలలోను 'విశ్వజనీనమైన ప్రేమసూత్రాన్ని" వివిధ దృక్కోణాలతోను, స్వరూపాలతోను చిత్రీకరించాడు. మూర్తంనుంచి అమూర్తం వరకూ ఆయన ప్రేమస్వరూపపు వివిధస్థాయులను వర్ణించా డీరచనలలో. తొలిదశలో అజ్ఞాత రేఖామాత్రంగా ఉండి నిలువనీయని భావోద్వేగ ముగ్ధ

ప్రణయదశనుంచి, వియోగమంటే దుర్భరంగా భావించే స్థాయినుంచి వైవాహిక పరిపక్వమైన, ఆత్మ సంపూర్ణమైన పరస్పర ప్రేమస్థాయివరకు తన రచనలలో వర్ణించాడు. ప్రేమనుగూర్చి ప్రధానంగా ఆయన భావన కాల్పనిక మైనదే. అయితే మౌలికంగా ఆదర్శమైనది. నైతిక సూత్రాలకు కట్టుబడి ఉండేది. నియమబద్ధమైనది. అక్రమ ప్రణయం, అది ఎంతకాల్ప నికస్థాయి నందుకున్నా నానాలాల్ కవితలోమాత్రం స్థానం పొందలేదు. ఇంతేకాదు 'నిరంతరత్రయం' కల్పన ఆయనకు గిట్టదు. విఫలప్రేమ, ఆత్మ నింద్యమైన ప్రేమ ఆయన రచనల్లో కనిపించవు.

ప్రణయ భావనను గురించి నానాలాల్ దర్శనం జయ-జయంత్‌లో ఆయన వ్రాసిన ఒక పాటద్వారా తెలుసుకోవచ్చు. 'పరమప్రేమ పరబ్రహ్మ' అనేదే ఆయన ఆదర్శ సిద్ధాంతం ప్రేమే దేవుడు. ప్రేమ పవిత్రమైనది. ధర్మవిరోధంలేనిదే నిజమైన ప్రేమ. నానాలాల్ ప్రేమభావనలో భోగ దృష్టి, ఇంద్రియలోలత, శారీరక సుఖం, ఉండనే ఉండవు. పరిశుద్ధమైన, పవిత్రమైన, ఆధ్యాత్మిక ప్రేమలనుగూర్చి ఆయన నొక్కిచెప్పడం, ఆయన పరిశుద్ధతా వాదానికి తార్కాణం. ఆ పదం వ్యక్తంచేసే శ్రేష్ఠమైన అర్థంలో ఆయన నిజంగా పరిశుద్ధవాది అని చెప్పవచ్చు. ప్రతిఫలాపేక్షలేని ప్రేమను గూర్చి ఆయన గానంచేస్తాడు. ఫలాపేక్షతో కూడిన ప్రేమనుగూర్చి కాదు ప్రతిఫలాన్ని అపేక్షించడంలో ఆనంద మేముంటుంది! అని ఆయనభావం. ఉదాత్త ప్రేమను గూర్చి అయన ఏర్పరచుకొన్న భావాలు యథాలాప మైనవి కావు. జీవితంలో ఇదివరకే పరచుకొని ఉన్న విషాదానికి మరి కొంత భారాన్ని చేర్చకూడదు అన్న ఆయన నిర్ణయానికి అనుగుణంగానే ఆయన పరిమితులు పాటించాడు తన ప్రణయ కవితారచనలో. కవి లోకంలో నిర్వహించవలసిన బాధ్యతలను గూర్చి ఆయన భావన కనుగుణంగానే ఆయన రచనలు చేశాడు. లోకానికి కవి సంతోషాన్ని, ఉల్లాసాన్ని మాత్రమే ప్రసాదించాలి. కొత్త ఆశలు చిగురింపచేయాలి. ఉన్నతాదర్శాలతోను, దర్శ నాలతోనూ ఉత్తేజితులను చేయాలి, అనేదే కవిత్వాన్ని గూర్చిన ఆయన భావన. వివాహాన్ని గూర్చి ఆయన భావన చాలా ఉన్నతమైనది. లోకంలో వివాహమనేది లౌకికకామనలతోను, ప్రవృత్తులతోను జరగడం ఆయనకు తెలియనిది కాదు అయితే ఆయన ఆదర్శం పరస్పర ప్రేమపూర్వకమైన

వివాహం. దీనినిమాత్రమే ప్రణయవివాహం అంటాడాయన. అంతేకాని లోకంలో సామాన్యంగా వ్యవహారంలో ఉండే అర్థంతోనో అపార్థంతోనో, మాత్రం కాదు. శారీరకా కర్షణ ప్రేరితమైనవీ, విషాదవైఫల్యధోరణి కలవీ తప్ప ప్రేమరీతు లన్నిటినీ మిక్కిలి కవితాత్మకంగా, రమణీయంగా, రంజ కంగా సంగీతలయాత్మకమైన శైలితో నానాలాల్ వర్ణించాడు.

అద్భుతమైన వేణునాదం వినిపించింది
నిద్రనుంచి నన్ను మేల్కొలిపింది
ఆ సంగీతం తరంగాలుగా నావైపు ప్రవహించింది
నా హృదయ సర్వస్వాన్ని స్పృశించింది
నిద్రనుంచి నన్ను మేల్కొలిపింది
అద్భుతమైన వేణునాదం వినిపించింది (నానారాస–1)

వేణువు ఇక్కడ ఒక సంకేతం అనేది స్పష్టమే. భావసాదృశ్యాన్ని ఒక పోలికలనుబట్టి, ఈ వేణువు గోపబాలుని మురళితోను, అది గోపికలవైపు ప్రసరింపజేసిన ప్రభావంతోనూ పోలిక గలిగి ఉన్నాయి. వసంతోత్సవ గీతంలో, నాయకుని మర్త్యహస్తాలలో ధరించిన వేణువుకూడా ఇటువంటి అంతరార్థాన్నే సూచిస్తున్నది. అది ఇటువంటి ప్రభావాన్నే నాయికపై ప్రస రింప చేసింది. అటుతరవాత నాయికా నాయకుల మధ్య ప్రేమ అంకురించి, పుష్పించి, ఫలించి, వారి మానసాల, ఆత్మల సంయోగం ద్వారా వివాహంగా పరిణమించింది.

ఈ విధమైన అతి సున్నితమైన భావోద్విగ్నత మాటలలో వర్ణించడం కష్టం. దానిని భావనా పూర్వకంగా అనుభవించవలసిందే. పుష్పాన్ని చూస్తూ ఉన్నప్పటికీ, అలముకొని వస్తున్న దాని పరిమళాన్ని చూడలేముకదా!

'ఏదీ నాకు చూపించు నీవు చూసి ఉంటే
హృదయ పరిమళాన్ని
సహస్రదళ కమలంనుండి వాసించిన దానిని
చేతనైతే నాకు చూపు
ప్రతి పువ్వులోనూ ఉంది అది
ప్రతి మొగ్గలోనూ బంధితమై ఉంది

గాలిలో తేలుతూనూ ఉన్నది
హృదయంలోని సుమధుర సువాసనవలె
(అర్థ శతాబ్దిన అనుభవబోల్)

జయ – జయంత్ రూపకంలో పాటలుగా కూర్చిన ఒక సంగీతంలో ప్రేమికుల సమాగంలోని పారవశ్యాన్ని, ప్రేమికుడు తన ప్రియురాలి కన్నులలోకి చూసే మధురక్షణాన్ని వర్ణిస్తాడు కవి.

ఆకాశంలో మిరుమిట్లు గొలిపే ప్రభావిద్యుత్కాంతిలా
నీ కనులలో కాంతి తళుకు మంటున్నది
నేను చూస్తున్నాను
ఆ ప్రణయ జ్వాలదీప్తిముందు నతుడ నవుతున్నాను
వియోగం నిశీధం
అంధకారం దట్టంగా అలముకొన్నది
కాని ఇప్పుడు నేను వెలుగుజ్వాల చూస్తున్నాను
నీ కనులలో వెలుగుతున్న ప్రేమకాంతిని
మన కళ్ళు పరస్పరం చూసుకోవడం
మన ఆత్మలు రెండూ కలుసుకోవడం
భవితవ్యపు తీర్పు
ప్రేమ యాత్రికులు చదవడం
నీ నయనాలలోని ప్రేమజ్వాలా దీప్తి
నేను చూస్తున్నాను ప్రణయ జ్వాలను
పవిత్రమైన ప్రేమకాంతి ముందు నతుడ నవుతున్నాను.

నానాలాల్ విషయంలో ప్రేమ పవిత్రమైన భావోద్వేగం. ఆయన ప్రేమను వర్ణించడంలోని వివిధదశలలోను, వివిధగతులలోను ఈ పావిత్ర్య దృక్పథం సువ్యక్తమవుతూ ఉంటుంది. ఫలాగమం, వియోగం, ఎడబాటు, పునఃప్రాప్తి – మొదలైన స్త్రీ పురుషుల భావోద్వేగపు అనుబంధాల వర్ణన లన్నిటా నానాలాల్ ఇటువంటి వైఖరినే, అంటే పవిత్ర భావాలనే ప్రదర్శిం చడం చూడవచ్చు. అయితే కవిత్వ సంప్రదాయానికి అనుగుణంగా ఈ భావోద్వేగాలను స్త్రీల పలుకుల ద్వారానే వ్యక్తీకరిస్తాడు కవి నానాలాల్

దృష్ట్యా ప్రణయం వివాహం ద్వారానే ఫలసిద్ధి నొందుతుంది. అయితే వివాహ మనగానే భౌతిక సంయోగం విధిగా ఉండితీరాలి అనుకోవాల్సిన అక్కర లేదంటాడాయన. ఆయన రూపకాలలో ఒకటైన జయ-జయంత్ ఉదాహర ణకు ఆయన సృష్టించిన నాయికా నాయకులు నిజంగా ప్రేమించుకొన్నప్ప టికీ, ఆధ్యాత్మికంగా మానవజాతిని ఉన్నతికి తీసుకొనిపోవడానికై, ఆధ్యాత్మిక పరిణయం మాత్రమే అవలంబిస్తారు. నానాలాల్ అవలంబించిన విపరీత కాల్పనికత, అతీతాదర్శాలకు దీని నొక ఉదాహరణగా భావించవచ్చు. ప్రేమ, వివాహం విషయమై ఆయకుగల ఆధ్యాత్మికభావోన్నతిని ప్రము ఖంగా ప్రదర్శించడానికి జయ - జయంత్‌లో ఆయన ఇట్లా వర్ణించి ఉండ వచ్చు. అయితే ఇతర సందర్భాలలో ఆయన ప్రేమ, పెండ్లి విషయాలలో గృహస్థ జీవితానుభవాలనే ప్రతిపాదించి అభివర్ణించడం జరిగింది. కాని శారీరకమైన ప్రవృత్తుల స్థాయికి దిగజారిపోకుండా పవిత్ర దాంపత్యజీవిత ప్రణయమే, సుస్వరమహితంగా ఆయన గానం చేశాడు.

'విలాసిని శోభ' (కొన్ని కవితలు, 11) అనే పెద్ద కవితలో మహిళ లకు సంబంధించి ఆయన అభిప్రాయంలో అతి ముఖ్యమైన విషయాన్ని-అంటే జీవిత సౌందర్యం, జీవితానందం, ఇవి నిర్మలమైన ప్రేమ ద్వారానే లభి స్తాయి – అని ప్రస్తావించారు. ఇంకా ఈ విధంగా అన్నాడాయన. మహిళ వివాహితురాలైనా, అవివాహితురాలైనా, వితంతువైనా, సన్నుతి పాత్రురా లనీ, ఆమెకు తన జీవితంలో సంపూర్ణమైన స్వాతంత్ర్యం ఉండాలనీ ఆయన ప్రకటించాడు.

కవితాపరంగా ఈ విషయాన్ని వివరించి చూపడానికి కవి ముగ్గురు యువతులను రూపకల్పన చేశాడు. ఆ ముగ్గురు యువతులూ అవివాహిత, వివాహిత, వితంతువులు. వెన్నెలలో ఆ ముగ్గురూ ఆకాశమార్గాన ప్రయాణం చేస్తున్నారు అవివాహిత యువతి ఇంతలో 'స్వర్గ గంగ' గా రూపాంతరం చెందింది. వివాహిత యువతి 'చంద్రిక' గా పరివర్తనం పొందింది. విగత భర్తృక 'తారిక' గా మారిపోయింది. ఈ ముగ్గురూ తమ సంభాషణలో తమ అంతస్తును గురించీ తమ జీవితాశయాలను గురించీ వెల్లడిస్తారు. స్త్రీత్వపు ఈ మూడు స్థితులలోనూ అందచందాలున్నా యథార్థమైన జీవితానందం

పరిణయ గమ్యమైన ప్రణయం ద్వారానే సిద్ధిస్తుందని నొక్కి చెపుతూ ముగించాడు కవి.

విశుద్ధ హృదయులైన ఓ ప్రేమ పుత్రులారా, పుత్రికలారా
'కులధర్మం' విస్మరించవద్దు, వద్దు, వద్దు
ప్రేమ పర్యవసితమైన పెళ్ళిలో నేమిసంక్షేమం ఉంది
అందులోనే అస్తిత్వపు దివ్యానందం లభిస్తుంది.

అయితే స్త్రీలు, పురుషులు, సత్యమైన ప్రేమకు, అసత్యమైన దానికీ గల అంతరం గుర్తించగలగాలి అంటాడాయన.

సుఖం, దుఃఖం, వెలుగు, చీకటి
సత్యం, అసత్యం
జీవితంలోని ద్వంద్వాలు
ఇది జీవితపు కథ
తెలుపు నలుపుల్లో వ్రాసినది
జీవితపు సరస్సులో అమృతం ఉంది
అందులోనే విషం ఉందికూడా
వివేచన అనేది హంస
దానికి నిజంగా తెలుసు
అమృతాన్ని ఏ విధంగా ఆస్వాదించాలో
విషాన్ని విడిగా ఎలా వదిలివేయాలో.

నానాలాల్ కవిత లన్నిటా ప్రేమను గూర్చిన వర్ణన ఉంటుంది. సత్యమైన ప్రేమకు, కృతక ప్రేమకు, వాస్తవమైన ప్రేమకు, కేవలం పైకి మాత్రం కనపడే ప్రేమకు గల తారతమ్యం వర్ణిత మవుతుంది. సత్యమైన ప్రేమ నానాలాల్ కవితలో భౌతిక పరిధుల కతీతంగానూ, కృతకమైన ప్రేమ కేవలం తారుణ్యోద్రేకంతోనుకూడి, ఇంద్రియ సుఖకేంద్రమై ఉండేది గానూ వర్ణితమవుతుంది. నానాలాల్ ప్రేమను, వివాహాన్నీ ఉభయాన్నీ కూడా తన భావుకత్వ మధురగీత కవితా పరమావధిగా, ఆదర్శమహితమూ, కల్పనాభరితమూ చేశాడు.

బహుశః ఈ లక్షణం తక్కిన అన్ని రచనలలోకన్నా చాలా మిక్కుటంగా తాజమహల్‌పై ఆయన వ్రాసిన కవితలో వ్యక్త మవుతున్నది. ఈ కవితను 'చిత్రదర్శనా' సంపుటంలో చేర్చడం జరిగింది.

తాజ్‌మహల్‌పై వ్రాసిన కవితలో నిరుపమాన ప్రేమికులైన ముంతాజ్ షాజహాన్‌ల జీవిత కథతో ఈయన ఎక్కువ ప్రసక్తి పెట్టుకోలేదు. అమరమైన ప్రేమ స్మృతి చిహ్నంగా ఒక ప్రేమికుడు తన ప్రియురాలికై నిర్మించిన పాలరాతి నిర్మాణపు సందేశమే ఆయనకు ముఖ్యం. తాజమహల్ కవి దృష్టిలో నిరుపమానమైన అభిరామ శిల్పకళా సౌందర్యానికి ఎటువంటి సంకేతమో అంతగానూ అమర ప్రణయానికి చిహ్నం.

ఏనాటికీ క్షతిలేని వధూవరుల
కళ్యాణమండప లతానికుంజమా ఏమి ఇది?
లేదా భగ్నహృదయ ప్రేమికుని
బూడిద కుప్పా?

షాజహాన్‌కు తన ప్రియురాలైన ముంతాజ్‌పట్ల గల మహోన్నత ప్రేమ చిహ్నంగా వెలసిన పరమ సుందర దివ్యభవనం తాజమహల్. పరస్పరం శాశ్వత ప్రణయ పరిణీతులు వాళ్లిద్దరూ.

శ్రీ కృష్ణదేవుని వేణుగీతిలా నర్తిస్తూ
బృందావనం నుంచి యమున కదలి వస్తున్నది
ఈ నది ఒడ్డుననే
సౌందర్య పుష్పం వికసించింది
ఆకాశంలో చీకటి పలచబడుతున్నది
వేకువ తొలి తెలికాంతులతో సమ్మిళితం చెందుతున్నది
ఆ తరవాత కాంతి జలయంత్ర ధారవలె
ప్రేమ స్వరూప ఉదయతార పొడుస్తుంది.

తెల్లని పాలరాతిలో మలచిన స్మృత్యంక మందిరం, ఆ శిలలే నిశ్శబ్దంగా అమర ప్రేమ సందేశాన్ని ప్రకటిస్తూ ఉండగా, కాలపునిర్దయాత్మకమైన పిడికిలిలో ఈ ప్రేమ ఏనాటికీ ఇమిడిపోయేది కాదు. ఎందువల్లనంటే:

సౌందర్యాన్ని ప్రేమనూ
మృత్యువు జయించలేదు
కాబట్టి
సూర్యు డెల్లప్పుడూ ఉదయిస్తాడు అస్తమిస్తాడు
యమునా జలాలు వస్తుంటాయి పోతుంటాయి
కాని తాజ్ ఆహ్లాద మధుర ప్రేమజ్వాల
ప్రేమ దీపంగా ప్రకాశిస్తుంది
ప్రతివ్యక్తి ప్రేమ హృదయంలోనూ

తాజ్‌మహల్‌ను ప్రపంచాద్భుత నిర్మాణంగా భావించి మెప్పు కనపర చడంకంటే, నానాలాల్ దానిని వైవాహిక ప్రణయానికి పరమ రమణీయ రూపకల్పనగానే సందర్శించాడు.

రాసిపోసిన వెన్నెల కుప్పలాగా
పున్నమ చంద్రుని ధవళ దివ్యకాంతితో
తాజమహల్ నిలిచి ఉంది
ప్రణయ సుస్వర గీతం
ప్రేమికు లిద్దరి
ప్రణయాత్మల ఐక్యాను సంధానం

ప్రపంచాద్భుతాలలో ఒకటి అయిన తాజమహల్ కవులను ఎంతగానో ఆకట్టుకోవడంలో ఏమాత్రమూ ఆశ్చర్యం లేదు అందువల్లనే కవులెందరో తాజమహల్ సౌందర్యాన్ని గూర్చి అది స్మరింపజేసే ప్రణయాన్ని గూర్చి పారవశ్యంతో తనివితీరా గానం చేశారు. వారితోపాటుగా నానాలాల్ కూడా దాని మహోన్నత సౌందర్యాన్నిగూర్చి గానం చేశాడు. కాని ఇతరులవలె వారి ప్రణయాన్ని మాత్రమేకాక గార్హస్థ్య ప్రణయాన్ని గూర్చి కూడ తన విశ్వాసాలకు అనుగుణంగా గానం చేశాడు. ఆయన అభిప్రాయంలో గార్హస్థ్య ప్రణయమే ప్రేమాభివ్యక్తిలో సర్వోత్తమమైనది.

## వీర గీతా లు

ముఖ్యంగా ధర్మబద్ధమైన వైవాహిక ప్రణయాన్ని గానం చేస్తూ నానాలాల్ ప్రేమ కవితలు రచించడంలోనూ ప్రేమనుగూర్చి కీర్తించడం

లోనూ సర్వశ్రేష్ఠుడైన ప్రతిభాశాలి అయినప్పటికీ ఆయన వర్ణసంయోజన ఫలకంలో ఇంతర రంజన ద్రవ్యాలుకూడా ఉన్నాయి. ఈ రంగుల నాయన సున్నితంగా కళాత్మకంగా మానవ హృదయంలోని ఇతర భావోద్వేగాలను సంయోజనం చేసేటప్పుడు వాడుకుంటాడు. ఈ భావోద్వేగాలలోనూ, రసాల లోను ముఖ్యంగా పేర్కొనవలసింది వీర రసం. ఆయన రచించిన మహా కావ్యమైన కురుక్షేత్రంలో ఈ వీరరసోద్వేగాల నాయన ప్రతిభావంతంగా వర్ణించాడు. చాలా విశదంగా చూపాడు. అయితే మధురప్రేమ గీతాలలో కూడా ఈ వీరరసోద్వేగపు ఛాయలు అక్కడక్కడ ఆయన కనపరచాడు. చిన్నచిన్న భావగీతికలలోకూడా ఈ భావాలు కనపడతవి. తరచు ఆయ నలో వీరరస భావోద్వేగం, విడిగా కనిపించకుండానే ప్రేమోద్వేగ భావంలో అంతర్లీనమైపోతుంది. ఉదాహరణకు 'వీర్ నివిదమ్' అంటే వీరునికి వీడ్కోలు అనే కవితలో ఈ విషయం చూడవచ్చు.

మధ్యయుగపు రాజపుత్ర సాహస పరాక్రమాలను చారిత్రకభూమి కగా స్వీకరించి, ఆయన ఒక కవితలో ఒక యువ రాజపుత్రవీరుడు ఇల్లు విడిచి యుద్ధభూమికి పయనం సాగించడం వర్ణించాడు. రణకాహళ విని పించగానే సన్నద్ధుడై బయలుదేరతాడు యువవీరుడు. వీరపత్ని అతడికి ఉత్సవపు వీడ్కోలునే ఇస్తుంది. నానాలాల్ కలం నుంచి వెలువడిన అత్యు త్తమ కవితలలో ఒకటి అయిన ఈ కవిత, రాజపుత్ర స్త్రీ సహజమైన అత్యు దాత్తమైన, సంయమనంతో కూడిన భావోద్వేగ పూరితమైన ప్రబోధ గీతం రూపంలో ఉంది. యోధవీరుడైన తన భర్తకు సర్వ శుభాలూ శీఘ్రంగా కలగాలనీ జయం కలగాలనీ ఆశిస్తూ, ఆమె మాటలుగా సాగుతుంది ఈ కవిత.

మాహ్రర కేసర్ భీనకాంత్
సిధ వౌజిరణవత్ (కొన్ని కవితలు, 11)

పాటకు ఈ చరణాలలో స్వరసుభగత్వానికి ఎంతగానో ఉపకరించే అంత్య ప్రాస సంగతి అట్లా ఉండనిచ్చి 'కేసర్ భీనకాంత్' అనే సంబోధన యోధవీరుడైన భర్తకు (కాంత్) తగి ఉన్నది. యుద్ధభూమికి బయలుదేర డానికి సన్నద్ధుడై శుభసూచకంగా ఫాలభాగాన కేసర్ అంటే కుంకుమను అలదుకొని ఉన్నవాడని అర్థం. కేసర్ అంటే సిందూరం.

సిందూరాంచిత ఫాలభాగంతో నా ప్రభూ
యుద్ధభూమికి బయలుదేరు

ప్రాచీన రాజపుత్రస్థానపు మధ్యయుగపు వాతావరణం, రణభూమికి అత్యుత్సాహంతో సాగిపోయే రాజపుత్ర యుద్ధవీరులూ, ఈ కవితలో ఇతి వృత్తం. కవి కుంచెసొరింపులతో వీరపత్ని మాటలీ విధంగా వినపడతాయి.

శంఖాల భేరీల ఘననినదంతో
ఆకాశం ప్రతిధ్వనిస్తున్నది, భూమి మూర్ఛిల్లుతున్నది
నా ప్రభువుకు ఘన విజయం
రణకేతనం ఎత్తడం జరిగింది
సింహద్వారంవద్ద మదగజం ఘీంకరిస్తున్నది
వందిమాగధుల కైవారాలతో
కోట అంతా ప్రతితరంగిత మవుతున్నది.

రాజపుత్ర స్త్రీలు కూడా యుద్ధవిద్య నేర్చినవారే. ప్రాణనాథు డనుమతిస్తే యుద్ధానికి కూడా సన్నద్ధులై వారువెంట వెళ్ళగలరు. మహావీరుడైన తన ప్రాణపతి బయలుదేరుతూ ఉండగా వీరపత్ని ఇట్లా అంటున్నది. విజయుడై విభుడు తిరిగివచ్చేవరకూ తాను ప్రతీక్షిస్తూ ఉంటాననీ, అప్పుడు తానుకూడా ఆయనతో విజయోత్సవంలో పాల్గొంటాననీ చెపుతుంది. ఒకవేళ రణభూమిలోనే భర్త పోరుతూ హతుడయ్యే పక్షంలో రాజపుత్ర వీరపత్నీ సంప్రదాయానికి అనుగుణంగా తనుత్యాగం చేసి అనుగమించి స్వర్గంలో అతణ్ణి కలుసుకుంటానని చెపుతుంది.

ఇక్కడ ప్రధానమైన వీరరసోద్వేగ భావన కవితా రూపంగా తరుణ వీరుడు, ఆయన ఇల్లాలి ప్రేమగాథగా పెనవైచుకొని సాగింది. వీరుడు తన క్షాత్రగౌరవాన్ని అధికంగా ప్రేమించినా, అందువల్ల తనను అంతకన్నా తక్కువగా ప్రేమించడని వీరపత్ని నమ్మకం.

వీరరసాత్మక ధోరణిలో ఆయన వ్రాసిన అంకా ఇతర కవితలెన్నో ఉన్నవి. 'షూకన్ ఘడియో (శుభఘడియలు) అనేది ఆయన ప్రకటించిన వీరగీతికా సంకలనం-(రణగీతాలు). భారతదేశపు స్వాతంత్ర్యోద్యమంలో అసహాయోద్యమపు పోరాటమైన తొలిదశనుగూర్చి వ్రాసిన గీతాలివి. ఈ

కవితలలో గాంధీజీని రణయోధునిగానే వర్ణించాడు కవి. నిరాయుధత్వమే ఆయన ఆయుధం. దేశభక్తిలో అంతర్భాగంగా ఈ కవితలో వీరరసం వర్ణితమైంది. అయితే 'సంగ్రామచోక్' అనే పేరిట వెలువడ్డ నాలుగు కవిత లలో, ఇవి రెండో ప్రపంచయుద్ధాన్ని గూర్చి వ్రాసినవి – ప్రపంచ గోళాన్నే దృష్టిలో పెట్టుకుని వ్రాశారు కవి. మానవ నాగరికత అస్తిత్వాన్ని గూర్చిన ఆందోళన ఇందులో వ్యక్తీకరించటం జరిగింది. బాధ్యతా రహితంగా ఆ సమయంలో ప్రదర్శితమైన పశుబలాన్ని చూసి, అందువల్ల ఉన్నతమైన మానవత్వపు విలువలు ఏ విధంగా నాశనానికి గురిఅయినవో ఈ కవితలో ప్రతిబింబింప చేశారు నానాలాల్.

ఆయన వ్రాసిన మహాకావ్యం కురుక్షేత్రలో అంగరసంగా వీరరసం ప్రాధాన్యం వహించడం చూడవచ్చు. ఇది సహజం. అయితే కొన్నికొన్ని భాగాలను అందులోంచి తీసి విడిగా పరిశీలించినప్పుడు, వాటిని ప్రత్యేకంగా స్వతంత్ర స్థాయిగల వీరగీతికలని కూడా చెప్పే అవకాశం ఉంది. ఇటువంటి వాటిలో ఒకటి కాలఘంట. బ్రతుకుతో పోరే వీరులను అంతకన్నా సువిస్తృత పరిధిలో జీవన యుద్ధభూమిలో పోరాటం సాగించటానికాహ్వానించే గీతం.

రాత్రి గడిచిపోయింది తెల్లవార వస్తున్నది
ఒక యుగం గడిచి ఇదిగో కొత్తయుగం ప్రారంభం కాబోతున్నది
కాలఘంటికాపటహం మ్రోగింది
వీరులు సవాలు స్వీకరించి సన్నద్ధులైనారు
భవితవ్యపు పిలుపది
కాలం పలికే హెచ్చరికపు మాట అది.

ఈ విధమైన వీరగీతాల శ్రేణిలో నానాలాల్ కలంనుంచి వెలువడిన అత్యంత ప్రభావశీలమైన గీతం ఒకటి ఉంది. నిర్ద్వంద్వంగా, బహూత్తేజ కరంగా అర్జునుణ్ణి ఉద్దేశించి తల్లి కుంతీదేవి పంపిన సందేశగీతం ఇది.

'పార్ధనెకొహో చడవెబన'

(కురుక్షేత్ర)

వెళ్లు, పార్థుడికి చెప్పు విల్లు ఎక్కుపెట్టవలసిందని
ఇక యుద్ధం తప్ప ఇప్పుడు వేరే గత్యంతరం లేదు
ఇది కుంతి ఆజ్ఞ
వెళ్లు, పార్థుడికి వినిపించు, విల్లు ఎక్కుపెట్టవలసిందని

మనం యాచించాము, పరిశ్రమించాము
శాంతికోసం వాంఛించాము, అర్థించాము
మనం చేయదలిగిందంతా చేశాము
కాని మన సౌజన్యాన్ని
వాళ్లు బలహీనతగా భావించారు
ఇప్పుడు యుద్ధంలో
ఈ వివాదాన్ని పరిష్కరించడమే
మనకు గౌరవప్రదమైన మార్గం
వెళ్లు, పార్థుడికి చెప్పు విల్లు ఎక్కుపెట్టవలసిందని
మేఘాలు ఉరుముతున్నాయి, గాలి గర్జిస్తున్నది
అదేవిధంగా నా సింహకిశోరాలు గర్జిస్తున్నాయి
నా వీరపుత్రులారా ఇక ఇప్పుడు
శిరస్త్రాణాలు ధరించండి మీ శీర్షాలపైన
వెళ్లు, పార్థుడికి చెప్పు విల్లు ఎక్కుపెట్టవలసిందని.

కౌరవుల దగరకు వెళ్ళిన శ్రీ కృష్ణుని రాయబారం విఫలమైంది. పాండవులకు వారి రాజ్యభాగాన్ని పంచిపెట్టవలసిందిగా హితవు చెప్పాడు శ్రీ కృష్ణుడు. ఆయన తిరిగి పాండవుల దగ్గరకు వెళుతూ కుంతిని చూసి ఈ విషయం చెప్పిపోదామని వచ్చాడు. అప్పుడు కుంతి తన కొడుకులందరిలోకీ మహాశూరుడైన, సాహసవంతుడైన, ఎదురులేని ధానుష్కుడని ఖ్యాతినొందిన అర్జునుడికి ఉద్దీపకమైన సందేశాన్ని కృష్ణునిద్వారా పంపుతుంది. కుంతీదేవి మాట ఆజ్ఞ వంటిది. కౌరవ పాండవుల భవితవ్యం దీని తర్వాత నిర్ణయమైంది. కురుక్షేత్రంలోని కథా సన్నివేశ బలమంతా స్ఫూర్తి అంతా ఈ సందేశం ద్వారా నానాలాల్ ప్రదర్శించ గలిగాడు ఈ గీతంలో మనోహరమైన లయ ఉన్నది. నానాలాల్ ప్రతిభాపారమ్యస్థాయిలో ఆయన ప్రత్యేక విలక్షణమైన భావవ్యక్తీకరణంలోని పొదుపరితనమూ, కవితా స్పర్శ ఈ గీతంలో కనిపిస్తాయి.

## ప్రకృతి గీతాలు

కవులు ప్రకృతిని ఎంతగానో ప్రేమిస్తారనడం, ఆరాధిస్తా రనడం సువిఖ్యాతం. నానాలాల్ ఎంతో గాఢంగా ప్రకృతి సౌందర్యాన్ని ప్రేమిం

చాడు. అయితే ఆయన ప్రత్యేకించి ప్రకృతిని గురించి వ్రాసిన కవితలు చాలా తక్కువ. ప్రకృతి శోభా సౌందర్యం ఆయన రచనలన్నిటా సమ్మిళితంగానే ఉంటుంది. అల్లిబిల్లిగా పెనవైచుకొనే ఉంటుంది. విడదీయరాని భాగంగానే ఉంటుంది. ఆయన దర్శించిన జీవితనేపథ్యంగా ఆయన ప్రకృతిని తన రచనలలో ప్రవేశపెట్టారు. నదులు, ప్రవాహములు, పర్వతాలు, కొండలు, సరస్సులు, కొలనులు, సముద్రతీర విహారాలు, సముద్రమూ, వసంతమూ, హేమంతం, శిశిరం, గ్రీష్మం, వర్షాలు, పక్షులు, పువ్వులు, పొదరిళ్ళు, నెమలి, కోకిల, స్థానికమైన గుజరాత్ ప్రకృతి శోభలోని అంతర్భాగంగా నానాలాల్ కవితా భావన అనే ఇంద్రజాల స్పర్శకు లోగి, మరువలేని చిత్రాలుగా దర్శన మిస్తాయి. నానాలాల్ భావనలో మానవుడు, ప్రకృతి, విరుద్ధ ప్రయోజనాభిముఖంగా ఏనాడూ ప్రవర్తించవు ఎప్పుడూ కూడా సామరస్యమే ఆయన భావిస్తాడు మానవుడికీ, ప్రకృతికీ మధ్య. ఈ విషయం దృష్టిలో పెట్టుకుంటే ప్రకృతిని సందర్శించిన దృష్టిలో నానాలాల్‌కు టెన్నిసన్‌కన్నా కూడా వర్డ్స్‌వర్త్ కవితో ఎక్కువ సామ్యం కనపడుతుంది. ఆయన వర్డ్స్‌వర్త్‌కే ఎక్కువ దగ్గరైనవాడుగా కనిపిస్తాడు. కాబట్టి టెన్నిసన్ వర్ణించినప్రకృతిదృశ్యం 'అరుణారుణమైన గోళ్ళు,కోరలతో', నానాలాల్ కవితా ప్రణాళికకుగాని జీవన ప్రణాళికకుగాని వర్తించదనే చెప్పవలసిఉంటుంది. జీవితంలోను. ప్రకృతిలోను, స్వీయబాధ్యతగా వసంతసందేశహారిత్వాన్ని స్వీకరించిన నానాలాల్ వసంతర్తువును గూర్చి మిక్కిలి మధురంగా, సంగీతాత్మకంగా, రంజకంగా, చిత్రవిచిత్ర వర్ణాలతో కళ్ళకు కట్టేరీతిని చిత్రకారుని చిత్రంలోవలె చిత్రించారు. వసంతర్తు సౌందర్యాన్ని శోభను వర్ణిస్తూ పూర్తిగా ఒక పెద్ద గీతం వ్రాయడమేకాక, ఇంకా కొన్ని చిన్న చిన్న గీతాలు కూడా నానాలాల్ వ్రాశాడు. వసంతరాణి (గోపిక), వాసంతస్వాగతం, వసంతం వచ్చింది (నానారాస, 1) మొదలైన ఇటువంటి గీతాలతో, వసంతోత్సవకావ్యంలోని వసంతగీత్‌ను కూడా చేర్చవచ్చు.

కవిగా మొట్టమొదటిసారిగా పరిచయం అయూకాకముందే పున్నమిచంద్రుడుగా ప్రశంసను పొందిన నానాలాల్, చంద్రుడితో పోటీపడ్డాడు. ఆచంద్రుడు ఆయన కవిత్వంలో ప్రవేశించాడు. ఒక్కొక్కసారి వచనంలోకి తొంగిచూశాడు తన పరిపూర్ణకళలతో. తను ప్రసారించే వెన్నెలతోపాటుగా ఆయన వర్ణ్యవస్తువుగా, దృష్టాంతంగా, ఉపమగా రూపకంగా,ఇంకా ఎన్నో

విధాల సమృద్ధిగా నానాలాల్ కవితలో వచ్చిచేరాడు. చంద్రుడు ఇంగ్లీషు విమర్శకు లోకరన్నట్లుగా 'యుగయుగాల కవిత్వ చరిత్ర అంతా చంద్రుణ్ణి కొత్తపదచిత్రాలతో వర్ణించే ప్రయత్నంలాగానే కనిపిస్తుంది' (జె. ఇస్సాక్స్, ఆధునిక కవిత్వపు పూర్వరంగం, పు.30). నానాలాల్‌కూడా చంద్రవర్ణనలలో కొత్త కొత్త పదచిత్రాలు సృష్టించినమాట నిజం. సౌందర్యవర్ణనలన్నిటా తరచు ఆయన చంద్రుణ్ణే ఉపమానద్రవ్యంగా చేసుకోవడం జరిగింది.

పున్నమి చంద్రుణ్ణిగూర్చి మనోహరంగా, దర్శనీయమైన వర్ణనలతో 'శారద పూనమ్' అనే శీర్షికగల కవితలో ఆయన వర్ణించారు. ఈ కవిత నాయన 'చిత్రదర్శనో' కావ్యసంపుటంలో చేర్చడం చాలా ఉచితంగా ఉంది. ఈ కవితలో ఆయన ప్రతిభావంతుడైన చిత్రకారుడిలా (ఆయనెప్పుడూ కుంచె పట్టుకోలేదు) అతి సుందర దృశ్యమైన పున్నమి చందమామ దిక్చక్రతలంపై క్రమక్రమంగా పైకి రావడాన్ని వర్ణించారు. ఈ కవితలో పున్నమిచంద్రుడు, వెన్నెల, కళ్ళకు కట్టినట్లుగా, చిత్రంలో చూస్తున్నట్లుగా ఉపమలు. దృష్టాంతాలు, వరుసగా ఉపయోగిస్తూ ఈ దృశ్యాన్నంతా వర్ణించాడాయన. కొంచెం కొంచెంగా చందమామ పైకి పైకి వస్తూ, లోకానికి ఆహ్లాదం కలిగించే దృశ్యాన్ని, 'సిగ్గుతో బరువెక్కిన నయనపక్ష్మాంచలాలు, పైకెత్తి సున్నితంగా కనులెత్తి చూసే ముద్దరాలి'తో పోల్చాడు కవి. ఆకాశంలో బాగా పైకివచ్చిన పూర్ణచంద్రుడు చల్లని మృదువైన వెన్నెలలు నలుదిక్కులా ప్రసరింపజేయుటం 'సౌందర్యవతి అయిన లలన డాబాపై నిలబడి తియ్యగా చిరునవ్వులు నవ్వడంతో, పోల్చాడు. ఆకాశంనిండా వెన్నెలలు విరియింపచేస్తూ చంద్రుడు ప్రయాణించడం 'గుండె సముద్రంలో హృదయనౌక'లాగా ఉన్నాడని వర్ణించారు కవి ఆకాశంలో ఒంటరిచంద్రుడు 'ప్రేమికుడేర్పరచిన సంకేతపు పొదరింటిలో ప్రియునికోసం నిరీక్షిస్తున్న ప్రియురాలిలా' ఉన్నాడట ఈ వర్ణనలన్నీ ఇస్సాక్స్ అన్నట్లు 'చంద్రుడికి కొత్త ఉపమానాలను, పదచిత్రాలను' కవి సృష్టించడంగానే కనపడుతుంది. నానాలాల్ ఇటువంటి ఉపమానాలు ఎన్నో తన కవితలో కూర్చాడు. ఈ వర్ణనలతోబాటుగా పూర్ణ చంద్రుడు, వెన్నెల, సాయంకాలం, రాత్రి, సముద్రమూ, స్వరసమ్మేళనం పొందిన ఒక మధుర సంగీత సన్నివేశంగా చిత్రించిన తీరు మనోహరం. ముఖ్యంగా పూర్ణచంద్రుణ్ణి సంపూర్ణ వికసిత ప్రణయపూర్ణ చంద్రుడిగా దర్శించడం.

'ఆకాశంలో పూర్ణిమాసుధాకరుడు రాత్రిని ప్రకాశింపజేసినట్లు ప్రణయ పూర్ణిమాశశి ప్రతిబతుకులోనూ వెన్నెలలు కురిసి సకలజగత్తును ప్రకాశింప చేయుగాక' అనే స్వస్తివాక్యంతో ఈ కవిత ముగుస్తుంది.

నానాలాల్ రచించిన ఇతర ప్రకృతి గీతాలలో 'తోకచుక్కపాట' (ఇందుకుమార్)ను గూర్చి ముందుగా ప్రస్తావించవచ్చు. అరిష్టసూచకం, అపాయసూచకం, అన్నభావాన్ని పూర్తిగా పరిహరించి, సంప్రదాయానికి వ్యతిరేకంగా 'అత్యంత శుభావహం' అన్న భావం ఈ పాటలో కవి ప్రతిపాదించాడు. అల్పమైన, నశ్వరమైన ఇహలోకపు నిత్యకృత్యబంధాలు, కామనలు వదిలించుకొని ఉన్నత స్థానాన్ని పొందిన యోగితో ఈ తోకచుక్కకు సామ్యం కూర్చాడు కవి. దీనిని పోలినదే విహంగరాజునుగూర్చి ఆయన వ్రాసిన గీతం. సర్వవిహంగమ శ్రేష్ఠుడాయన. పరమయోగివాంఛించే అత్యున్నతమైన పరమానంద స్థాయికోసంచేసే ప్రయత్నమే ఇందులోకూడా సంకేతం.

సర్వమానవ సామాన్యానుభవమైన ప్రాపంచిక సుఖదుఃఖాలకు అందనంత ఎత్తుకు ఎగిరేస్థితిలో విహంగరాజు విహారాన్ని పోలుస్తాడు కవి. అయితే పారలౌకికమైన అర్థంలో విహంగరాజులు దప్పికగొని వేసారి పరిభ్రమిస్తూనే ఉంటవి. ఎందుకంటే ఇంద్రియ సరోవరంనుంచి దప్పితీర్చుకోవడానికి అవి అభిముఖంకావు. అంగీకరించవు. శాశ్వతానంద సంసిద్ధికోసం వాటితృష్ణ. భగవంతుని దర్శనం నిమిత్తం అవి ఎత్తుకు ఇం ఇంకా ఎత్తుకు ఎగిరి విహారం సల్పుతూనే ఉంటాయి.

## గిర్నార్ శిఖరం

ఈ లోకంలో స్వేచ్ఛ తన అస్తిత్వాన్నే పూర్తిగా పోగొట్టుకొనే సంక్షోభ పరిస్థితులలో సముద్రాన్నీ పర్వతాన్నీ రెంటినీ స్వేచ్ఛా పరిరక్షకులుగా వర్డ్స్‌వర్త్ కవి అభివర్ణించి ఉన్నాడు. నానాలాల్ దృష్టిలోకూడా సముద్రమూ, గిరిశిఖరమూ ఇంతగానూ అభిమానపాత్రమైనవే. అయితే నానాలాల్ దృక్పథం మాత్రం భిన్నమైనది. గిర్నార్ శిఖరాన్నిగూర్చిన ఒక కవితలో (కొన్ని కవితలు, II) అనంతమైన కాలపు గంభీరాకృతిగా గిరిశిఖరాన్ని దర్శించాడు కవి. అందులోని ప్రతిరాయీ చరిత్రతో నిండిఉంది. గత

చరిత్రకు సంబంధించిన విపుల ఘట్టమొకటి గిర్నార్ శిఖరపాదతలభూమిలో గుప్తమై ఉన్నది. అది ఏమిటంటే అశోక చక్రవర్తి చెక్కించిన ఒక శిలా శాసనం. ఇది కవి చరిత్రావగాహనను మిక్కిలి ప్రేరేపించింది. ఆయన భావనా సంచార శక్తిని ఉద్దీపింపజేసింది. మనోవీథుల్లో ఆయనను ఉజ్జ్వల మైన అశోక చక్రవర్తి పాలనయుగంలో విహరింపజేసింది. బుద్ధదేవుని అహింసావ్రత సందేశాన్ని సముద్రాలు దాటి శ్రీలంకకు, హిమాలయాలు దాటి చీనా, జపాన్ దేశాలకు ఇంకా ఇతర సుదూర భూములకు అశోక చక్రవర్తి వ్యాపింపజేసే ప్రయత్నాలను కవిచేత దర్శింపజేసింది.

ఈ కవిత తొలిచరణాలు ఉదయకాలపు మనోహర వర్ణన. ఆటు తరువాత అశోకుని ధర్మచక్రాన్ని గూర్చిన వర్ణన మొదలవుతుంది. కవికి బుద్ధదేవునిపట్లఉండే గాఢమైన పూజ్యభావమూ, అశోక చక్రవర్తిపట్ల ఉండే ఆరాధనాభావమూ ఈ కవితలో వెల్లడి అవుతాయి. అశోక చక్రవర్తి బౌద్ధ మతదీక్షను స్వీకరించిన తర్వాత తథాగతుని సందేశాన్ని సుదూరదేశాలకు విస్తరింపజేశాడు.

## సాగర గీతాలు

సముద్రాన్నిగూర్చి గుజరాతీ కవులెవ్వరూ పట్టించుకోవలసినంతగా పట్టించుకోలేదని నానాలాల్ వ్యాఖ్యానించాడొక సందర్భంలో. వారిముందే పరమసుందరంగానూ మహిమాన్వితంగానూ అది కనపడుతున్నప్పటికీ సముద్రాన్నిగూర్చిన ఆసక్తి కనపరచలేదు కవులని ఆయన భావం ఆధునిక గుజరాతీ కవిత్వంలోని ఈ లోటును నానాలాల్ కొంతవరకు తీర్చాడనే చెప్పవచ్చు. సముద్రంపైన మనోహరమైన కొన్ని కవితలనాయన వ్రాశాడు. సౌరాష్ట్రంలోని గోపనాథ్‌వద్ద కాంత్ కవితో కలిసి సముద్రాన్ని ఆయన దర్శించాడు. కాంత్ సముద్రం – చంద్రుడు అనే సుందర గీతం రచించగా నానాలాల్ సముద్రాన్ని ఉద్దేశించి (కొన్ని కవితలు, ॥) అనే కవితను రచించాడు. అయితే ఇద్దరి ధోరణులు వేరువేరుగా ఉంటాయి. ఈ కవితలో నానాలాల్ 'అపారమైన ఉదాత్తమైన' సముద్రాన్ని ఉద్దేశిస్తూ చంద్రునితో కూడిఉన్న దాని మనోహర సౌందర్యాన్ని వర్ణిస్తాడు జీవితాన్ని సార్థం చేసుకోవడానికి తగిన సందేశాన్ని వినిపించవలసిందిగా సముద్రాన్ని

అర్థిస్తాడు. అగాధంగా, అందంగా, గంభీరంగా, శోభయమానంగా, ఉదాత్తంగా, సముద్రం జనని తాను ప్రదర్శించుకుంటూ ఇలపై వర్ధిల్లు తున్నట్లుగా మానవుడు కూడా జీవించగల సందేశాన్ని సముద్రం వినిపించాలని కవి కోరిక.

'మోహర్‌మాన్‌నమోతి' (సముద్రపు ముత్యాలు) అనే పేరుతో కొన్ని పాటల, భావగీతాలగుచ్ఛాన్ని 1938వ సంవత్సరంలో బొంబాయిలోని అంద మైన జుహూ బీచిలో కవి ఆర్నెల్లు గడిపిన ఫలితంగా వెలువరించడం జరి గింది. శ్వాసకోశానికి సంబంధించిన అనారోగ్యంతో సముద్రపుగాలి తన ఆరోగ్యానికి అత్యంత లాభదాయకంగా ఉత్తేజకరంగా భావించాడు నానా లాల్. ఆయన కవితా రచనకు కూడా సముద్రతీర ఆవాసం బాగా కలిసి వచ్చింది. ఆయనే ప్రవేశికలో ప్రస్తావించినట్లు, ఆత్మసంగీత సాధనం, జుహూబీచిలో తన ఆవాసకాలంలో మహాకావ్యరీతిలోనూ, భావగీతికా రీతి లోనూ కూడా గానం చేసింది. పోయిన ఆరోగ్యాన్ని ప్రసాదించడమేకాక అంతకుమించే సముద్రం ఆయనకు ఇచ్చింది. ఏమంటే ఈ సముద్ర సాహ చర్యంలోనే ఆయన తన మహాకావ్యమైన కురుక్షేత్రలో మూడాశ్వాసాలు రచించాడు. తన తండ్రి జీవిత చరిత్ర అయిన 'కవీశ్వర దలపత్‌రాయ్' అనే గ్రంథంలో చివరి ప్రకరణాలు కూడా ఇక్కడ గడిపినప్పుడే ఆయన రచిం చాడు. ఇవిమాత్రమేకాక అత్యంత ఔచిత్యశోభితంగా ఆయనే పేరుపెట్టి నట్లు సముద్రపు ముత్యాలు కూడా ఈకాలంలోనే ఆయన కూర్చాడు. (ఇందులో కొన్ని స్వయంగా కవి నోటివెంటవినే అదృష్టం ఈసంక్షిప్త జీవిత వృత్తాంత గ్రంథకర్తకు లభించింది).

ఒడ్డుకు గర్జారవాలతో ఉరికివచ్చే పెను అలలతోకూడిన సముద్రపు దృశ్యాన్ని కవి ఈ విధంగా వర్ణిస్తున్నాడు. పసిబాలుడి ఆశ్చర్యంతో తీరాన నిలిచి ఆ అలలను గమనిస్తూ, తనతోవచ్చి ఆడుకోవలసిందిగా వాటిని ఆహ్వానిస్తున్నాడు

రండహో రండి కడలికెరటాల్లారా
నాతో ఆటలాడటానికి రండి
నా హృదయాన్ని ఉల్లాసంతో నింపటానికి రండి
రండహో! రండి

మీ అవయవాలు కిందికీ మీదికీ ఊగుతున్నాయి
గాలికి కదలాడే తీవలా
మీ కళ్ళుమూస్తూ తెరుస్తూ
మీరు ఎగబ్రాకుతున్నారు, దిగజారుతున్నారు
ఎత్తుగా కెరటాలలుయ్యాలలూగుతున్నారు
వెనక్కు బాగా వెళ్ళిపోతున్నారు

వెండికెరటాలపై ఊగుతున్నట్లు
బంగారు కెరటాల తూగుతున్నట్లు
రండహో! రండి
ఎప్పుడో ఒకరోజు నేను మీలో కలిసిపోతాను
మీతో ఈదులాడేందుకు
అనంతసాగరంలో
రండహో! రండి నాతో ఆడుకునేందుకు.

ఇంకొక గీతంలో (జాహునాజల్దిజల్ ఆరే) నానాలాల్ ఇంచుమించుగా మహాకావ్యరచనా రీతిలో సముద్రపు మనోవిభ్రమంగొలిపే అంగాన్ని, శోభను, నిగూఢతను ఈ విధంగా వర్ణించాడు.

ఇక్కడ మహాసముద్రపు ఒడ్డున
అల్పమానవులు గవ్వలేరుతున్నారు
తమ తమ సైకత భవనాలు నిర్మించుకుంటున్నారు
గాలిలోకి గాలిపటాలు పంపుతున్నారు
ఇక్కడ భూమి సముద్రాన్ని కలుసుకొంటున్నది
ఇక్కడ నిండుగా చంద్రుడు ఉదయిస్తున్నాడు
సముద్రాన్నీ భూమినీ ధవళకాంతితో పూత పూస్తున్నాడు
ఇక ఆవలి వైపున
సముద్రపు అటువైపు ఒడ్డు ఉన్నది
రెక్కలద్వారా మాత్రమే గమనించటానికి వీలున్నది
ఇక్కడ సముద్ర రవం
దివ్యలోకపు కవికంఠస్వరంగా
దివ్యలోకపు గోపురం మీదినుంచి పాడుతూ
అతడి పాట
మధురంగా, దప్పంగా. ఘోషిస్తూ, నిరంతరంగా.

నానాలాల్ కవితను అనువదించడం సులభసాధ్యంగాదు. అందునూ భాషలు ఏమీపోలికలేనివైతే మరీకష్టం. అయితే ఇది ఒక్క నానాలాల్ విషయంలో మాత్రమే విలక్షణమైన విషయం కాదు. ఒక భాష నుంచి ఇంకొక భాషలోకి కవిత్వం అనువాదం చెయ్యతం దుస్సాధ్యం. (బహుశా ఈ విషయంలో అనుభవమున్నవాళ్ళకు ఇది బాగా తెలుస్తుంది). 'అనువాదంలో కవిత్వం హరించుకొని పోతుంది' అనిగానీ 'అనువాదకులు ద్రోహులు' అనిగానీ అనేటంత తీవ్రధోరణిని ఆమోదించవలసిన పనిలేదు గాని, ఇష్టమైనా కాకపోయిన సరే అనువాదమనగానే కొంతవరకు ఉజ్జాయింపుగా సరిపుచ్చుకోవడమే' అని ఉమాశంకర్ జోషి ప్రతిభాస్ఫోరకంగా వెలిబుచ్చిన అభిప్రాయంతో ఏకీభవించవచ్చు. (కమ్యూనికేటర్, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మాస్ కమ్యూనికేషన్, అక్టోబర్, 1974) అయితే ఈ అవరోధాలు కవిత్వ ప్రియులను వెనుకంజ వేయించ లేకపోయినవి ఉజ్జాయింపుగా సరిపుచ్చుకోవడాలతోనైనా సంతృప్తి చెందుతారుగాని అనువాద మూలకంగానైనాసరే కవితా స్వాదనం చేయడం నుంచి పూర్తిగా వంచితులు కావడానికి మాత్రం వాళ్ళు ఇష్టపడరు.

# 3

# మ హా కా వ్యం

1926వ సంవత్సరం నుంచి 1940వ సంవత్సరం వరకు ఈ మధ్య కాలంలో నానాలాల్ తన కురుక్షేత్ర మహాకావ్యంలోని పన్నెండాశ్వాసాలు రచించాడు. మహాభారత కథ నాధారం చేసుకొని ఈ కావ్యం రచించాడాయన. కవిగారి మాటల్లోనే చెప్పాలంటే ఈ కావ్య రచనావిషయికంగా 'భావగీతికావేణువు నవతల ఉంచి 'మహాకావ్య భేరీ' నాయన చేపట్టడం జరిగింది. కురుక్షేత్ర మహాకావ్యరచన తన కవితాశక్తిని పరమోన్నత స్థాయిని చేర్చిన శిఖరంగా ఆయన భావించాడు. నానాలాల్‌కు పూర్వం కూడా నర్మద్

మొదలైన ఇంకా నలుగురైదుగురు కవులు మహాకావ్య రచనాప్రయత్నం చేశారుగాని, వారి ప్రయత్నాలు లక్ష్యసహితంగా సాగకపోవడంతో ఫలించ లేదు. పట్టుదలతో ప్రయత్నించలేదు. యథాలాపంగా పూనుకొన్నట్లని పిస్తుంది. "ప్రతి తరంలోను ఆ తరానికి వినిపించవలసిన వీరగాథ ఉం టూనే ఉంటుంది. దాన్ని వినిపించే కవికూడా ఆతరంలోనే ఉంటాడు కూడా 'అని ప్రస్తావిస్తూ (ఉపోద్ఘాతం, పు. 21) నానాలాల్ ఇలియడ్, షానామా, రామాయణం, మహాభారతం, శ్రీమద్భాగవతాలు లోకానికి ఉపలభ్యమయ్యే విశ్వకావ్యాలుగా పేర్కొన్నాడు. ఆటుతరువాత తన మహాకావ్యం సంస్కృత లక్షణానుసారికాదనీ మిల్టన్ కవీశ్వరుని ప్యారడైజ్ లాస్ట్ (స్వర్గ చ్యుతి) వంటిదనీ ఆయన అన్నాడు.

నానాలాల్‌కు ఈ కావ్యరచనా విషయంలో రెండు సమస్యలు ఎదు రైనవి. తగిన ఇతివృత్తం ఎన్నుకోవడమనేది మొదటిది. అనుగుణమైన వ్యక్తీ కరణ ప్రక్రియను ఎన్నుకోవడం రెండోది. తాను రూపకల్పన చేసిన లయాత్మక శైలి (డోలన్ శైలి) తానిదివరకే తన రూపకాలలోనూ, ఇంకా కొన్ని దీర్ఘకావ్యాలలోను ప్రవేశపెట్టి ఉన్నందువల్ల, అది సంతృప్తికరమైన సాధనంగానే ఆయన భావించుకున్నాడు. ఇక అన్ని విధాల తన సంకల్పా నికి అనుగుణమైన ఇతివృత్తాన్ని నిర్ణయించుకోవడంలో కొంతకాలం ఆలో చనలతో ఆయన గడిపాడు. ఏసుక్రీస్తు జీవన చరితమా, బుద్ధదేవుని జీవన గాథా? దేనిని స్వీకరించాలని? ఆయన విచికిత్సకు లోనైనట్లుంది, కాని చిట్ట చివరకు కురుక్షేత్రగాథను గ్రహించడానికి స్థిరనిశ్చయానికి వచ్చాడు 'మానవ జీవిత చరిత్రలోనే అత్యంత అద్భుతజనకమైన పదం కురుక్షేత్ర అనేది అంటాడు నానాలాల్. సమస్త మానవజాతిలోనూ ఆరవవంతు మాన వుల ప్రారబ్ధాన్ని ఐదుసార్లు నిర్ణయించే సన్నివేశాలతో కూడిన మహా యుద్ధా నికి ఇతివృత్తమైనదీపదం. ఇటువంటి మహాయుద్ధం ప్రపంచ చరిత్రలోనే అపూర్వమన్నాడు నానాలార్. ఈ యుద్ధంతో యుగాంతరం ప్రారంభ మైంది. ఈ యుద్ధం చరిత్రను సృష్టించింది అంటాడు నానాలాల్.

మిల్టన్ కవి విరచితమైన ప్యారడైజ్ లాస్ట్ (స్వర్గచ్యుతి) మహాకావ్య ప్రక్రియాభేదం. సాహిత్య ప్రక్రియా వైవిధ్యాన్ని ప్రదర్శిస్తూ సంప్రదాయపు తీరుతెన్నులకన్నా భిన్నంగా రచించాడు మిల్టన్. నానాలాల్ కురుక్షేత్ర

కూడా ఇదేవిధంగా సాహిత్యంలో నవీనమైన మహాకావ్యమని చెప్పవచ్చు. ఇందులో కథ, పాత్రలు, మహాభారతంనుంచే స్వీకరించాడు నానాలాల్ మిల్టన్ కవీశ్వరుడు తన కథను బైబిల్‌నుంచి స్వీకరించినట్లు. 'మహాకావ్య స్వరూపాన్ని గూర్చిన నా భావన' అని కురుక్షేత్ర కావ్యపు ఉపోద్ఘాతంలో మహాకావ్యమంటే 'మహాపురుషుల, మహావీరుల అద్భుత సాహస పరాక్రమ ప్రదర్శనల మహాగాథ' అని నానాలాల్ నిర్వచించాడు. ఈ భావన కను గుణంగానే ఈ మహాయుద్ధకథను తన కావ్యంలో వర్ణించడానికి పూను కొన్నాడు. మహాపురుషులు, మహావీరులు, అయిన శ్రీకృష్ణుడు, అర్జునుడు, భీముడు. భీష్ముడు, కర్ణుడు, తదితరుల, వీరి సాహసాలను, పరాక్రమాన్ని ఒక కాలక్రమానుసారంగా మధ్య మధ్య ఒక ఘట్టానికి ఇంకొక ఘట్టానికీ అవిచ్ఛిన్నత కనపడకుండా, కథాకాలంలో విపులమైన అంతరాలున్నప్పటికీ ఒక ఐక్యము సాధించాడు.

10,703 చరణాలలో నానాలాల్ కురుక్షేత్ర మహాకావ్యం పన్నెం డాశ్వాసాలుగా విభక్తమైంది. ప్రతి ఆశ్వాసం ప్రారంభంలో ఆ అశ్వాసంలో వచ్చే కథకు సంక్షిప్త సారాంశం కూర్చడం జరిగింది మిల్టన్ కవి కూడా తన కావ్యంలోని ప్రతి విభాగానికి 'ఆర్గ్యుమెంట్' పేరుతో ప్రారంభంలోనే సారాంశాన్ని ఇచ్చినట్లే నానాలాల్ కూడా. ఈ విధంగా ప్రతి ఆశ్వాసం మొదట సారాంశం ఇచ్చాడని చెప్పవచ్చు. ఈ విధంగా జరగబోయే కథను గూర్చి సంక్షేపంగా తెలియజేయడమనేది ఒక విధంగా పాఠకుడికెంతో సహాయపడుతుందని చెప్పవచ్చు. ఈఅవతారిక ఆ ఆశ్వాసంలో వచ్చే ప్రధాన ఘట్టానికి రేఖావివరణను తెలియజేయడమేకాక, దాని పూర్వరంగాన్నికూడా తెలియచెప్పగలదు. ప్రధాన కథలోనే ఈ అంశాలన్నీ చేరిఉండే అవకాశం సర్వేసర్వత్రా లేకపోవచ్చు.

కురుక్షేత్ర మహాకావ్యంలోని మొదటి ఆశ్వాసానికి 'యుగాంతరం' అని పేరు. అంటే యుగం మారిపోతున్నదని భావం. శ్రీకృష్ణదేవుని వేణు నాదంతో భావసుభగగీతికారూపంగా ఈ ఆశ్వాసం మొదలవుతుంది. ఈ గీతంలో వ్యక్తమయ్యే నాదమాధుర్యమేమి, కవితాశోభ అయితేనేమి, సమ్మోహకరంగా ఉంటవి. ఈ ఘట్టంలోని ప్రధానపు ప్రతిపాద్య విషయం ఏమంటే పరమసుందరాకారుడైన వేణుగోపాలుడు, దివ్యమంగళ విగ్ర

హుడుగా ఉదాత్తరూపుడుగా పరివర్తనం చెందాడాన్ని దర్శింపజేయడం (పుట 9). అయన మధురను విడిచివచ్చి ఏ విధంగా గుజరాత్‌లో స్థిరపడి నాడో తెలియజేస్తుంది ఇందులోని ఒక సన్నివేశం.

ఈవిధంగా ఇది జరుగుతుంది అన్న భావికథాసూచనం, శ్రీకృష్ణునితో ప్రసంగించే సుభద్ర మాటఃద్వారా తెలుస్తుంది. ఈ విధంగా జరగబోతుంది అన్న విషయం సుభద్ర కృతమైన శ్రీకృష్ణ ప్రస్తుతిరూపంగా వ్యక్తమవు తుంది. సుభద్ర ప్రస్తుతి వెంటనే ఫలించదా ఏమి అన్నట్లు, ఇదివరలోనే కృష్ణుడు భవితవ్యాన్నిగూర్చి సంకల్పించాడా, సంకల్పించకుండానే ఈ విధంగా వెంటనే జరుగుతున్నదా అనుకొనేట్లు, దివ్యమంగళ విగ్రహరూపాం తర పరివర్తనం సూచితమయ్యేట్లు కాల్పనికపారమ్యంగా మధురగేయ ఫణితిలో ప్రభాతసంధ్య వర్ణితమైంది అంటే రాత్రి గడిచిపోయి నూత్న ప్రభాతం ఆగమించిం దన్నమాట. ఒక యుగం గడిచి మరొక యుగం ప్రారంభ మవుతున్న విషయాన్ని ప్రతీకాత్మకంగా ఈ దృశ్యం ధ్వనింప చేస్తున్నది. శ్రీకృష్ణుని మూర్తిమత్త్వంలో రూపాంతర ప్రాప్తి నికూడా సూచనగా తెలియచేస్తుంది. మన్వంతరం మారిపోయి నూతనంగా మరో మన్వంతరం ప్రారంభ మవుతున్న ధ్వనితో. ఇంతే కాకుండా ప్రణయ వేణువును అవతల పెట్టి శూరచక్రాన్ని చేపట్టే సన్నివేశాన్నీ, గోపమనోహరుడు, రణరంగ మహావీరుడుగా మారిపోబోతున్న విషయాన్ని కూడా ఈ వర్ణణ సూచి స్తున్నది.

రెండో అశ్వాసంలో 895 పంక్తులున్నాయి. పన్నెండు సంవత్సరాల కాలగమనపు విరామం తర్వాత మళ్ళీ కథాగమనం, ఈ సన్నివేశంతో ప్రారంభమవుతుంది ఈ అశ్వాసంలో. శ్రీకృష్ణుడు హస్తినాపురంలో సంధి రాయబారం చేయడానికి వచ్చి, కౌరవసభలో చర్చలు జరుపుతున్న ఘట్టంతో ప్రారంభమవుతుంది ఈ ఆశ్వాసం. పాండవుల రాజ్యభాగానికి వారికివ్వవల సిందిగా కోరడానికి వచ్చాడు కృష్ణుడు. కౌరవుల మూర్ఖత్వంవల్లను, అహం కారంవల్లను సంధి ప్రయత్నాలు విఫలమైనాయి. ఒక్క అంగుళం మేర భూభాగాన్నికూడా పాండవులకు ఇవ్వడానికి కౌరవులు ఒప్పుకోరు. జూదంలో న్యాయంగా ఆ రాజ్యాన్ని తాము గెలుచుకున్నామని పలుకుతారు.

విఫలమనోరథుడైన కృష్ణుడు అక్కడి నుంచి తిరిగివెళుతూ కుంతిని చూడటానికి పోయినప్పుడు ఆమె కృష్ణునిద్వారా అర్జునుడికి ఉత్తేజకరమైన

ప్రబోధ సందేశం పంపుతుంది, 'విల్లు ఎక్కుపెట్టవలసిన సమయం ఆసన్న మైనదంటూ, యుద్ధసన్నద్ధుడివి కావలసిందంటూ'. 'తమ ఆత్మగౌరవం కాపాడుకోడానికి ఇక ఇంతకన్నా గత్యంతరం తమకులేదు' అంటుంది కుంతి. ఈ ఆశ్వాసంలోనే పాండవులంతా ఒకచోట సమావేశం జరిపి, తమలో తాము భవిష్యత్కార్యక్రమాన్ని గూర్చి చర్చించుకోవడం కూడా మనకు కనిపిస్తుంది. ఏకగ్రీవంగా యుద్ధం చేయడంతప్ప మరోమార్గం లేదన్న నిర్ణ యానికే వారు వస్తారు. తాము అందుకు సంసిద్ధంగా ఉండాలని నిశ్చ యించుకుంటారు.

మూడో ఆశ్వాసంలో 963 పంక్తులున్నాయి. దీని శీర్షిక 'నిశ్చయం'. కౌరవులు పాండవులు కూడా తమ వివాదాలను యుద్ధరంగంలోనే పరిష్క రించుకోవడానికి నిర్ణయించుకున్నారు. గుడారాలు నిర్మించారు. అయితే కౌర వులకు యుద్ధారంభంలో ఆకాశంలో అపశకునాలు కనపడ్డవి. ఇటువంటి అతిమానుష అద్భుతాల ప్రస్తావన మహాకావ్యంలో సంప్రదాయబద్ధమే. ఈ ఆశ్వాసంలోనే ద్రౌపదీదేవి పాండవులకు చేసిన ప్రబోధం కూడా చోటుచేసు కుంది. గత కథనాంశ ప్రదర్శక శిల్పంలో గతంలో ద్రౌపదికి, పాండవులకు కౌరవులవల్ల జరిగిన ఘోరావమానాలు, అన్యాయాలు వర్ణితమైనవి. ద్రౌపదీ దేవి ప్రసంగం ఈ ఉద్దేశాన్ని నిర్వహించింది. అంతేకాదు. పాండవుల నిర్ణ యాన్ని ఆవిధంగా బలపరచి వారు యుద్ధసన్నద్ధులు కావతానికీ, కౌరవులతో తమ వైరం పరిరష్కరించుకోవడానికీ తోడ్పడింది.

నాలుగో ఆశ్వాసం యుద్ధం. ఈ ఆశ్వాసం బ్రతుకులోని దుష్టత్వాన్ని గూర్చి విశ్లేషించడానికి పూనుకుంటుంది. గీతోపదేశ సందర్భంగా, మహా భారతంలో అర్జునుడు ప్రాథమికమైన జీవన నైతిక సమస్యలు, విచికిత్సలు వ్యక్తంచేసిన విధంగానే ఇక్కడ కూడా ప్రసక్తమవుతాయి.

కురుక్షేత్ర రణక్షేత్రానికి, అత్యద్భుతమైన పోలిక చెవుతాడు కవి కళ్ళకు కట్టేవిధంగా ఉంటుంది ఆయన కూర్చిన ఉపమాలంకారం. ఈ రణ క్షేత్రాన్ని కాలపు అతివిశాలమైన చాచిన అరచేతితో పోల్చాడు కవి. ఆ అర చేతిలోని గీతలను ఇరుపక్షాలవారి చమూవ్యూహగతులుగా పోలుస్తాడు. నివ్వెరపాటుగొలిపే ఈ సైనిక నాటకంలోని ప్రధాన పాత్రధారులందరినీ అటు తరువాత తన కవితాశక్తిస్ఫోరకంగా, కథనాత్మకంగాకాక, వర్ణనాత్మ

కంగా, సజీవాకృతికంగా కన్నులకు కట్టేటట్లు నిలుపుతాడు కవి. ఈ సన్ని వేశాలకన్నిటికీ తలమానికంగా కురుపితామహుడు భీష్మాచార్యులవారి హిత బోధ కవితాత్మకంగా, కమనీయంగా సాగుతుంది

తరువాత ఆశ్వాసంలో ఈ యుద్ధంలో ఆయుధాల్ని స్పృశించనని ప్రతిజ్ఞ చేసిన శ్రీకృష్ణుడు, శస్త్రధారణ చేయడానికి పూనుకోవడం వర్ణితం. 'చక్రంబు చేపట్టి చనుదెంచి రయమున' భీష్మసంహారానికిఆయత్తుడు కావడం ఈ ఆశ్వాసంలో వర్ణించాడు కవి. భీష్మాచార్యులవారు ప్రళయ రుద్రుడి కోపంవంటి కోపంతో పాండవుల బలాలన్నిటినీ నాశనం చేస్తున్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు రథంపైనుంచి ఉరికి సుదర్శనంతో భీష్ముడి పైకి లంఘించాడు.

ఆరవ ఆశ్వాసంలో మహారథుడైన భీష్ముడు బాణాలు గుచ్చుకొని గాయ మైన దేహంతో పడిపోవడం. కృష్ణునికి ఆగ్రహం కలిగించిన ఆయన ప్రతిజ్ఞకు భంగం కలిగించగలిగినందుకు సంతోషించడం, వర్ణించాడు కవి. భీష్ముడు యుద్ధంలో కూలిపోయినతర్వాత రణవీరులూ, రాజులూ అందరూచేరిన సన్నివేశాన్ని చాలా కవితాత్మకంగా, మనసుకు హత్తుకునిపోయేటట్లుగా వర్ణిం చాడు కవి. ఏడవ ఆశ్వాసం పేరు'పద్మవ్యూహం', ఎనిమిదో ఆశ్వాసం 'భ్రాంత సాయంతనం'. తక్కిన ఆశ్వాసాలన్నిటిలోనూ ప్రత్యేకించి ఈరెండుఆశ్వాసాలూ కథాగమనానికీ, కథనవేగానికీ, వర్ణనాప్రతిభకు నిదర్శనాలుగా కనపడుతు న్నాయి. మహారథుడైనద్రోణుడు అకాలసాయంకాల భ్రాంతికిగురిఅయి, యుద్ధం నిలిపివేసే సమయమాసన్నమైందని-అది ఆనాటి యుద్ధధర్మం-అశ్వత్థామ హతుడైనాడన్న అసత్యవార్తకు గుండె పగిలినవాడిలా కనిపిస్తాడు. మహా వీరులు, మహాత్ములైన భీష్మద్రోణులిద్దరూ కూడా ఘోరయుద్ధభూమినుంచి కనుమరుగు కాగా, తొమ్మిదో ఆశ్వాసం 'అన్నదమ్ముల అస్త్రయుద్ధంతో ప్రారంభమవుతుంది. ఆగ్రహావేశంతో రణరంగంలో ప్రవేశించిన కర్ణుణ్ణి పరిచయం చేస్తుంది కర్ణుని వీరమరణ దృశ్యాన్ని, నానాలాల్ కవితాశక్తి అంతా కేంద్రీకృతమై మహత్తరంగా వర్ణించింది. కర్ణుని శీలాన్ని ప్రతిబిం బింపజేసే కవిత్వపు కుంచెసొరింపులతో, లవితాభావావేశ తీవ్రతలో నానా లాల్ ఈ సన్నివేశాన్ని వర్ణించాడు. పదో ఆశ్వాసం 'కాలఘంట' యుద్ధపు చివరి రోజుల సన్నివేశాలను వర్ణించే భాగం. పదకొండో ఆశ్వా

సం 'శరతల్పం', భీష్ముని కడపటి హితబోధను వర్ణిస్తుంది. మరణశయ్యపై నుంచి కురుపితామహుడైన భీష్ముడు, ప్రపంచరీతిని నిరసిస్తూ తత్త్వప్రతిపాదాత్మకంగా, ప్రబోధాత్మకంగా తన సందేశం వినిపించడం ఈ ఆశ్వాసంలోని ప్రధాన ఘట్టం. ఈ విధంగా బోధించడానికే, ఇచ్ఛామరణ ప్రాప్తిగల భీష్ముడు మృత్యువును కొంతకాలం ఆపిఉంచడం జరిగింది.

పన్నెండో ఆశ్వాసం 'మహాచక్రం' (మహాసుదర్శనం), ఈ మహాసుదర్శన చక్రం వర్ణన అత్యద్భుతంగా సాగింది. పరమోదాత్త కవితాస్థాయిని చేరుకుంది. కురుక్షేత్రలో అన్నిటికన్నా గొప్ప భాగం ఈ ఆశ్వాసమే అనవచ్చు. అత్యుత్తమంగా, బహుప్రతిభావంతంగా కవి ఈ భాగాన్ని నిర్వహించాడు. యుద్ధంలో జయం పొందిన పాండవులు ఈ ఆశ్వాసంలో భరించరాని నిర్వేదంతో కుమిలిపోతూ కనిపిస్తారు. తాము కారణంగా యుద్ధంలో సంభవించిన సర్వనాశనానికి వాళ్ళు పశ్చాత్తప్తులు కావడం సమర్థతతో వర్ణించాడు కవి. దురదృష్టంకొద్దీ అతిభయంకరమైన మూల్యం చెల్లించి విజయం సంపాదించామని వారు ఆత్మ విమర్శతో కుంగిపోతారు. ఈ సంపాదించిన విజయం చేదుగా వుంది వారికి. ఎంతో పాపం ఒడిగట్టుకున్నామన్న విచారం కలిగింది. ఈ ఘట్టంలో పాండవులు పరితపిస్తూ ఉండగా మహానుభావుడైన వ్యాసమహర్షికి వారిపట్ల అనుకంప గలిగి, వాళ్ళ దుఃఖోద్విగ్నతను ఉపశమింపజేయగల అద్భుతమైన, గుహ్యమైన దర్శనాన్ని వాళ్ళకు కలిగించడానికి పూనుకొన్నట్లుగా నానాలాల్ వర్ణించాడు.

పాండవులకు జ్ఞానబోధ చేయడానికీ, సృష్టి, లయమూ కూడా పరబ్రహ్మ సాగించే విశ్వలీలలో భాగాలే అనీ, లోకశ్రేయంకోసమే లయాన్ని కూడా ఆయన నిర్వహిస్తాడనీ, తాత్త్విక ప్రబోధరూపంగా, ఈసన్నివేశాన్ని వ్యాసులవారు ఎంచుకున్నట్లు నానాలాల్ అభివర్ణించాడు భగవంతుని లీలలో పాండవులు కూడా తక్కిన మానవమాత్రులందరివలెనే నిమిత్తమాత్రులుగానే పనిచేశారనీ, కేవలం వారు దైవం చేతిలో ఉపకరణాలేననీ అందువల్ల జయాపజయాలు, సుఖదుఃఖాలు వారిచేతితో లేవనీ, పొంగిపోవడం గాని తగదని వ్యాసమహర్షి బోధించడానికే ఈ దివ్యసందర్శనం చాలా ప్రతిభావంతంగా నానాలాల్ ప్రదర్శించాడు. ఈ విశ్వదర్శనం చాలా క్లిష్టమైన ఆధిభౌతికతాత్త్విక విషయాలను ప్రసక్తం చేస్తున్నది. ఈ విష

యాన్నే నానాలాల్ ఇదివరలోనే నాలుగో ఆశ్వాసంలో స్పృశించాడు. జీవితంలోని దౌష్ట్యాన్నీ, పాపాన్నీ, వీటికి సంబంధించిన సమస్యను విశ్లేషిస్తూ ఈ విషయాలాయన నాలుగో ఆశ్వాసంలో ప్రసక్తం చేశాడు గీతా బోధ ప్రారంభంలో అర్జునుడికి కూడా ఎదురైన సమస్య ఇదే. శ్రీకృష్ణుని విశ్వరూప సందర్శనంతో అర్జునుడికి ఈ విచికిత్స తొలగిపోయింది. నానా లాల్ అభివర్ణించిన 'మహాసుదర్శన' సృష్టి స్థితిలయాలకు ప్రతీక. ఈ చక్రాన్ని పృథగస్తిత్వంతో కాకుండా విశ్వశుభం కోసం, నిరంతరం పరిభ్ర మించే విశ్వసృష్టి చక్రంగా భావించాలనడమే నానాలాల్ ప్రతిపాదించిన సాంకేతిక దృక్పథం. ఈ ఆశ్వాసంలో ఈ విధంగా నానాలాల్ వర్ణించిన విశ్వరూపదర్శనం అత్యుదాత్త స్థితిని చేరుకొన్నది. ఈ మహాచక్రం రసా తలానికన్నా ఇంకా అధఃస్థానంనుంచి ప్రభవించి పైకిలేస్తూ స్వర్గలోకపు ఎత్తులకు తాకుతూ సమస్త విశ్వాంతరాళాన్నీ కళ్ళు మిరుమిట్లు గొల్పుతూ నివ్వెరగొలిపే కాంతి నింపుతున్నదానినిగా ఆయన వర్ణిస్తాడు.

ఇంతలో హఠాత్తుగా ఉరుము ఉరిమింది
ఆకాశమంతా మార్మోగింది
దాని ప్రతిధ్వనులు విశ్వాంతరాళమంతటినీ ఆక్రమించాయి
అప్పుడికరసాతలానికన్నా దిగువ స్థానం నుంచి
ప్రభవించి దృశ్యమానమైంది
శీతకాంతిమయమై పరిభ్రమిస్తున్న మహాచక్రం
పవిత్ర హోమాగ్ని నిట్టనిలువునా ఎగసిపోతున్నట్లూ
స్వర్గలోకపు ఊర్ధ్వోర్ధ్వ స్థానాలకు సాగింది

పశ్చాత్తప్త హృదయులైన పాండవులకు జ్ఞానబోధ చేయాలనుకొన్న వ్యాసమహర్షి అప్పుడిట్లా అంటాడు వాళ్ళతో.

ధర్మరాజా! మహాసుదర్శనాన్ని వీక్షించు
కురుక్షేత్ర పర్యవసానం
నీ హృదయాన్ని
పశ్చాత్తప్త శోకవిషంతో నింపివేసింది
చూడు ఇప్పుడు ఈ చక్రంవైపు
నిశ్శేషసృష్టి లయాత్మకం

అణువులు అనూంతంగా శిలలుగా పరిణామం
శిలలు పర్వతాలుగా అవుతున్నవి
శిలలనుంచీ ఇలాతలం ఏర్పడింది
మళ్ళీ రాళ్ళు పొడిపొడిగా పిండి పిండి అవుతున్నవి
రజోరేణువులుగా విడిపోతున్నవి
ఇది మహాచక్రం
సృష్టి, లయాత్మకం
చావుబ్రతుకులు జీవితపు లీల
పరిభ్రమణ మహాచక్రం అంటుంది
ఓ రాజా! జననమరణాల కతీతంగా దర్శించు
ఆనంద లోకం ఆవల ఉన్నది.

అటు తర్వాత పాండవులు, వారి స్త్రీ జనమూ, ఏవిధంగా అదృశ్యాన్ని చూస్తూ కళ్ళు చెదిరి నివ్వెరపాటుతో చిత్ర ప్రతిమలవలె నిలిచారో కవి వర్ణిస్తున్నాడు.

మర్త్యలోక సంతానమా
లయాత్మకమైన చక్రమే
సృష్టిచక్రంకూడాను
చూడండి మహాచక్రపు కేంద్రస్థితంగా
శ్రీకృష్ణుడు
ఈ చక్రాన్ని త్రిప్పుతున్నవాడు.

పాండవులు అటు తర్వాత శ్రీకృష్ణుని విభవరూపాన్ని సందర్శించారు. మేఘాన్ని చీల్చుకొని ధగద్ధగితంగా వెలుగుతున్న సూర్యుడిలా ఉన్న శ్రీకృష్ణుని సందర్శించడంతో వారి వేదనాతమస్సు పటాపంచలైపోయింది. విశ్వరూప సందర్శనం జ్ఞానకాంతిరూపంగా వారి పరితాపమంతా తొలగించింది.

ఈ మహాకావ్యానికి భరతవాక్యం మహాప్రస్థానం.

పాండవులు ద్రౌపదీసహితులై హిమాలయాభిముఖులై గమిస్తూ ఉండడం వర్ణిస్తుంది మహాప్రస్థానం. కురుక్షేత్రకావ్యం ఇంతటితో ముగిసింది.

ఈ కావ్యాన్ని రచించడంలో నానాలాల్‌కు, కథ, పాత్రలు, సన్ని వేశాలు, సంఘటనలు, మహాభారతంనుంచి గ్రహించడానికి సర్వసంసిద్ధంగానే ఉన్నవి. చిత్రణం మాత్రమే తనది. నానాలాల్ దీనిని మిల్టన్ ప్యారడైజ్ లాస్ట్ రీతిలోని మహాకావ్యరచనమని చెప్పాడేకాని, సంస్కృత సంప్రదాయాన్ని అనుసరించి వ్రాశానని అనలేదు ఈకావ్యాని కాయన కూర్చిన సుదీర్ఘమైన ఉపోద్ఘాతాన్నిబట్టి, మహాకావ్యరచనవిషయమైన అవగాహన ఆయనకు బాగా ఉన్నట్లు కనపడుతుంది. ఆయన ఈఉపోద్ఘాతంలో పరిశీలనగా పేర్కొన్నభారతీయ, పాశ్చాత్య మహాకావ్యాలనుబట్టీ, ఆయన ఇందులో కొన్నిటిలోనైనా ఘనిష్ఠమైన పరిచయం ఉన్నవాడేననిపిస్తుంది. ఆయన ఈ కావ్య రచనలో ప్రవేశపెట్టిన రీతినిచూస్తే టెన్నిసన్ విరచితమైన 'ఇడిల్లిస్'కు చేరువగా రచనారీతిని దృష్టిలోపెట్టుకొన్నట్లు తోస్తుంది. అంటే రచనలో కథనంకన్నా గీతికాంశకే ఎక్కువ ప్రాధాన్యముండటమనేది, సాధించినట్లుగా కనపడుతుంది. మహాకావ్యాన్నిగురించి నానాలాల్ అభిప్రాయం 'చరిత్ర గీతం, మహాసాహసాలను చిత్రించే ప్రశంసాగీతం' అనేది. దీన్ని బట్టి వీరగాథాకావ్యానికి, మహాకావ్యానికిగల స్పష్టమైన భేదాలు ఆయనకు బాగా అవగాహన కాలేదేమో అనుకోవచ్చు. ఆయన ప్రతిభావంతుడైన, సమర్థుడైన కథకుడు మాత్రం కాడు. ఆయనలో కథానిర్వహణదక్షత లేదు. బహుశః ఇందువల్లనే ఏమో ఆయనకు కురుక్షేత్రలో ఆసక్తి రేకెత్తించి చివర దాకా చదివించే లక్షణం కనపడదు. ఈ విధంగా సాంతం ఆసక్తికరమైన కథాకథనం మహాకావ్యాలక్షణాలలో ఒకటి.

కవిత్వాన్ని గూర్చిన వర్గీకరణ విద్యా విషయికమైన ఆసక్తిని రేకెత్తించవచ్చు. కవి తన కావ్యాన్ని గూర్చి ఏ విధంగా చెప్పినప్పటికీ యథాతథంగా దానినే స్వీకరించాల్సిన అవసరం లేదు. నానాలాల్ తన కురుక్షేత్రను మహా కావ్యంగా చెప్పుకున్నాడు. మహా కావ్యమైతేనే తప్ప మేం చదివేది లేదు అనే దృష్టి ఉంటే ఏమో తప్ప, కురుక్షేత్రను నిజానికి మహాభారతగాథను స్వీకరించి వ్రాసిన సుదీర్ఘ భావగీతికా కావ్యంగా మనం సంభావించవలసి ఉంటుంది. నిజానికీ విధంగా స్వీకరించడం, చదవడం ఎక్కువ ఆనందాన్ని చేకూర్చగలవు. ఈ కావ్యంలో ఎన్నో చక్కని పాట లున్నాయి. మహా కావ్యంలో వీటికి యథార్థంగా స్థానం లేకపోయినా,

ఇవి ఏమీ ఆటంకం కలిగించవు. లక్షణ విరుద్ధంకదా అని ఎవ్వరూ కళ్లు చికిలించాల్సిన పనిలేదు. వాటిని చక్కని, మధురమైన భావగీతికలుగా చదివి ఆనందించవచ్చు. ఈ కావ్యంలోని కొన్ని భాగాలు గొప్ప కవితా కళా ఖండాలుగా అందాలతో తొణికిసలాడుతున్నాయి. నానాలాల్ రూపొందించిన లయాత్మక శైలి, ఈచోట్ల పారమ్యస్థాయినే చేరుకొన్నది. ఆయన కవితా భావనా శక్తి ఈ కావ్యంలో అంతటా ఉన్నతస్థాయిలోనే విహరించినప్పటికీ ముఖ్యంగా చివరిఆశ్వాసాల కొన్ని భాగాలలో మరింత ఉన్నతంగా విహరించింది అని చెప్పవచ్చు. మహాకావ్యానికి పద్యాత్మకంగా ఇప్పుడు స్థితిలేదు. ఆకాలం పూర్తిగా వెళ్ళిపోయింది. ప్రపంచ సాహిత్యాలలోకూడా ఈ ప్రక్రియ మృగ్యమే అయిపోయిందిప్పుడు. బహుశా నానాలాల్ గతించి పోయిన ఈ సంప్రదాయాన్ని పునరుద్ధరించే ఉద్దేశంతో ఈ కావ్యరచనం చేపట్టాడేమో. మహాకవిననిపించుకోవడానికి మహాకావ్యరచన చేయటం తప్పనిసరి అనేది ఆయన నమ్మకమేమోమరి. కురుక్షేత్ర మహాకావ్యం అనే అభిప్రాయంతో ఆయన ప్రకటించారు ఇతిహాస రచనలను సంస్కృత సంప్రదాయంలో మహాకావ్యాలుగా ప్రస్తావించడం పరిపాటి. ఇతిహాస రచనలు చేసేవారిని మహాకవులనడంకూడా సంప్రదాయమే. అయితే మారి పోయిన పరిస్థితులలో మహాకావ్యాన్ని సుదీర్ఘ పరిమాణంగల కవితా రచనగా స్వీకరించడంలో దోషంలేదు. ఈ రెండు ప్రమాణాలను దృష్టిలో పెట్టుకొని చూసినా నానాలాల్‌కుగాని, కురుక్షేత్రకుగాని నష్టమేమీలేదు. ఎందుకంటే నానాలాల్ రచనలలో కురుక్షేత్ర సుదీర్ఘ కావ్యాలలో ఒకటి. నానాలాల్ గుజరాత్ కవులలో అగ్రేసరుడనిపించుకొనేవారిలో ఒకడు. ఆయన మహాకవి. కురుక్షేత్రను మహాకావ్యమన్నా, సుదీర్ఘ భావగీతికా కావ్యమన్నా అప్పుడు విప్రపత్తి ఏమీ ఉండదు.

4

# రూపకరచన

1909 నుంచి 1943 మధ్యకాలంలో నానాలాల్ పన్నెండింటినిమించి రూపకాలు రచించాడు. ఈ రూపకేతివృత్తాలాయన చరిత్ర, పురాణాలనుంచి గ్రహించడమేకాక కొన్నిటిని స్వయంగా రూపకల్పన చేశాడు. కథా రంగ స్థలంగా ప్రకృతిని, నగరాలు, పల్లెలు, తీసుకున్నాడు. ఆదర్శప్రతిపాద కంగా, వాస్తవికంగా ఆయన ఇతివృత్తాలు మలచుకొన్నాడు. మసక మసకగా మాత్రమే చూడగలిగిన గతకాలంనుంచి, సుదూరభవిష్యత్తు వరకూ రచనాకాలాన్ని గ్రహించాడు. ఆయన సృష్టించిన పాత్రలు ప్రధా నంగా రెండువర్గాలలో ఇముడుతాయి. నైతిక విషయికం, సామాజిక ఆదర్శ ప్రతిపాదికం అయిన ఇతివృత్తాలలో యీ వర్గాలపాత్రలు చోటుచేసు కుంటాయి. సాధుపురుషులు, పాపాత్ములు, స్వాప్నికులు, దర్శనవేత్తలు, స్వార్థపరులు, ఆదర్శవాదులు, విభిన్నసామాజిక, మేధా, ఆధ్యాత్మిక స్థాయులలో ఈ రూపకాలలో కనిపిస్తారు. ప్రేమ, పెండ్లి, మతం, సామా జిక మానవ సంక్షేమం ఈ రూపకాల ఇతివృత్తం. నైతికోన్నతి, మాన వుణ్ణి ఉదాత్తస్థాయికి చేర్చడం, సమాజాన్ని, ప్రపంచాన్ని సంస్కార మహితం చేయడమే ప్రధానంగా ఈ రూపకాల ఉద్దేశం. సంఘటనలు, సన్నివేశాలు, వాతావరణం, కథేతివృత్తంలో ఏ విధంగా కూర్చడం జరుగు తుందంటే సాధారణంగా అవి అతీంద్రియ గ్రాహ్యస్థాయికంగా ఉంటవి. 'జీవితవిమర్శ'గా సమాలోచితమై, రూపకల్పన జరిగి, ఇతివృత్తాలు కాల్పని కంగా ఉంటవి. వీటిలో మధ్యమధ్య పాటలుంటాయి. విడిగా ఆ పాటలకు వ్యవస్థనేర్పరచవచ్చు. ఈ పాటలకు ప్రధాన కథేతివృత్తంతో అట్టే సంబంధం ఉండదు. ఒకవేళ కథాగమనానికి ఎక్కడో దూరపు సంబంధం కల్పించినా, ఈ పాటలకు ప్రత్యేకవ్యక్తిత్వం ఉంటుంది. సంప్రదాయసిద్ధంగా వస్తూ ఉన్నకాల, స్థల, వస్త్వైక్యములను వదిలివేసి వాటిస్థానంలో నాటకంలో మొదటినుంచి చివరవరకూ భావోద్వేగస్థాయికమైన ఐక్యత పాటించడం

నానాలాల్ రచనల విలక్షణత. ఈ రూపకాలన్నిటిలోనూ కనపడే ఐక్య లక్షణం ఇదే. భావపరిపూర్ణమైన గంభీరమైన లయాత్మకశైలిలో ఉండే ఈ రూపకాలు సంప్రదాయసిద్ధంగా భావించే గేయరూపక శ్రేణిలోకాని, వచన రూపకాలలోకాని చేరవు.

ఈ రూపకాలు స్వయంగా తమ రూపరేఖలు ప్రకటించుకున్నప్పటికీ ఉపోద్ఘాతాలలో ఆయన వెలువరించిన అభిప్రాయాలు, చేసిన పరిశీలనలు, నాటకరచనను గూర్చి ఆయన భావాలను విశదంగా వెల్లడిచేయగలవు. మొట్టమొదటి రూపకమైన ఇందుకుమార్‌లో, నానాలాల్ ఈ తన రూపకాన్ని సంగీతనాటికగానే (భావగీతికారూపకం) పరిగణించాలని స్పష్టం చేశాడు. నాటక సామాన్య లక్షణాలను వర్తింపచేయడం కుదరదని ఆయన హెచ్చరించాడు. తన రూపకాలు షేక్స్పియర్ నాటక లక్షణాలను దృష్టిలో పెట్టుకొని వ్రాసినవికాకుండా షెల్లీ 'ప్రొమిథియస్ అన్ బౌండ్', గోథే 'ఫాస్ట్' రచనలను దృష్టిలోపెట్టుకొని ఆ రీతిలో వ్రాసినవని ఆయన అభిప్రాయపడ్డాడు. ఈ విధంగా తన రూపకాలు షెల్లీ, గోథేల, రచనారీతికి చెందినవని ఆయన చెప్పుకోడం సమంజసమే. షేక్స్పియర్ సంప్రదాయాన్ని ఆయన అనుసరించకపోవడమూ నిజమే. నానాలాల్ షెల్లీతో కాల్పనికా దర్శాన్ని గోథేతో నైతికతత్పరత్వాన్ని సదృశంగా పంచుకొన్నవాడు. కళాశాల తరగతులలో షేక్స్పియర్ నాటకాలు చదివినా నానాలాల్ వాటి వల్ల ప్రభావితుడు కాలేడు. అసదృశ ప్రతిభాశాలి అని పేరుప్రఖ్యాతులు పొందిన షేక్స్పియర్ నానాలాల్ దృష్టిలో చాలా అల్పప్రతిభావంతుడు. అతిసామాన్యుడైన, చౌకబారురచయితగానే నానాలాల్ షేక్స్పియర్‌నుగూర్చి భావించాడు. దీన్ని మనం అర్థంచేసుకోవచ్చు. నానాలాల్ నైతికవాది. తీవ్రమైన సంస్కార దృక్పథం ఉన్నవాడు. సంస్కారావేశం కలవాడు. అందువల్ల షేక్స్పియర్‌లో ప్రాస్తావికంగా కనిపించే అతి సాధారణస్థాయి శృంగారాను రక్తి, పూర్తిగా ఐహికదృక్పథం, ఆదర్శకవితాస్థాయికి తగినవి కావని నానాలాల్ అభిప్రాయం కావచ్చు. ఆదర్శకవి అంటే నానాలాల్ దృష్టిలో జ్ఞానప్రదాత, బోధకుడు, మార్గదర్శకుడు, ఉత్తేజకుడూ అయిఉండాలి.

'బాక్ టు మెథుసెల' (విశ్వగీత, ఉపోద్ఘాతం, పుట 11) గూర్చి ప్రత్యేకించి ప్రస్తావించి ఉన్నందువల్ల నాటకరచయితగా బెర్నార్డ్‌షా ప్రతిభ

నాయన గుర్తించి అర్థంచేసుకున్నట్లే కనపడుతుంది. కాని కాల్పనికతత్త్వ వ్యతిరేకత, హేతువాదం, ప్రేమ పెండ్లి విషయాలలో దైహిక, ఐహిక దృక్పథమూ కనపరచే బెర్నార్డ్ షా, ఈ విషయాలలో ప్రధానంగా నైతిక, కాల్పనిక, ఆదర్శవాద బద్ధుడైన నానాలాల్‌ను ప్రభావితం చేశాడనుకోవటం పొసగదు. దీనికి భిన్నంగా షెల్లీలోని కాల్పనికాదర్శవాదమూ, ఆయన ప్రేమతత్త్వము, ప్రయోక్తృ ఆవేశము, సంస్కారోత్సాహము, భావగీతికా మాధుర్య సమృద్ధి, నానాలాల్ దృక్పథానికి, వైఖరికి బాగా సమన్వయం కాగలవని అనుకోవచ్చు.

టెన్నిసన్‌పట్ల నానాలాల్‌కు గల అత్యంతాభిమానం ఇదివరలోనే ప్రస్తావితం. ఆయన కళాశాల విద్యార్థిదశలో వ్రాసిన 'విశ్వ వ్యవస్థా క్రమంలో ప్రేమ వివాహపు స్థానం' అనే వ్యాసంలోని భావాలు నానాలాల్ రచించిన రూపకాలలో తమ ప్రభావం ప్రతిబింబింపజేయడం చూడవచ్చు. ఈ రూపకాలలో ఆయన ప్రతిపాదించిన భావాలకు ముఖ్యంగా ప్రేమ, వివాహం, స్త్రీ పురుషసంబంధ బాంధవ్యాలు, టెన్నిసన్ తన రచనలలోని ఈ భావాలు, దగ్గరపోలికలతో కనిపిస్తాయి ఈ విధమైన పోలిక కనిపించడం ఆశ్చర్యకరమైన విషయంకాదు. ఎందుకంటే టెన్నిసన్ వెలువరించిన దృక్పథం నానాలాల్‌కు సహానుభూతి కలిగించి విశేషాంగీకార యోగ్యం కావడంలో వింతలేదు. మౌలికాంశాలలో ప్రేమ, పెండ్లి, స్త్రీ పురుష బాంధవ్యాల విషయికంగా, ప్రాచీన భారతీయ సంస్కృతి వారసత్వంగా, వాటి పవిత్రస్థానమూ, నైతికపు విలువలూ, టెన్నిసన్‌కు అభిమానపాత్రంగానే ఉన్నాయని అనిపిస్తుంది. వేదకాలంనుంచి భారతీయఋషుల, ద్రష్టల, దర్శనాలు, సంస్కృత నాటక రచయితలుకూడా ఆ విలువలనే కొద్దిపాటి మార్పులతో స్వీకరించడం, టెన్నిసన్ భావాలతో సాన్నిహిత్యంతో ఉన్నట్లు కనిపిస్తుంది.

నానాలాల్‌కూడా షెల్లీవలె స్వాప్నిక జగత్తులో విహరించే తత్త్వం కలవాడు. కలలుకంటాడు. నానాలాల్ రూపకాలన్నిటా ఈ స్వాప్నిక లక్షణం విధిగా కనపడుతుంది. సౌందర్యం, కాల్పనికత, ఆదర్శలోక తత్త్వం, ఈ ఇద్దరి కవుల రచనలలోనూ ఉభయ సామాన్యంగా కనపడతాయి. స్వాప్నిక దృష్టికాల, స్థల, వస్త్వైక్యములను ఎంతమాత్రమూ

పాటించను. భావోద్వేగపు ముద్రమాత్రం ప్రభావం చూపుతుంది రచనలపై. సంప్రదాయ ముద్రగల కాల, స్థల, వస్త్వైక్యముల అధికారాన్ని మార్లో, షేక్స్పియర్, షాలు, కావాలని త్రోసిపుచ్చారని వాళ్ళనుగూర్చి ప్రస్తావించాడు నానాలాల్. కవిగా ఆయనకూడా సంప్రదాయచ్ఛందో నిబంధనలను ఉల్లంఘించగలిగినందుకు చాలా సంతృప్తితోకూడిన సంతోషాన్నే అనుభవించి ఉండవచ్చు. ఇంకా తాను పాటించిన సంప్రదాయోల్లంఘనకు ఇంకొక ఉదాహరణగా నాటకంలో పాటించవలసిన మూడు ఐక్యములను త్రోసిపుచ్చి వాటిస్థానే ఒకేఒక ఐక్యమును, మౌలికమైన భావోద్వేగైక్యమును, తన రూపకాలన్నిటా ముఖ్యంగా విశ్వగీతలో ఆయన ప్రవేశపెట్టడం జరిగింది.

ఇతివృత్తం సాంఘికమైనా చారిత్రకమైనా, నైతికమైనా, మతవిషయికమైనా నానాలాల్ రూపకాలు ఉదాత్తమైన, ఆదర్శోద్బోధకమైన భావస్ఫూర్తితో సాగుతాయి. సర్వసామాన్యంగా రూపకరచనలో పాటించవలసిన స్థాపన, వికాసం, పరాకాష్ఠ, నిర్వహణ (బీజబిందు పతాకా ప్రకరీ లక్షణాలు) నానాలాల్ రచించిన చాలా రూపకాలలో కనపడవు. సాధారణంగా కవి ప్రతిపాదించదలచుకొన్న ఒక ఆదర్శాన్నో, ఆదర్శతత్త్వాన్నో ఒక కథ, పాత్రలు, సంభాషణలు, పాటలు మొదలైనవాటిద్వారా ఒక ఇతివృత్త రూపంలో బాగా అల్లికగా రూపకల్పన చేస్తాడు. అందువల్ల ఇతివృత్త నిర్మితి దృఢంగా కనిపించనే కనిపించదు. సామాన్యంగా నానాలాల్ రూపకాలను గురించి ఇది సంభవమా, ఈ విధంగా జరుగుతుందా, అనుకోవడానికి ఆస్కారంలేదు.

ప్రయత్నపూర్వకంగానైనాసరే, ఆ సంఘటనలను ఇష్టమున్నా లేకపోయినా ఒప్పుకొని తీరాల్సిందే. అప్పుడే వాటిని మనం రూపకాలు అని అనుకోగలుగుతాము. వాస్తవానికి నాటకలక్షణాలు నానాలాల్ రూపకాలకు వర్తింపచేయనేగూడదు ఇక వీటి ప్రదర్శన యోగ్యతనుగూర్చి కవి తానే తన సందేహాలు వెల్లడించే ఉన్నాడు. అయినప్పటికీ కవిగారి జీవితకాలంలోనే ఒకటి రెండు రూపకాలు రంగస్థలంపైన ప్రదర్శించడం జరిగింది. వీటన్నిటిని బట్టి నానాలాల్ రూపకాలను శ్రవ్యరూపకాలుగా భావించడమే ఉచితం. చదివి ఆనందించడమే అధిక ప్రయోజనకారి. పంధొమ్మిదో శతాబ్దంలో ఇంగ్లండులో కావ్యరూపకమనీ (పొయెటిక్ ప్లే), 'క్లొసెట్ ప్లే' అనీ వ్యవ

హృతమైన రచనలనుపోలి, షెల్లి, టెన్నిసన్‌ల రచనలవలెనే కావ్యరూపక సమ్మిశ్రిత రచనగా, ఉంటాయి నానాలాల్ రూపకాలు ఆ విధంగా పరిశీలిస్తేతప్ప ఈ రూపకాలను మెచ్చుకోనూలేము, ఆనందించనూలేము. రంగస్థలంమీద ప్రదర్శించాలనుకొంటే యథాతథ స్వరూపాలకు మారుగా, కత్తిరించడం, తిరిగి కూర్చడం, అనుసరించడం చేయవలసి ఉంటుంది. ఈ విధంగా చంద్రవదన్ సి. మెహతా, షహన్‌షా అక్బర్ అనే నానాలాల్ రూపకాన్ని విజయవంతంగా రంగస్థలంమీద ప్రదర్శించాడు. ఈ రూపకాలు ప్రదర్శనకు పనికివచ్చినా రాకపోయినా, వీటిలోని కవిత్వపు విలువలకు మాత్రం ఏలోటూ రాదు. నానాలాల్ రూపకాలు స్థూలంగా మూడు విభాగాల క్రిందకు వస్తాయి. సాంఘికాలు, చారిత్రకాలు, పౌరాణికాలు, అని.

## సాంఘిక రూపకాలు

(1) ఇందుకుమార్

ప్రేమను ఇతివృత్తంగా గ్రహించి నానాలాల్ ఎన్నో రూపకాలు రచించాడు. ఇందులో ఇందుకుమార్ కూడా ఒకటి. కొంత కాలవ్యవధి పూర్వకంగా ఆయా సంవత్సరాలలో ఈ నాటకం మూడు భాగాలుగా వెలువడింది ఆయన రచించిన ప్రేమేతివృత్తరూపకాలన్నిటా ఇది చాలా ప్రముఖమైనది. వాటికి ప్రాతినిధ్యం వహించేదికూడాను. ఇందులో ఆయన తీసుకున్న వస్తువును తన ప్రథమ ప్రయత్న దీర్ఘకావ్యమైన వసంతోత్సవలో ఆయన స్పృశించే ఉన్నాడు. అటుతర్వాత ఇదే ఇతివృత్తాన్ని 'ఒజ్ అనె అగర్' లో కూడా స్వీకరించాడు. ఈ రెండు కావ్యాలలోకూడా ఆయన లయాత్మకశైలినే అనుసరించాడు. నానాలాల్ రచనలన్నిటిలోనూ ఆయన రూపొందించిన లయాత్మకశైలీ విషయికంగానేకాకుండా, కాల్పనికత, ఆదర్శవాదం, ప్రేమ, వివాహం, జీవితం మొదలైనవాటినిగూర్చి సర్వసామాన్యంగా ఆయన రచనల్లో కన్పించే భావసంపదవిషయం దృష్ట్యాకూడా బహుశః ఇందుకుమార్ అత్యంత ప్రతిభావంతమైన మిక్కిలి మనోహరమైన రచన అని చెప్పవచ్చు.

అంతేకాదు ఆయన శక్తినీ బలహీనతనూకూడా ఇది వెల్లడిస్తున్నది. కథానాయకుడి పేరుకూడా నాటకంపేరే. ఇతడొక కళాకారుడు. చాలాకాలం

స్వస్థలంలో లేకుండా అక్కడక్కడ పర్యటించి జన్మభూమికాయన తిరిగి వస్తాడు. లోకాన్ని మళ్ళీ సందర్శించాలనే చిరవాంఛతో దిక్చక్రతీరాలు దాటి కొత్త కొత్త అనుభవాలు గడించి, మనుష్యులనుగురించి, నగరాలను గురించి, చాలా విషయాలు తెలుసుకుంటాడు. తాను నివసిస్తున్న లోకాన్ని ఉత్తమంగా సంస్కరించాలని తీవ్రోత్సాహం ఆయనలో ఉంది. విదేశ జీవితానుభవంద్వారా సాధించిన సత్ఫలితమైన కొత్త జీవితాదర్శాన్ని ఈ లోకంలో నెలకొల్పాలన్న ఆవేశోత్సాహంతో ఉంటాడతడు.

నానాలాల్ సృష్టించిన నాయకుడు యూ-రోపు, ఆఫ్రికాలలోని పునరుజ్జీవన తీవ్రసంచలనానికి సంబంధించిన సంకేతస్ఫూర్తి అనే విషయం ఒక సుదీర్ఘ స్వగతంద్వారా (1, పు. 13_14) విస్పష్టంగా తెలుసుకోవచ్చు. నాయకుడైన ఇందుకుమార్ (అంటే తరుణ చంద్రుడు) కాంతిని (అంటే సౌందర్యాన్ని) ప్రేమిస్తాడు. ఆమెకూడా అతణ్ణి అదేవిధంగా ప్రేమిస్తుంది. తల్లిదండ్రులు కుదిర్చిన వరుణ్ణికాకుండా, తన మనసూ, ఆత్మా వరించిన వరుణ్ణే వివాహం చేసుకోవాలి అనేది ఆమె గాఢమైన ఆదర్శం. ప్రేమ, పెళ్ళి, వీటినిగూర్చి ఇందులో ప్రస్తావితమైన ఈ దృక్పథమే ఈ రూపకానికి సాంఘిక రూపక లక్షణం ఆపాదిస్తున్నది. ఎందుకంటే ఆనాడు గుజరాతులో కాని, భారతదేశంలోకాని ఈ విధమైన నూత్నవైఖరి ప్రేమ పెళ్ళి విషయాలలో వెల్లడించడం, ఒక సవాలు వంటిదిగానే భావించవచ్చు. అప్పటికి ఆచరణలోఉన్న పద్ధతులతో ఈ కొత్త దృక్పథం తీవ్రంగా విభేదిస్తున్నది. పాశ్చాత్యదేశాలలోని కులరహిత సమాజాలలో ప్రేమ వివాహాలు సర్వసాధారణంగా జరుగుతూఉండగా, భారత దేశంలో, గుజరాతులో అవి నూటికి కోటికి ఒకటి మాత్రమే సాధ్యమవుతూ ఉండడమూ తల్లిదండ్రులు కూర్చిన వివాహసంబంధాలే ప్రచురంగా సాగుతూ ఉండడమూ ఆ రోజులకు అమలులో ఉన్నది. కొత్తగా బయలుదేరిన సామాజిక ప్రబోధం మందుగా కుల నిర్బంధాల నిరంకుశత్వాన్ని వదల్చుకోవలసిందిగా హెచ్చరించింది. నిర్బంధవైధవ్యాన్ని నిరసించడమూ జరిగింది. గుజరాతులోని సంఘ సంస్కరణవేత్తలు, కవులు, ప్రేమవిషయమై, వివాహం విషయమై, కొత్త దృక్పథంతో ఆలోచించడంకూడా ప్రారంభమైంది. యథార్థంగా వీటి స్వరూప స్వభావాలేమిటో, యువతీయువకుల పరస్పర జీవన సంబంధ బాంధవ్యాల నివి ఏవిధంగా ప్రభావితంచేస్తున్నవో వారు ఆలోచనలు సాగిం

చారు. గుజరాత్ సాహిత్యంలో ప్రణయాన్నీ పరిణయాన్నీ గూర్చిన నవీన సమీకరణలు, అనుసంధానాలు రూపొందించే ప్రయత్నాలుకూడా జరిగినవి. గోవర్ధన్ త్రిపాఠీ వచన రచనలోనూ ఆ తరువాత కొంత కాలానికే నానాలాల్ కవితాపరంగానూ, మహిళల సాంఘిక స్థితిగతులు వారికివ్వవలసిన మర్యాద, సాంఘికమైన అంతస్తు, వైవాహిక ప్రతిపత్తి మొదలైన విషయాలనుగూర్చి ఆవేదనతో చిత్రించారు.

ఈ ప్రబోధచైతన్యంతోనే ముడిపడి స్త్రీ విద్యనుగూర్చిన సమస్య కూడా ఎదురైంది. మానసికంగా ఆమెలో ఉన్నతిని సాధించి అమలులో ఉన్న సాంఘిక వ్యవస్థలోని అక్రమాలనుంచి, వాటికి ఆమె ఒదిగిఉండడం నుంచి, ఆమెను రక్షించి, బయటకుతీసుకొని రావచ్చునన్న విషయం గుర్తించడం కూడా జరిగింది. నానాలాల్ రూపకాలలో ఆయన కవితలు కొన్నిటిలోవలెనే, ఆయన సాంఘిక తాత్త్విక చింతనలో భాగంగా విశుద్ధ ప్రణయం ప్రథమ వీక్షా ప్రణయా ప్రేమించి స్వయంగా నిర్ణయించుకొని వివాహమాడటం, స్త్రీ పురుషులు ఇద్దరూ వాంఛించే ఒక ఆదర్శసాధనకో, ఒక మహాకార్య సాధనకో కట్టుబడి ఆధ్యాత్మిక సాహచర్యం నెరపడమూ, వర్ణ్యవస్తువులుగా ఉండడం చూడవచ్చు.

ఇందుకుమార్ అనే ఈ రూపకంలో నానాలాల్ భావించే ప్రేమాదర్శం నాటకీయంగా తన పాత్రలద్వారా ఆయన ప్రవేశపెట్టాడు. అయితే ఆ పాత్రలన్నీకూడా ఆయన ముఖతఃమాత్రమే సంభాషిస్తాయి. 'ఎక్కడైతే ప్రేమ వివాహం జరుగుతుందో అక్కడ భూలోకస్వర్గమే పాదుకొంటుంది' (1, పు. 60). ఈ సూక్తికి అనుబంధంగా 'సామాజికవేత్తలు గనుక ప్రేమ వివాహాలను ప్రోత్సహించకపోతే, సంప్రదాయ వివాహాలనే కృత్రిమమైన చెట్లకు నిస్సత్త్వాలైన సంతానమే ఫలిస్తుంది, కృత్రిమమైన పుష్పాలకు సుగంధమేమీ ఉండనట్లు' (1, పు. 61) అనికూడా ప్రకటిస్తాడాయన. దీనిని బట్టి ఇందులోని నాయికానాయకుల జీవితాదర్శం 'ప్రేమద్వారా భూమిమీద స్వర్గాన్ని నిలపడమే అన్నమాట'. 'సమస్త ప్రపంచాన్నీ ప్రేమసామ్రాజ్యం పాలిస్తున్నదికదా' అంటాడాయన (1, పు. 109).

ఈ నాటకంలోని నేపాలయోగిని, కవిగారికి ప్రాతినిధ్యం వహించి ప్రవేశించడం తేటతెల్లమే. దేశంలోని రాజకీయ సాంఘిక వ్యవస్థా

స్వరూపాన్నిగూర్చి ఆమె ఎప్పుడూ మనసులో చింతనచేస్తూ ఉంటుంది. ఆ ఆలోచనలు భారతదేశం, యూరోపు, అమెరికాలచుట్టూ పరిభ్రమిస్తూ ఉంటాయి. అంతర్జాతీయ చరిత్ర, రాజకీయాలచుట్టూ తిరుగుతుంటాయి. 'ప్రపంచచరిత్రకంతా ఆసియా కేంద్ర బిందుస్థానం, ఆసియాకు భారతదేశం అంటూ ప్రకటిస్తూ నేపాలయోగిని భారతదేశాన్నిగూర్చి గంభీరస్వరంతో సుదీర్ఘస్తుతి ప్రసంగం చేస్తుంది. మళ్ళీ ఇది రెండో అంకంలోకూడా యథాతథంగా విపులంగా పునరుక్తమవుతుంది (11, పుటలు 60-65). ఈ సందర్భంలోనే మొదటి ప్రపంచయుద్ధంవల్ల కలిగిన అనర్థాలనుగూర్చి ఆమె ప్రసంగిస్తుంది. మొదటి అంకం ప్రచురితమై రెండో అంకం ప్రచురణకు వచ్చే కాలానికి మధ్య వచ్చిపడింది ప్రపంచయుద్ధం. అందువల్ల కవిగారి ద్వారా నేపాలయోగినిని ప్రేరేపించి ఈ యుద్ధం ఇట్లా పలికించింది. 'ప్రపంచంముందు ఇప్పుడున్న పెద్దసమస్య వినాశాన్ని ప్రేరేచే ప్రయత్నాన్ని నశింపచేయడం (11, పు. 74). అందువల్ల ఈ రూపకంలోని పాత్రలు 'ప్రతిపర్వతాగ్రంపైకి నిప్పు తీసుకొనివెళ్లి ప్రపంచపు చిరకాలపు పెడకుప్పలు తీసుకొనిపోయి బూడిదబుగ్గి చేయడానికి పూనుకొంటారు (11, పు. 79) ప్రపంచాన్ని సంస్కరించాడానికి తొలిమెట్టుగా నిరుపయోగమైన పాత కాలపు వాటిని నాశనంచేయాలన్న కోర్కెకు ఇది సాంకేతికమైన సద్భావ స్ఫురణం. కథానాయిక అయిన కాంతి తరువాత సమీపించబోతున్న వసంతాన్నిగూర్చి గానంచేస్తుంది. పునరుజ్జీవన జీవశక్తికి వసంతం సాంకేతిక చిత్రణం.

ఈ నాటకంలోని మూడో అంకంలో ఒక సాధుపుంగవుడు ప్రవేశిస్తాడు. ఆయన ఒక కొండపైన ఒక దేవాలయాన్ని నిర్మించాడు. ఆ దేవాలయం పేరు 'వసంత మందిరం' ఈ అంకంలోని నాలుగోరంగమంతా కవి పేర్కొనే 'వసంతతత్త్వ దర్శనానికే' వినియుక్తమవుతుంది. కథానాయకుడైన ఇందుకుమార్ ఒక నూత్న దేవాలయ ప్రథానార్చకుడుగా ఉద్యోగంలో ప్రవేశిస్తాడు. ప్రపంచంలో సంశ్లేషణయుగావిర్భావంకోసం 'పరిణామ సిద్ధాంతంలో ఉపనిషత్తులను, పురాతన సంప్రదాయాలలో ఆధునికతను ప్రతిష్ఠాపనంచేస్తూ 'ఆయన తన కార్యక్రమాన్ని సాగిస్తున్నాడు. (111, పు. 129).

ఇందుకుమార్‌లోని పాత్రలు, ఒక ఆదర్శతత్త్వం, భావోద్వేగం, ఆదర్శభావాలు, ప్రతిపాదించడానికి కవి ఉద్దేశించిన సామూహిక ప్రాతినిధ్య లక్షణాలు కలవిగా కనిపిస్తాయి. అటుతరువాత ఈ వర్గ ప్రాతినిధ్యానికి ప్రత్యేకించి వ్యక్తిత్వ రూపకల్పనచేసి స్థూలమైన లక్షణాలు ప్రతిపాదించాడు కవి. కవిచెప్పినట్లు 'సమకాలికమైన, సార్వకాలికమైన, మౌలికమైన సమస్యలను నాటకీయంగా ప్రదర్శించడానికి ఈ నాటకం' రచితమైంది.

ఈ రూపకంలోని ఇతివృత్తం ఒక రంగస్థలాన్ని నిర్దేశించినా దానిని మించిన విస్తృత పరిధిలోనే వ్యాపనం చెందడం చూడవచ్చు. ఇతి వృత్త నిర్వహణం, స్థానికమైన సంబద్ధతకు, నిర్దిష్టమైన పరిధికి, మించే ఉన్నది.

ఇందుకుమార్‌లోని ప్రధానేతివృత్తం ప్రేమ. ఇది బహుముఖాలుగా ఉదాత్తస్థాయినుంచి శారీరకాకర్షణ స్థాయివరకు ఈ రూపకంలో ప్రదర్శిత మైంది. ఉదాత్తస్థాయిలో నాయికానాయకపరంగా వర్ణితమైంది. వైవాహిక జీవితంలోని గృహస్థ ప్రణయ మాధుర్యానుభూతికి ఉదాహరణగా యాష్ జీవితం వర్ణితమైంది. ఇంకొకపాత్ర అయిన విలాసు జీవితంద్వారా కామ ప్రవృత్తి వర్ణితమైంది. ఇంకా మరొకపాత్ర అయిన ప్రమదద్వారా వైవాహిక దాంపత్యజీవితాన్ని ఉల్లంఘించే దిగజారిపోయిన స్థాయిని సూచించే ప్రవృత్తి వర్ణితమవుతుంది. ఈ రూపకంలోని పాత్ర అయిన నేపాలయోగిని, ప్రపం చాన్ని త్యజించిన వ్యక్తి. విశ్వప్రేమకు ప్రతినిధి. అనేక ఘట్టాలలో కవికి సాక్షాత్తూ ప్రతిరూపమే ఈ పాత్ర. ఆనందభగత్ పాత్ర, ఆపేరే సూచిస్తున్నట్లు, భక్తియొక్క ఆనందపారవశ్యాన్ని ప్రకాశింపజేస్తుంది. అప్రధానమైన చిన్నచిన్న పాత్రలు ఇంకా చాలా ఉన్నాయి. ఆడుతూ పాడుతూ కనిపించే ఒక చిన్నపిల్ల ఆ పాత్రలో ఇమడకుండా తన వయసుకు మించిన వివేక ప్రదర్శనచేస్తూ కనపడుతుంది. సాధారణంగా జీవితంలోని చీకటి ఛాయలూ, అసహ్యమైన అవాంఛనీయమైన అంశాలు, తన కవిత లోనూ, రూపకాలలోనూ పరిహరించినప్పటికీ, ఇందుకుమార్ రూపకంలో మాత్రం బాధాకరమైన ఆ బాధ్యతను నానాలాల్ పూర్తిగా విస్మరించి నెట్టి పారవేయలేదు. విషయైకదృష్టితోకూడి పాశవికమైన కామప్రకోపలక్షణం ఏ విధంగా అతికాముకులైన స్త్రీ పురుషులను వశంచేసుకునేదీ, దానికి లొంగి

పోయి వారేవిధంగా వర్తించేదీ నాటకీయంగా నానాలాల్ వర్ణించాడు. అయితే ఒక విషయం గమనించాలి. అధునిక సాహిత్యంలో వాస్తవిక చిత్రణ పేరుతో అధికంగా చెలామణీఅవుతున్న వస్తువుదృష్ట్యా చూసినప్పుడు వాస్తవిక రచయిత కాడు నానాలాల్.

నానాలాల్ తాత్త్విక దర్శనానికి మూలాధారమైనవి ఆయన నైతిక దృక్పథమూ, జీవితంలో దర్శించగోరే ప్రాథమికమైన నైతికమైన విలువలూ. అందువల్ల ఈ నాటకంలోని విలాసుపాత్ర వ్యామోహపు పాపపంకంలో కూరుకొనిపోయి ప్రారబ్ధానికి అలమటించిపోకుండా చివరకు రక్షణ లభించి ఆనందినిగా పరివర్తనం పొందుతుంది.

ఇక కథానాయిక కాంతి పాత్రలోని దోషంకూడా పరిహారం పొందు తుంది చివరకు. ఆమెకూడా బలహీనమైన కొన్ని క్షణాలలో ప్రమద ప్రభా వానికి గురిఅయి ఆమె జారినపడి విషయదృష్టి వ్యామోహితురాలై, ఏ విధంగా మోహగృహంపాలైందో వర్ణితమైంది. ఈ పతనానికిగాను కాంతి చాలా పోగొట్టుకోవలసివచ్చింది. దారుణమైన శిక్షనే ఆమె అనుభవించవలసి వచ్చింది.

కాంతి, ఇందుకుమార్‌లు పరస్పరం గాఢంగా ప్రేమించుకుంటారు. ఇందుకుమార్ ఆదర్శయువకుడు. పట్టుదలగల ఆదర్శవాది. విశాలమైన సామాజిక బాధ్యతకు లోబడిన కఠోరమైన ఆత్మసంయమనం ఒకవైపున, వ్యక్తిగతస్థాయిలో వివాహపర్యవసితం కావలసిన ప్రేమ ఒకవైపున, ఈ ఆకర్షణల మధ్య ఊగిసలాడుతూ ఉంటాడు. చివరకు సర్వసంగ పరిత్యాగం చేసి ప్రపంచపు ఆధ్యాత్మిక పునర్జీవనానికై పూనుకొంటాడు. ఒక కొత్త దేవాలయాన్ని నిర్మించి దానిని అవిచ్ఛిన్న వసంత చైతన్యశక్తికి అంకితం చేస్తాడు. ఆ దేవాలయంలోనే ఉండి తాను తన ఆదర్శంకోసం కృషి చేస్తాడు. నాయికలోని పతనంలాగానే, నాయకుడిలోని ఈ పరివర్తనం కూడా హఠాత్సంభవమేమో అనిపిస్తుంది. ఈ సంఘటనలు ముందుగా ఊహించేట్లుగామాత్రం జరగవు. నాయికలోని దోషం ఆమెను పశ్చాత్తాప దగ్ధురాలినిగాచేసి, దైహికమైన ప్రేమపట్ల తీవ్రమైన ఏవగింపు ఆమెలో కలగ టానికి కారణమవుతుంది. ఆమెకూడా ఆత్మవిమర్శ చేసుకొని, ప్రపంచాన్ని త్యజించాలని నిశ్చయించుకొని, నాయకుడితోపాటు తానుకూడా ఉన్నత

స్థాయి ప్రేమలో జీవితంలోని ఉన్నతాదర్శంకొరకు, ప్రయోజనంకొరకు తనను వాటిసేవకు అంకితంచేసుకోవాలన్న నిర్ణయానికి వస్తుంది. పాఠకుని దృష్టిలో ఇది సుఖాంతనిర్వహణంకాదేమో. ఈ ముగింపు పాఠకుడికి తృప్తికరంగాకూడా ఉండకపోవచ్చునేమో. సరిఅయిన ముగింపు కాదని కూడా అనిపించవచ్చు. ప్రణయరూపకంగా నాయికానాయకులు వివాహమాడి శృంగారమోదాంత నాటకంగా పర్యవసించవలసిన రూపకాన్ని ఏదో ఒక బలవంతపు కల్పనతో, ఒకమిషతో కవి దీని ముగింపు నిర్వాహణకు పూనుకొన్నట్లుకూడా పాఠకుడికి అనిపించవచ్చు.

స్త్రీపురుషులమధ్య విలక్షణమైన ఉదాత్తమైన ప్రేమస్థాయికూడా అసంభవంకాదుఅనిచూపడానికి నానాలాల్ ముగింపునీవిధంగా నిర్వహించి ఉండవచ్చు.వ్యక్తిగతమైన, భౌతికమైన స్థాయిలను అధిగమించిఐచ్ఛికంగా ఉదాత్తమైన ప్రేమ వ్యవస్థితంకాగలదు అని ఈ సూత్ర్న ప్రతిపాదన చేశాడు నాటక సన్నివేశమూలకంగా నానాలాల్.

ఈ రూపకంలో చాలా పాటలున్నాయి. ఒక్క మూడోఅంకంలోనే ముప్ఫైఎనిమిది పాటలున్నాయి. ఇవి గేయకవితామాధుర్యంతోను, సంగీత సౌందర్యంతోను తొణికిసలాడుతున్నాయి. దూరంగా ఏదోఒకవిధంగా ముడిపెడితేనేతప్ప నాటకప్రయోజనానికి ఈ పాటలకూ ఏవిధమైన సంబంధమూ ఉన్నట్లు కనపడదు. సూటిగా నాటకంతో ఏమీసంబంధించకపోయినప్పటికీ, ఈ పాటలు చాలా మనోహరంగా ఉన్నాయి. ఇరవైమూడు సంవత్సరాల కాలవ్యవధిలో ఈ నాటకం మూడుభాగాలుగా రచితంకావడంవల్ల చాలా అందదుకులుగాఉంది. విస్తృతపరిధితో ఉంది. నాటకంలోని పాత్రలు జీవితంలోని ఒకభాగానికే ప్రాతినిధ్యంవహిస్తూ విశిష్టంగా రూపొందాయి. ముఖ్యంగా ఈ పాత్రలన్నీ ఏఉద్దేశంతో రూపించడం జరిగిందో, ఆయారూపురేఖలన్నీ స్పష్టంగా తీర్చడం జరిగింది కాబట్టి వీటిని పోల్చుకోవడంలో ఏమాత్రమూ కష్టంలేదు. స్వగతాలు సంభాషణలు కవి రూపొందించిన లయాత్మకశైలిలోనే ఉన్నవి కాబట్టి, కొన్ని సందర్భాలలో నాటకీయలక్షణానికి, పరిధికి అతీతంగా పర్యవసించాయి. భావోద్వేగవ్యక్తీకరణంలోని అచ్చుసౌందర్యంవల్ల ఒక్కొక్కసారి అవి సూక్తిచిత్రణలాగాకూడా రూపొందాయి.

నాయికానాయకుల స్వగతాలుకొన్నీ, జనాంతికాలుకొన్ని, ఆత్మపరిశీలనాపూర్వకమైన సంభాషణలుకొన్నీ ఈ వర్గంలో చేరుతాయి. ఇందుకుమాక్ ఏనాడూ ప్రదర్శితంకాలేదు. రంగస్థలంమీద ఈ రూపకం చాలా పెద్దదీ, దీర్ఘమైనదీకావచ్చు. కాని చదివి ఆనందించవచ్చు. షెల్లీ'ప్రామిథియస్ అన్‌బౌండు'విషయంలో, గోథే'ఫాస్ట్' విషయంలోనూ ప్రదర్శనమందిరమూ రంగస్థలమూ అవసరంకావు. నానాలాల్ రచించిన ఈ రూపకం కూడా ఆ కోవలోకి చేరుతుంది.

(2) జయ—జయంత్

నానాలాల్ వ్రాసిన రూపకాలన్నిటిలోనూ, ఒక్క జయ-జయంత్ రూపకంమాత్రమే ఒకమిత్రుడి సూచనపై రంగస్థలంమీద ప్రదర్శించే ఉద్దేశంతోనే రచించడం జరిగింది. ఈ నాటకరచనకు సద్యఃప్రేరణ కవిగారి సొంతమేనగోడలుయావజ్జీవ సన్యాసినీదీక్షాస్వీకారంతో కలిగింది. ఈరూపకం రంగస్థలంమీద ప్రదర్శితమైందికూడా. రంగస్థల ప్రదర్శనకు అనువుగా ఉండడానికిగాను, నానాలాల్ చాలా శ్రద్ధాసక్తులువహించి శ్రమపడినట్లు కనిపిస్తుంది. నాటకేతివృత్తం చిక్కగాఉండేట్లు, ప్రధానకథ, సమాంతరంగా సాగేకథ, ఉపకథకూడా పొందికగా పర్యవసించేట్లు కొన్ని ఘటనలు సన్నివేశాలు, రంగస్థలాకర్షకంగా ఉండేటట్లు ఆయనకూర్చారు. కొన్ని పాటలు రంగస్థలానికితగినట్లు శోభించేవిధంగా, ఆయన శ్రద్ధతీసుకొని వ్రాసినట్లు కన్పిస్తుంది. సంస్కృతనాటక సంప్రదాయానుసారిగా అతిమానుష పాత్రలను, కంఠస్వరాలనుకూడా ఆయన ఈరూపకంలో ప్రవేశపెట్టారు. అయన ఇతర రూపకాలన్నిటితో పోల్చిచూస్తే, సాపేక్షంగా ఈ రూపకంలో కథాగమనవేగమూ పాత్రచిత్రణమూ, స్పష్టాకృతితో కనపడతాయి. ఈ రూపకంలో ఇతివృత్తం ప్రేమకు, వివాహానికి సంబంధించినదే. ఉదాత్తత నుంచి విశృంఖల స్థాయివరకు ప్రేమవివిధస్థాయులు, స్వరూపాలు ఈరూపకంలో వర్ణితమైనవి.

నానాలాల్ ఇందులో 'సున్నితమైన మనస్తత్వసంబంధిసత్యాన్ని' స్పృశించినట్లు చెప్పుకున్నాడు. అది ఏమంటే 'ప్రేమ కేవలం శారీరక వాంఛకే పరిమితంకాదు. కాకపోగా ఆధ్యాత్మికంగా పవిత్రమైన, పరిశుద్ధమైన ఉన్నతస్థాయికి చెందినది' అనేది. కవి ఇంకా ఇట్లా అంటాడు.

'సహజంగా రెండు ప్రేమ హృదయాలమధ్య సంపూర్ణ సామరస్యంలో శారీరకవాంఛపరితృప్తి విధిగాచోటుచేసుకోవలసిన అవసరంలేదు. (ఉపోద్ఘాతం, పు. 6). ఈ భావం నాయికానాయకులైన జయ, జయంత్ పాత్రలద్వారా వ్యక్తీకరించడం జరిగింది. ఆయనవ్రాసిన ఇంకొకరూపకం ఇందుకుమార్‌లో కూడా కవి ఈ భావాన్ని స్పృశించడం చూడవచ్చు రూపకంలోకూడా మళ్ళీ ఆదేభావాన్ని సన్నివేశానుగుణంగా ప్రదర్శించాడు నానాలాల్.

ఈ రూపకంలోని కథాస్థలం పర్వతదేశం ఈ దేశాన్ని పరిపాలించే రాణి తనకుమార్తె జయను, మహైశ్వర్యస-పన్నుడైన కాశీరాజుకిచ్చి వివాహం చేయాలని అభిలషిస్తూ ఉంటుంది. కాని ఆమె భర్తకుమాత్రం అది ఇష్టం లేదు. రాణికోరిక నెరవేరకుండా ఆయన నిరోధిస్తూనే ఉంటాడు. అయినా ఆమె ఏమాత్రం చలించదు. తనకోరికను విడిచిపెట్టదు. జయ, జయంతుణ్ణి ప్రేమించినందువల్ల ఈ బలవంతపు వివాహాన్ని తప్పించుకోవడానికై, ఇల్లు విడిచి పారిపోతుంది ఈ విషయం జయంత్‌విని ఆమెను వెతుక్కుంటూ బయలుదేరుతాడు. మార్గమధ్యంలో అతడు ఒక దేవర్షిని దర్శిస్తాడు. ఆయన 'భూలోకం నీకు ఏమిఇవ్వడానికి సాధ్యంకాలేదో, దేవలోకంనీకు దాన్ని తప్పక ప్రసాదిస్తుంది. అని వరం ఇచ్చినట్లుగా పలుకుతాడు. అప్పుడు జయంత్ ఓరిమితో ఆయన 'హరికుంజ్' ఆశ్రమంలోనే స్థిరనివాసం ఏర్పరచుకొని ధ్యానంతో కాలం గడుపుతుంటాడు. ఆధ్యాత్మికంగా సుసంపన్నుడై ఎంతో సాధించినప్పటికీ, మానవుడిగా తనకు ప్రపంచాన్ని ఆధ్యాత్మికంగా పునర్జీవింపచేసే సంకల్పయత్నంలో జయ లేకుండా పరిపూర్ణసిద్ధి లభించదని భావిస్తాడు.

ఇంతలో ఒక సంతోషకరమైన ప్రమాద ఘటనద్వారా తన ఆశ్రమవాసులు, సమీపంలోని నదిలో మునిగిపోబోతున్న జయనుకాపాడి, ఆమెను స్పృతిలేని ఆస్థితిలోనే అతడివద్దకు తీసుకొనివస్తారు. ఇంతలో ఆమెకు స్పృహకలుగుతుంది. జయంత్ ఆమెవైపువస్తాడు. క్షణకాలంపాటు జయ దైహికసౌందర్యంపట్ల మోహితుడైపోతాడు కాని ఇంతలోనే తన తప్పునుంచి తెప్పరిల్లి తన మోహప్రవృత్తిని నిగ్రహించి తన ఆధ్యాత్మిక వివేకంతో జయను తన ఆధ్యాత్మికపత్నిగామాత్రమే స్వీకరించడానికి నిశ్చయాన్ని సుదృఢం చేసుకుంటాడు. జయాజయంతులప్పుడు దైహిక వివాహంకాక

అధ్యాత్మికవివాహం చేసుకోవడానికే నిర్ణయించుకుంటారు. ఇద్దరూ వేర్వేరు ఆశ్రమాలలో నదికి ఎదురెదురు ఒడ్లలో నివసించడానికి నిర్ణయించుకుంటారు. ప్రపంచపు ఆధ్యాత్మిక సంపదను పెంపొందింపజేయడానికి నిశ్చయించుకుంటారు.

సమాంతరంగానడిచే కథాకల్పనంవల్ల జయను వివాహంచేసుకోవాలనుకున్న కాశీరాజు, ఆమెను వెతుక్కుంటూ దారిలో స్వాతి అనేపేరుగల అందమైన బ్రాహ్మణకన్యను కలుసుకుంటాడు. ఆమె తీర్థగురువు అంటే ఒక పవిత్ర క్షేత్రాచార్యుని కూతురు. తండ్రిసంరక్షణనుంచి దూరంగా వెళ్ళిపోతున్న ఆమెను మార్గంలో కలుసుకొని ప్రేమించి, వివాహం చేసుకుంటానని ఆమెతో చెపుతాడు కాశీరాజు. కొంతకాలం గడిచిన తర్వాత ఆమెను వివాహం చేసుకుంటాడు. కాశీరాజును ఈ నాటకంలో మూర్తీభవించిన రాజధర్మంగా చిత్రించారు కవి జయంత్‌ను ఆధ్యాత్మికజ్ఞానం మూర్తీభవించిన వాడుగానూ, బ్రహ్మచర్యమనే నైతిక పవిత్రనియమాన్ని పాటించే విశిష్టవ్యక్తిగానూ చిత్రించారు. కాశీరాజు క్షత్రియుడు. స్వాతి విప్రకన్య. వారి వర్ణాంతర వివాహం, భారతదేశంలో ఆగమించబోతున్న శుభ సూచనగా చిత్రీకరించాడు కవి. ఏమంటే వారిద్దరిదీ సత్యమైన ప్రేమ. దాన్ని సాధించి వాళ్లు వివాహం చేసుకున్నారు.

ఉపకథలస్థానంలో తీర్థగురువు, వామాచార్యులు, ఇంకొక నర్తకి వృత్తాంతం చేర్చడం జరిగింది. పుణ్యక్షేత్రాలలో పేరు కొనిపోయిఉన్న పాపపంకిలాన్ని, అవినీతికశ్మలాన్ని ప్రదర్శించడానికి వీరికథలు తోడ్పడతాయి. ఆ ఉద్దేశంతోనే నానాలాల్ వీటిని సృష్టించాడు. ప్రపంచంలోని పాపాన్ని గూర్చి వర్ణించడానికిగాని, పాపం ఉన్నదని అంగీకరించడానికిగాని నానాలాల్ ఎంతమాత్రం సంకోచించకపోయినా, చివరకు పాపం జయిస్తుందని మాత్రం ఎన్నడూ ప్రదర్శించడు. కాబట్టి హృదయపరివర్తనం ద్వారా దుష్టత్వంనుంచి మంచిలోకి వ్యక్తి ప్రవేశించడం నాటకీయంగా కల్పన చేస్తాడు. మానసిక ఆఘాతాలద్వారాను, పశ్చాత్తాపంద్వారాను, దీని నాయన సాధిస్తాడు ఈ విధంగా ఈ రూపకంలోని దుష్టపాత్రలన్నీ హృదయపరివర్తనాపేక్షిలోనై చివరకు పూర్తిగా పరివర్తన పొందుతాయి. వామాచార్యులు చివరకు తాను అనుసరిస్తున్న మార్గం పాపభూయిష్ఠమైనదని గుర్తించగలుగుతాడు తీర్థగురువు తన కూతురును కాశీరాజు ఆకర్షించడమూ,

తనకూతురు ఇంటినుంచి వెళ్ళిపోవడమూ తెలిసి తీవ్రమైన ఆఘాతానికే గురి అవుతాడు. తన సోదరి యెడల తాను చూపిన పాపచింతన వల్లనే తనకిటు వంటి శాస్తి జరిగిందని పశ్చాత్తాపహృదయంతో అతడు గ్రహించగలుగుతాడు. నర్తకికూడా తన జీవితవిధానాన్ని అసహ్యించుకొని హృదయపరివర్తనం పొంది, సన్మార్గంలోకి ప్రవేశిస్తుంది.

ఇందువల్ల మంచి నాటకంగా రంగస్థలంమీద ప్రదర్శించడానికి అనువైన యోగ్యతలన్నీ సమకూరాయి. సంస్కృత నాటకలక్షణమైన అతి మానుష, దివ్యసంఘటనలు కూడా ఈ నాటకంలో చోటుచేసుకున్నవి. ఉదాహరణకు ఆకాశవాణి ప్రబోధమూ, జయంత్ స్వర్గలోకయాత్ర మొదలైన అద్భుత మహిమలు ఈ నాటకంలో కనిపిస్తాయి. జయంత్ అసురులతో యుద్ధం చేయడంకూడా ఇటువంటిదే. దేవర్షి తన తపశ్శక్తితో త్రికాలదర్శనంచేసి చెపుతాడు. భూత, వర్తమాన, భవిష్యద్దర్శనాలు, అతీంద్రియ, అతీతమానవశక్తులతో ఆయన త్రైకాలిక జ్ఞానం ప్రదర్శిత మవుతుంది.

ఇందులోని పాత్రలను స్థూలంగా రెండు వర్గాలుగా విభజించవచ్చు. మంచిపాత్రలు, దుష్టపాత్రలు అని, దుష్టపాత్రలన్నీ చివరకు మనః పరివర్తనం పొందుతాయి. ఈ రూపకం వినిపించ ఉద్దేశించిన నైతిక సందేశం నేర్పుగా ఇతివృత్తంలో అను సంధానించడం జరిగింది. ఆ సందేశం ఇది. స్త్రీ పురుషుల ప్రేమానుబంధంలో విధిగా శారీరకసంతృప్తి ఉండ వలసిన అక్కరలేదు. అంతేకాక ఆత్మలమధ్య ఆధ్యాత్మిక వివాహంకూడా సుసాధ్యమే. ఒక జ్వలితాత్మ ఇంకొక ఆత్మతో సాంగత్యం అభిలషించి రెండూ ఏకమైపొయ్యేస్థితి అసంభవం కాదు. అయితే వివాహ వ్యవస్థనేమీ నిరసించదు ఈ రూపకం. ఆ వివాహ వ్యవస్థకే కొత్తదైన వ్యాఖ్యానాన్నీ, కొత్త సంప్రదాయాన్నీ చేకూర్చుతున్నది.

నానాలాల్ రచించిన రూపకాలలో జయ-జయంత్ బాగా ప్రచారం పొందింది. ఇందులో కొన్ని మంచి స్వగతాలు, సంభాషణలు ఉన్నాయి. అందమైన దృశ్యాలు ఉదాహరణకు జయ, జయంత్‌లు హంసజంటతో వినో దించడం, త్రికాల దర్శనసుందరవిన్యాసం, కురుక్షేత్రలో మహాసుదర్శ నాన్ని ప్రత్యక్షీకరించే సన్నివేశం చాలా ఆకర్షిస్తాయి. గీతలో విశ్వరూప

సుందర దృశ్యాన్ని పోలిఉంది మహాసుదర్శన దృశ్యం. ఈ రూపకంలోని ఇటువంటి దృశ్యాలు ఉదాత్త భావస్థాయికి పఠితలను, ప్రేక్షకులను తీసుకొని పోగలవు. హృదయాన్ని కదిలించగల, మనోహరమైన పాటలున్నాయి ఈ రూపకంలో. నాటకరంగంమీద బాగా రాణించే పాటలుకూడా ఉన్నాయి. వీటన్నిటిలోనూ చాలా కవితాత్మకంగానూ వీనుల కింపుగా సంగీత రసభరితంగా ఉండేపాట జయంత్ పాడేది. ఇదివరలోనే ప్రస్తావితమైన దృశ్యంలో అంటే జయ నెమ్మదినెమ్మదిగా స్పృహలోకి వస్తూఉండగా, కన్నులుమెల్లగా తెరిచిచూస్తూ ఉండగా జయంత్ ఈ పాట పాడుతాడు. కాంతితోమెరిసిపోయే ఆమె అందమైన కళ్ళలోకి చూస్తూ ఇట్లా అంటాడు.

'ఆకాశంలో ధగద్ధగితంగా మెరుపుకాంతి మెరిసినట్లు
నీ కళ్ళలో కాంతి జ్వలిస్తున్నది
నేను దాన్ని చూస్తున్నాను, ఆకాంతి జ్వాలముందు నతుణ్ణి
అవుతున్నాను.'

ప్రేమ ఇక్కడ శారీరకమైన, ఐహికమైన పరిధులను అధిగమించి పవిత్రమైన ఆధ్యాత్మిక విశిష్టతకు చేరుకున్నది.

ఈ రూపకంలో మనసుకి ఆహ్లాదం కలిగించే పాటలుండీ, కథాసంఘటనలు బిగువుగాఉండే, సంభ్రమాశ్చర్యాలు కలిగించే సన్నివేశాలుండీ అతిమానుషములైన అద్భుతసంఘటనలూ, వేగానికీ, రంగస్థలంమీద కదలికలకూ బాగా అవకాశం ఉన్న కథాకల్పనమూ ఉన్నప్పటికీ, రంగస్థల ప్రదర్శన విషయికంగా నానాలాల్ పునరాలోచించుకోవలసిన పరిస్థితులు ఆయనకు ఎదురైనట్లు తెలుస్తున్నది. (జయ్–జయంత్, ఉపోద్ఘాతం పుట 6). ఈ రూపకం రంగస్థలానికి చాలా పెద్దదవుతుంది. రంగస్థల ప్రదర్శన విషయం పట్టించుకోకుండా ఉంటే, గీతికారూపకంగా దానిదైన గొప్పకవితా సౌందర్యం దానికుంది. కొన్ని నాటకీయ దృశ్యాలుకూడా ఉన్నాయి.

(3) ప్రేమకుంజ్

నానాలాల్ రచించిన ఇతర సాంఘిక రూపకాలలో ఇంకొక మూడింటిని మాత్రం చారిత్రక రూపకాల ప్రస్తావనకు వచ్చేముందుగా పరిశీలించవలసి ఉంది. వీటిలో మొదటిది ప్రేమకుంజ్ (1922) అంటే ప్రణయలతానికుంజమన్న మాట. ఈ రూపకానికి ఉపోద్ఘాతంలో నానాలాల్ అంటాడు,

5

'ప్రపంచంలో ఇవాళ మళ్ళీ ప్రేమను పునఃప్రతిష్ఠితం చేయగల కవిత్వం రావాలి. జీవితంలో మళ్లీ ప్రేమ పాదుకోవాలి ఇవాళ జీవితంలో సత్యమైన ప్రేమకానిదేదో అదే చెల్లుబాటవుతున్నది. అందుచేత ఆదారి తప్పి పోయినవాళ్ళకు మార్గదర్శకంగా ఉండడానికి, నిజమైన ప్రేమ కథ నేడు చాలా అవసరం. 'ఈ రూపకంలోని ప్రేమకథవల్ల' ఆరిపోయిన ప్రేమ జ్వాలను, మళ్లీ ఏవిధంగా వెలిగించడం జరిగిందో, ప్రేమను ఏ విధంగా పోగొట్టుకుంటారో, మళ్లీ తిరిగి ఏవిధంగా పొందుతారో, ప్రేమ దేవాలయంలో తిరిగి ప్రేమను ఏ విధంగా ప్రతిష్ఠాపనం చేయడం జరిగిందో నానాలాల్ వర్ణించాడు తానాశించే ప్రయోజనాన్ని తన జీవితలక్ష్యాన్ని దానిని సాధించే మార్గాన్ని తాను ముందుగా నిర్ణయించుకోవడం జరిగిన తర్వాత ఎందరి వ్యక్తులనో ఎన్నెన్ని ప్రదేశాలనో దర్శించి సర్ గెల్ హడ్ పవిత్రపానపాత్ర విషయమై పడిన ఆర్తితో పోలికవహించి తన జీవిత లక్ష్యప్రయత్నాన్ని విజయవంతంగా సాధించి తిరిగివచ్చిన ఉదంతాన్ని ప్రదర్శించారు నానాలాల్. పరిమాణంలో విస్తృతమైన నీతికథలాగానో దృష్టాంతకథ లాగానో ఉన్న ఈ రూపకం ప్రేమకు సంబంధించి పాడే ఒక స్తుతి గీతంతో ముగుస్తుంది. ప్రేమదేవాలయంలో ప్రేమజ్యోతిని ప్రతిష్ఠించడంతో ప్రేమరాజ్యం పృథివిపై స్థాపించడం అనేది ప్రతీకాత్మకంగా జరిగింది.

ఈ నాటకంలోని కథానాయికా నాయకులు ప్రేమతత్త్వానికి తమ్ము పునరంకితం చేసుకుంటారు అవివాహితులుగానే ఉండిపోవడానికి నిశ్చయించుకున్నప్పటికీ. ఇంకొకవైపున రాజకుమారుడు తాను ప్రేమించిన పల్లెపిల్లను పెళ్ళిచేసుకుంటాడు. దీనితో వర్ణాశ్రమాచార నిర్బంధాలు తెంచివేయడమే కాక, ధనవంతుల పేదవాళ్ళ మధ్యఉన్న భేదభావపు అంతరాన్నికూడా తొలగిస్తాడు కవి. దీనివల్ల మనం 'ఏమి తెలుసుకోవచ్చునంటే ప్రేమమీద ఆధారపడిన వివాహానికి ఆయన సుముఖుడు, వివాహవ్యవస్థకు వ్యతిరేకి కాడు అని. జయ్ జయంత్ ప్రధానేతి వృత్తంతో పోలికలు ఉన్నప్పటికీకూడా, ప్రేకుమంజ్ లోకూడా కథ లేకపోలేదు. తనదైన కవిత్వం ఉంది. ప్రకృతి నేపథ్యం ఉన్నది. ఈ ప్రకృతి సౌందర్యాన్ని నవనవంగా స్వచ్ఛంగా అనురాగ మధురంగా వర్ణించాడు కవి.

(4) గోపిక

గోపిక (1935) కూడా రంగస్థలంమీద ప్రదర్శితమైన నానాలాల్ రూపకాలలో ఒకటి. ఇందులో కవిగారి కూతురే ప్రధాన భూమిక వహించి

ప్రదర్శనలో పాల్గొనడం విశేషం. ఇందులోకూడా ప్రకృతి సౌందర్యమే నేపథ్యం. ఈ రూపకరచనద్వారా నానాలాల్ ఉద్దేశించింది, ఆదర్శమైన ఒక గ్రామాన్ని చిత్రించి 'యూరోపులోని ఉద్యాననగరాలలాగా' దాన్ని పరివర్తింపచేయడం. నగరజీవితంలోని కృత్రిమాలు, దుర్భరమైన ఒత్తిడు లను వర్ణించిన తర్వాత, గ్రామీణమైన ఆర్థికవ్యవస్థ సంక్షోభానికి గురిఅయి నశించిపోతూ, వ్యవసాయంయొక్క దుఃస్థితి, విద్యావిహీనత మొదలైనవాటిని వివరంగా వర్ణించి నేటి విషాదకరమైన దౌర్భాగ్యంనుంచి పల్లెను రక్షిం చాలంటే, నగరంలోఉండే సౌఖ్యజీవనపు మంచిఅంతా గ్రామానికీ, గ్రామంలో ఉండే మేలిమి అంతా నగరానికి సంక్రమింపజేసేట్లుగా వాటిని పునర్నిర్మింపచేయాలని కవి సందేశాన్ని వినిపిస్తాడు.

(5) జగత్ – ప్రేరణ

సకల మానవాళికి అవిచ్ఛిన్న జీవనాధార ప్రదాయినిగా ఉండి జీవి తాన్ని నడిపే చోదకశక్తి ఏమిటో తెలుసుకోవాలన్న ప్రయత్నమే జగత్ – ప్రేరణ (1943) లోని ఇతి వృత్తం. ఇందులోని కథానాయకుడి పేరు 'పరాక్రమ్' అంటే సాహసమన్నమాట ఈపేరు ప్రతీకాత్మకమైనదన్న మాట. ఈ కథానాయకుడు యూరోపు, అమెరికా, జపాన్ దేశాలన్నిటినీ పర్యటిస్తాడు. అక్కడంతా నైతికభ్రష్టత తాలూకు అంధకార చ్ఛాయలనే అతడు చూస్తాడు. ఇక అప్పుడు 'భారతదేశం మాత్రమే మానవాళికి ఆశా స్థానం' అనే పూర్తి నమ్మకంతో మాతృభూమికి తిరిగివస్తాడు. ఇక వెంటనే 'అంధకార ప్రపంచానికి వెలుగుచూపడానికి' సాహస యాత్రికుడు పూను కుంటాడు. చివర కతడు పరిపూర్ణ జ్ఞానంతో తిరిగివస్తాడు. అప్పుడు కథా నాయిక జ్యోతికను పెళ్ళాడుతాడు, ఈపేరుకూడా ప్రతీకాత్మకమే కాంతి అని అర్థం. కవి మళ్లీ ఇక్కడ స్త్రీ పురుషులు తమ ఆదర్శాలను జీవిత కాలంలోనే నెరవేర్చుకోలేరని ధ్వనింపచేస్తాడు. ఇందులోని సందేశం ఏమంటే సమస్త విశ్వంలోని మానవాళి సంశ్లేషణ దృక్పథాన్ని అలవరచుకొని, మేలి మిని పరస్పరం సంలీనం చేసుకోవాలని. సంశ్లేషణ సూత్రాన్ని మానవాళి గ్రహించాలి.

దేహము, ఆత్మ, స్త్రీ, పురుషుడు, ప్రాచ్య, పాశ్చాత్య సంస్కారాలు, ప్రాపంచికత, పారలౌకికత, భోగం, త్యాగం, వీటన్నిటిని సంశ్లేషణ

ద కృథంతో ఏకంచేయాలి. ఈ రూపకంలో చాలా పాటలున్నాయి. సుందరమైన దృశ్యాలున్నాయి. అందులో సింహాలకు సంబంధించిన దృశ్యం ఒకటి. గిర్నార్ శిఖరాన్ని గురించిన సుందరవర్ణనం ఇంకొకటి.

చారిత్రక రూపకాలు

నానాలాల్ రచించిన చారిత్రక రూపకాలలో జహంగీర్-నూర్జహాన్ (1293) షహన్‌షా అక్బర్ (1930) చాలా ప్రసిద్ధికెక్కాయి. చారిత్రక నాటకాలంటే చరిత్రకు తూ. చా. తప్పకుండా విధేయంగా ఉండాలని అంగీకరించినా, నానాలాల్ ఏమన్నాడంటే' ఈ రూపకాలలోని సంఘటనలూ పాత్రలూ సృష్టించడంలో, చరిత్ర సత్యాన్ని కవిత్వానికి సమన్వయపరచడమే తన ఆశయం అన్నాడు. యూనివర్శిటీలో చదువుకొనేటప్పుడు చరిత్ర ఆయన అభిమాన విషయం. దీనికితోడు భారతదేశ చరిత్రలో మొగల్ పరిపాలనాకాలంనుంచి చారిత్రకాధారాలు సేకరించడానికి ఆయన ఎంతగానో శ్రద్ధతీసుకున్నాడు. శ్రమపడ్డాడు. ఈ రూపకాలలో సరిఅయిన వాతావరణాన్ని కల్పించడానికిగాను, పర్షియన్ పదాలు ఎక్కువగా ఉపయోగించడమే కాకుండా మొగల్ దర్బార్ శోభావైభవాన్ని కనులకు కట్టేట్లు నిలపడానికిగాను తన చారిత్రక భావనాబలంతో పరమసుందరంగా తీర్చిదిద్ది ప్రదర్శించాడు. మొగల్ చరిత్రలోకి, సంస్కృతిలోకి తాను సాహసించి దూకడం, తనకు కొత్తదైన కవితా సాహసమే అని ఆయన పేర్కొన్నాడు. ఈ ప్రయత్నాన్ని ఆయన ఇంకా ఇట్లా అభివర్ణించాడు. తన ప్రయత్నం 'ఒక భారతీయుడు ఇస్లామును అర్థంచేసుకొని వివరించే చిత్తశుద్ధితోకూడిన ప్రయత్న' మన్నా డాయన.

నానాలాల్ చిత్తశుద్ధిని గూర్చిగాని, శక్తిసామర్థ్యాల విషయంగాని ఏమాత్రం సందేహించలేము. అంతేకాకుండా నానాలాల్ జహంగీర్ నూర్జహాన్‌లపట్ల ఎంతో అభిమానమూ, సానుభూతీ ఉన్నవాడు. ఆయన దృష్టిలో వాళ్ళిద్దరూ ఆదర్శ ప్రేమికులు. అక్బర్ అంటే ఆయన దృష్టిలో సాంస్కృతిక సంశ్లేషణ మూర్తీభవించి, పరిణతమైన జ్ఞాన సంపన్నతకు ప్రతీక. నానాలాల్ హృదయానికి ఈ సాంస్కృతిక సంశ్లేషణ మనేది చాలా ప్రియమైనది. 'సత్యమూ, కవిత్వమూ, సంశ్లేషణం పొందడమనేది నిఖిల ప్రపంచంలో చాలా అరుదుగా జరిగే సంఘటన' అని పేర్కొంటూ నానాలాల్ తన చారిత్రక రూపకాలు ఈ విధమైన అపూర్వ వర్ణవిన్యాసాన్ని చిత్రీక

రించే 'తూలికా ప్రయత్నాల'న్నాడు (జహంగీర్-నూర్జహాన్. పు. 21). దీని వల్ల నానాలాల్ బహుశః ఉద్దేశించింది చరిత్ర, కవిత్వతత్త్వాలు, అంటే చారిత్రకాంశాలయాథార్థ్యమూ, భావనాశక్తియాథార్థ్యమూ, సమన్వయము, సమ్మేళనమూ పొందడమే అయిఉంటుంది. ఇదే ఆయన ఆశించిఉన్న దయితే, ఆయన చారిత్రక రూపకచరన దీనిని సాధించిందనే చెప్పవచ్చు. ఈ రూపకాలలో చరిత్రమాత్రమే కాదు. కవిత్వంకూడా ఉంది. లేదా నానా లాల్ మాటల్లోనే చెపితే, ఆయన పూర్తిగా అభిలషించే రీతిలో 'చారిత్రక కవిత' ఉంది.

జహంగీర్ - నూర్జహాన్, షహంషా అక్బర్.

'జహంగీర్ నూర్జహాన్‌ల రాచరికపు ప్రణయగాథ కాశ్మీరపు ప్రకృతి సహజసౌందర్యమంత అద్భుతమైనది' అన్నాడు నానాలాల్. ఇంతకు పూర్వం ఇంకొక రాచకుటుంబపు ప్రేమికుల జంటకు కవితా నీరాజనం అర్పించా డాయన తన తాజమహల్ కవితలో. ఇక్కడ ఈ రూపకంలో ఆయన ఈ ప్రేమికుల పాత్ర చిత్రణం ద్వారా వారి ప్రేమకు నివాళులర్పించాడు. దీనితో జహంగీర్ నూర్జహాన్‌లు పరస్పరం తమను తాము అర్పించుకున్న గాఢ ప్రేమికులన్న విషయం విశదంగా తెలుస్తుంది. ఈ రూపకం శృంగార ప్రణయగాథాత్మకంగా ఆయన సంకల్పించాడు. అట్లాగే రూపొందించాడు. తీర్చిదిద్దాడు అందువల్ల సాధారణస్థాయి జీవిత సంఘర్షణలు, అల్పమైన వాస్తవికాంశాలు అన్నీ ఆయన ఈ ఉజ్జ్వల ప్రేమగాథా ప్రపంచంనుంచి పరి హరించాడు బహుశా శృంగార గాథోజ్జ్వల వాతావరణంనుంచి కొలువుకూటం లోని కుట్రలు, యుద్ధఘోషల నల్లని నీడలు, తొలగించడానికే ఆయన ఈ విధంగా చేసిఉండవచ్చు.

చారిత్రక రూపక రచనలో ఆయన ఆశయం 'మహాపురుషుల ఆత్మా విష్కరణమూ, వారు జీవించిన కాలస్వరూపాన్ని చిత్రించడమూ, చరిత్రనే అనుశాసించగల కాలపు దివ్యదర్శనాన్ని చిత్రించడమూ' అని ఆయన వివ రించాడు. (జహంగీర్ - నూర్జహాన్, ఉపోద్ఘాతం, పుటలు 21-22) నానా లాల్ దీనిని సాధించడంలో కృతకృత్యుడైనాడు. ముఖ్యంగా అక్బర్ నాట కంలో. మహావ్యక్తిగా ప్రసిద్ధుడైన అక్బర్ మహత్తును రసహీనమైన చారిత్ర కాధారాల ద్వారా చిత్రించడం కాకుండా, అక్బర్ సూక్ష్మగ్రాహితను, దూర

దృష్టిని 'దిన్-ఇలాహి' స్థాపించడంలోని అపూర్వ మతసహనాన్ని ఉజ్జ్వలింపజేస్తూ చిత్రించాడు. ఈ రూపక రచనకు టెన్నిసన్ రచించిన 'అక్బర్ స్వప్నము'న్నూ ఫ్లోరాస్టీల్ వ్రాసిన నవల 'స్వాప్నిక రాజకుమారుడు'న్నూ ఆయన కళ్ళెదుటే ఉన్నవి అదృష్టవశాత్తూ మొగల్ చక్రవందరిలోనూ శ్రేష్ఠుడైన అక్బర్‌ను గూర్చిన ఆయన సొంత అంచనాలతో అవి పూర్తిగా ఏకీభవించినవి. వీరారాధకుడికి మహావీరుడిపట్ల ఉండే వైఖరి అది. బహుశా ఈ వైఖరివల్లనే కాబోలు, చారిత్రక రూపకంగా ఉద్దేశించినప్పటికీ, అక్బర్ చుట్టూ అల్లిన అద్భుత వృత్తాంతాలు – ఆయన పూర్వజన్మ వృత్తాంతం, ఆయన ఒక గొప్పసన్యాసిని దర్శించటం – ఇవి పురాణాలలో ఉండదగినవి కాని, చారిత్రక సంఘటనలుగా పనికిరావు – ఈ రూపకంలో ప్రవేశపెట్టడం జరిగి ఉండవచ్చు.

అక్బర్ నానాలాల్ వివిధ సంస్కృతుల, మతాల, కళల, సాహిత్యాల వివిధ జాతుల సంశ్లేషణ వైభవాన్ని దర్శించాడు. అక్బర్ గుణగణాదులతోను, ఈ రూపక రచనతోను, నానాలాల్‌కు ఎంతటి తాదాత్మ్యభావం సమకూడిందంటే, ఆయన అక్బర్‌పై చూపిన అభిమానం ఈ రూపకాన్ని ఆయన అక్బర్‌ను గూర్చిన ప్రస్తుతి గీతంగా వ్రాశాడా అనిపిస్తుంది. వాస్తవానికి అక్బర్ మహత్త్వాన్ని వర్ణించే ఈ రూపకం అక్బర్‌కు నానాలాల్ సమర్పించిన మధుర గీతికా నీరాజనం అని చెప్పవచ్చు. 'చరిత్రలో అక్బర్ ఒక కీలక స్థానాన్ని వహిస్తున్నాడు' అనే హెచ్. జి. వెల్స్ అభిభాషణను నానాలాల్ ఉద్ధరించాడు. కాని ఈ రూపకంలో అక్బర్ చారిత్రాత్మక పాత్రనుగూర్చి చాలా స్వల్పంగా మాత్రమే ఉంది. ప్రధానంగా అక్బర్ వ్యక్తిత్వమూ, మానవతా దృక్పథంపైనే నానాలాల్ దృష్టి అంతా కేంద్రీకృతమైంది. అక్బర్ మరణం హృదయాన్ని బాగా కదిలించే విధంగా వర్ణితమైంది.

నానాలాల్‌లో సాధారణంగా నవ్యసృష్టి అంటే నవీనకల్పనాశిల్పం కనిపించదు. ఇది ఒకలోపమే ఆయన రచనలో. అయితే ఈ రెండు రూపకాలైన జహంగీర్ – నూర్జహాన్, అక్బర్‌లలో ఆ లోపపరిహారం జరిగింది. పాత్రలు, సంఘటనలు, సన్నివేశాలు, లిఖితచారిత్రకాధారాలనుంచే గ్రహించి ఇతివృత్త రూపకల్పనం చేయడం జరిగింది. కథాకల్పనంలో చేయితిరుగని లక్షణం ఈ రెండు రూపకాలలోకూడా కొంతవరకు కనపడుతూనే ఉంది

కథానిర్మితిలో కొన్ని లోపాలు కనపడుతున్నప్పటికీ ఆ రూపకాలలోని కొన్ని దృశ్యాలను ప్రత్యేకంగా విడిగా ప్రదర్శిస్తే రూపకరచనా సౌందర్యం బాగా వ్యక్తమవుతుంది. ఉదాహరణకు జహంగీర్ – నూర్జహాన్ రూపకంలోని 'జహంగీర్ న్యాయబుద్ధి' అనే సన్నివేశాన్ని చూపవచ్చు.

ఈదృశ్యం ఉదయపూర్‌నుంచి వచ్చిన ఇద్దరు రాజపుత్రులు షాహజాద ఖుర్రం సహితులై జహంగీర్ కొలువుకూటంలోకి ప్రవేశించడంతో మొదలవుతుంది. మేవార్‌లో సాధించిన ఘనవిజయానికిగాను ఖుర్రం రాకొమరుణ్ణి అభినందించిన తర్వాత, జహంగీర్ ఉదయపూర్ రాకొమారుశీపట్ల గొప్ప ఔదార్యం కనపరుస్తాడు. తనతో సరిసమాన హోదాను చూపి ఆయన్ను గౌరవిస్తాడు. తాము జయించిన రాజ్యాన్ని మహారాణాకు తిరిగి ఇచ్చివేయవలసిందిగా అజ్ఞాపిస్తాడు. దీన్ని వినగానే జహంగీర్ కొలువులోని ప్రధాన మంత్రి 'సికింద్రా సమాధిలోని అక్బర్ ఆత్మ ఇది విని ఎంతగానో సంతోషిస్తుంది' అంటూ ఉండగానే బయటనుంచి ఎవ్వరో హఠాత్తుగా బంగారు గొలుసు లాగుతారు. దాని చివరఉన్న న్యాయఘంట మ్రోగుతుంది.

జహంగీర్ : షహజాదా, అన్నిటికన్నా న్యాయం సంగతిముందు
రాజకీయ వ్యవహారాలు తర్వాత
అవును, విజయోత్సవమైనా తర్వాతే
విను, ఎవరో సింహద్వారంవద్ద
న్యాయంకోసం ప్రతీక్షిస్తున్నారు
చూడు నువ్వు, నా ప్రజల కెవరికీకూడా
న్యాయం దక్కకుండా ఉండటానికి వీలులేదు

(రజక స్త్రీ, ఒకామె ప్రవేశించి సభామధ్యంలో నిలబడుతుంది.)

ప్రధానవజీరు : చెప్పు, పాదుషావారి ఆశ్రితురాలికి
ఎవరు హాని కలిగించారు ?

రజకురాలు : దూరదృష్టిగల వజీరూ
ఏ న్యాయచట్టంలో ఉందో చూపగలవా ?
అన్యాయానికి గురి అయినా ఫిర్యాదే
ముద్దాయిని పట్టి తీసుకొనిరావలసి ఉంటుందని
నేను ముద్దాయిని పట్టితెచ్చి అప్పగించినమీదటన్నా

మీరు ఆ ముద్దాయికి శిక్ష విధించేది!
అయితే సరే! మంచిది, రాజప్రసాదపు
తలుపులు తెరవండి
ముద్దాయి రాజ ప్రసాదంలో ఉన్నాడు.

జహంగీర్ : (న్యాయాధీశుడి గాంభీర్యంతో)
ఏమమ్మా! నీ వృత్తాంతం వినిపించు

రజకురాలు : మేం రజకులం
ఢిల్లీ, అగ్రాల మురికినంతా శుభ్రపరుస్తాం
కిందటివారం ఒక రాత్రి
నక్షత్రాలు మినుకు మినుకు మంటూ ఉండగా
అర్ధరాత్రి చీకటిలో
యమునలో దీపఘటాలు తేలివస్తున్నాయి
రాజప్రసాదంనుంచి తుపాకీగుండ్లూ వచ్చాయి
ఒకగుండు ఇంతలో హఠాత్తుగా వచ్చి
అది చివరి గుండు
మా ఆయన్ను పొట్టను పెట్టుకుంది
జహాపనా, ముద్దాయి రాజప్రసాదంలో దొరుకుతాడు.

జహంగీర్ : నీభర్త?! ను కాల్చిచంపిన ఘాతుకుడు
రాజప్రసాదంలోనా ఉన్నాడు?!

రజకురాలు : అవును మహాప్రభూ
మా ఆయన ఇకలేడు, హతుడైనాడు
నే నివాళ అనాథను
నా పసిపాప ఆకలితో ఆలమటిస్తున్నది

జహంగీర్ : ప్రతిమూలా, ప్రతిచోటా
అంతఃపురమంతా గాలించండి
అసఫ్‌ఖాన్, ముందువెళ్లు, ముద్దాయిని పట్టి తీసుకొనిరా
నా ప్రజలను హింసించేవారికి
నా అంతఃపురంలో తలదాచుకోవడానికి స్థానంలేదు.

(సింహాసనం వెనుకనుంచి బుల్‌బుల్ పిట్టకూత వంటి సన్నని మధుర మైన కంఠస్వరం వినపడుతుంది.)

కంఠస్వరం: ఆగు, ఓ చక్రవర్తీ, ఆగు

(సింహాసనం వెనుకఉన్న తెర తొలగిపోతుంది. నీలి పర్దాతో తలపై కిరీటం ధరించిన నూర్జహాన్ ప్రవేశించి రజకురాలి ప్రక్కనే నిలబడుతుంది. చక్రవర్తి కొలువుకూటంలోని వారంతా ఆశ్చర్యవిభ్రమంతో నిశ్చేష్టులై పోతారు. భయసంభ్రమంతో అసఫ్‌ఖాన్ శిలాప్రతిమలాగా నిలబడిపోతాడు.)

నూర్జహాన్ : వినండి ఓ సమస్త ప్రపంచ ప్రజలారా
నూర్జహాన్ కాంతికి మసక కమ్ముకుంటుంది
జహంగీర్ పాదుషావారి న్యాయనిర్ణయంలో
విశ్వాసం సంచలించినప్పుడు
రాజసభలో ముద్దాయి ప్రత్యక్షంగా ఉంది
అర్థరాత్రి తుపాకి కాల్పుల్లో చివరిగుండు నేనే పేల్చాను

జహంగీర్ : ఓ నా హృదయజ్యోతీ, ప్రపంచజ్యోతీ
జహంగీర్ న్యాయాన్ని నీవు నిలబెట్టావు
రాజప్రాసాదాని కంతకూ అందానివి నువ్వు
చక్రవర్తి న్యాయనిర్ణయానికి సౌందర్యం నీవే చేకూర్చగలవు
ఇటువంటి హత్య నూర్జహాన్ చేతుల్లో జరుగుతుందా
సౌందర్య హస్తాలు కిరాతక పాపకృత్యాని కొడిగట్టగలవా!!
చంద్ర కిరణాలు కత్తులుకాగలవా

నూర్జహాన్ : ఓ మహాప్రభూ
వితంతువుల దుఃస్థితి నాకూ అనుభవమే
ప్రపంచంలో ఈ దుఃస్థితి
ఎవరికీ కలుగకుండునుగాక
నేను కాల్చిన తుపాకిగుండు మడివేలును
హతమార్చింది
నేను అతణ్ణి కావాలని గురిచేయలేదు
చీకటిలో యమునా జలాలు ప్రవహిస్తున్నాయి
దీపకుంభాలు యమున హృదయంలో తేలియాడుతున్నాయి

రాజప్రసాదపు వడవానుంచి (బాల్కనీ)
వేడుకకోసం కాల్పులు సాగించాము
ఆకాశంలో మినుకు మినుకు మంటున్న
నక్షత్రాలవలె ఉన్న
దీపకుంభాలు లక్ష్యంగా చేసుకుని
బహుశః అట్లా వెలువడిన తుపాకి నిప్పుగుండు
మడివేలును చంపి ఉండవచ్చు
నిజానికి ఎవరికీ తగలాలని మేం కాల్చలేదు
చివరిగుండు, నేను ఒప్పుకుంటున్నాను
నిజానికి నేనే కాల్చాను.

జహంగీర్ : అసఫ్‌ఖాన్ - ఆ గుండును కాల్చిన
తుపాకి నిటు తీసుకొనిరా

(అసఫ్‌ఖాన్ నిర్ఘాంతపోయి, నిలచిపోయి వెర్రిచూపులతో తొట్రుపడతాడు.)

రాజాజ్ఞలు, భగవంతుని ఆజ్ఞలు
తిరిగి తిరిగి జారీచేయడం జరగదు
అసఫ్‌ఖాన్, ఆ తుపాకి నిటు తీసుకొనిరా
ఆ గుండను కాల్చిన దానిని ...

నూర్జహాన్ : షాయద, తీసుకొనిరా, తుపాకిని
ఇది రాజుగారి ఆజ్ఞ
చంపిన నేరానికి ప్రతిగా చంపవలసిందే

(దర్బారంతా ఈ భయంకరమైన మాటలు విని ప్రూన్పడిపోయింది.)

ఖుర్రం : కన్నుకు కన్ను, చెవికి చెవి
తంత్రీ, న్యాయపు గొలుసు

జహంగీర్ : షహజాద, సామ్రాజ్యం విచ్ఛిన్నమై పోతుంది
న్యాయపు బంగారు గొలుసు తెగిపోయినప్పుడు
భూమిమీద పాతించిన అక్బర్ జయస్తంభం
బాద్‌షాహ బాబర్ వంశపు పునాది రాయి

హెచ్చుతగ్గులు పాటించని సరిసమాన న్యాయపాలనం
కోసమే ఉన్నాయి.

(షాయదా తుపాకిని తీసుకుని వస్తాడు, తెచ్చి సామ్రాజ్ఞికి ఇస్తాడు. ఆమె దాన్ని పట్టుకుని ముందుకు సాగుతుంది సింహాసనం వైపుకు. ఆందోళనతో సతమతమవుతున్న సభ అంతా జహంగీర్ కాల్పుకు ఎవరు గురిఅవుతారా అని ఆశ్చర్యపడుతుంటారు.)

జహంగీర్ : నూర్, తుపాకి గురిపెట్టి కొట్టడంలో
నువు అందరినీ మించావు
ఇవాళ ప్రపంచంలో నీసాటి వచ్చేవాళ్లెవరూ లేరు
ఆ తుపాకిని ఆ రజకురాలి కందించు

(నూర్జహాన్ ఆ తుపాకిని ఆమె ముందు పట్టుకొని ఆమెకు అందించడానికి నిలిచింది. చక్రవర్తి సింహాసనంనుంచి దిగి, ఆ రజకురాలి దగ్గరకు వచ్చాడు.)

ఏమమ్మా భయంవద్దు, తీసుకో తుపాకి
జహంగీర్ నాలుకపైనుంచి ఎన్నటికీ
'నూర్‌ను హతమార్చమనే' పలుకులు రావు
అయినా నీకు న్యాయం చేకూరాలి
నూర్ కాల్చిన తుపాకి గుండు నీ మగణ్ణి చంపింది
నేను నూర్ మగణ్ణి
ఇదే ఆ తుపాకి
తీసుకొని గురిచూచి కాల్చు
నూర్ భర్తను

(చక్రవర్తి రజకస్త్రీకి అభిముఖంగా వచ్చి నిలుస్తాడు. న్యాయపరిపాలనలో చక్రవర్తి పట్టుదలకు రజకురాలి గుండె కరిగిపోతుంది. చక్రవర్తికీ, చక్రవర్తినికీ మోకరిల్లుతుంది.)

రజకస్త్రీ : వేలమంది నేలకొరగనీ
కాని వేలమంది రక్షకుడు మాత్రం, కాదు
నాకు కావలసిన న్యాయం లభించింది

దీనికి ప్రపంచంలో ఎక్కడా పోలికేలేదు
జహాపనా, నా న్యాయం నాకు లభించింది
జహంగీర్ న్యాయ సింహాసనం
ప్రపంచంలో మచ్చలేకుండా నిలిచిపోతుంది గాక
ప్రేమ ద్వయం జహంగీర్ - నూర్జహాన్
ప్రకాశిస్తారు గాక సూర్యచంద్రులవలె.

జహంగీర్ ఔదార్యాన్నిగూర్చి ప్రసిద్ధమైన భావానికి ఇది నాటకీయమైన రూపకల్పన. దీనిద్వారా ఆయన న్యాయనిష్ఠ వెల్లడవుతున్నది. నూర్జహాన్ పట్ల, చిత్తస్వాస్థ్యం తప్పి' ఇటు న్యాయానికిగాని, అటు ప్రేమకుగాని మొప్పంరాకుండా, ఆందోళనపడి ఆయన సూచించిన పరిష్కారమార్గం, చక్కగా నాటకీకరించాడు కవి. ఈ దృశ్యంలో నాటకీయమైన గొప్ప ఉత్కంఠను ప్రవేశపెట్టాడు. రజకురాలు ప్రతీకారం మాట మరచిపోయి, మనసు కరిగిపోయి, ఉదారబుద్ధిని ప్రదర్శించడం, నాటకీయమైన పరాకాష్ఠ.

సంఘమిత్ర

సంఘమిత్ర (1931) నానాలాల్ రచించిన ఇంకొక చారిత్రక రూపకం. ఇతర రూపకాలకూ దీనికి ప్రధానమైన భేదం ఉంది. ప్రయత్నపూర్వకంగా దీనిని సంస్కృత సంప్రదాయానుసారిగా రచించాడు కవి. అయితే ఈ అనుసరణంకూడా పరిమితంగానే జరిగినట్లు కన్పిస్తుంది. సంస్కృతంలో శ్లోకాలుండే రచనా భాగంలో ఈయనకూడా సంస్కృత ఛందాలు రచించాడు. అంటే ఈయన ఈ నాటకంలో వ్రాయవలసిన పద్యభాగమంతా సంస్కృత ఛందాలను అనుసరించి వ్రాశాడన్నమాట. శ్రీలంకకు మహేంద్రుడు, సంఘమిత్రులు బౌద్ధప్రచారానికి వెళ్ళడాన్ని ఆయన ఈ రూపకంలో ఇతివృత్తంగా స్వీకరించాడు. అయితే ఈ రూపకంలో ప్రధాన పాత్రధారి అశోకుడే. అశోకుని జీవితంలోని విషమఘట్టాలన్నీ ఇందులో కీలకమైన సన్నివేశాలైనాయి. ఆ ఘట్టాలను వివరంగా చిత్రించాడు రచయిత. రక్తకళంకితమైన కళింగయుద్ధ విజయాన్ని సాధించి పాటలీపుత్రానికి అశోకుడు తిరిగి రావడం, హింసపట్ల ఆయనకు కలిగిన ఏహ్యభావం, ఆయనలో వచ్చిన హృదయ పరివర్తనం, ఆయన అవలంబించిన అహింసా వ్రతం, బౌద్ధమతం,

అటుతరువాత తన కుమారుణ్ణీ, కుమార్తెను బౌద్ధమత ప్రచారం నిమిత్తం విదేశాలకు పంపడానికి ఆయన నిశ్చయించడం ఇవన్నీ వివరంగా వర్ణించడం జరిగింది.

ఒక దృశ్యంలో బుద్ధదేవుడు సూచించే మధ్యేమార్గాన్ని సాక్షాత్కరింప జేసుకొన్న సన్నివేశానికి సంబంధించిన బుద్ధదేవుని పరమసుందర చిత్ర పటం, అలంకృతమై కనపడుతుంది.

సంఘమిత్ర, మహేంద్రుడుకూడా పాత్రలేకాని వాళ్ళస్థానం ఉప పాత్రల స్థానమే. రూపకం సంఘమిత్ర అనే పేరుతోనే ఉన్నా, రంగస్థల కేంద్ర ప్రాముఖ్యంగల పాత్ర అశోకుడు బహుశా ఈ రకమైన హెచ్చు తగ్గులను రచయిత గుర్తించినందువల్లనే కాబోలు, సమర్థించుకోవడానికేమో అన్నట్లు విస్తృత పరిధిలో అశోకుడి కథ లేకుండా సంఘమిత్ర కథకు ఉనికే లేదు అంటాడు నానాలాల్. నానాలాల్‌కు వీరారాధన ఎక్కువ. భావో ద్వేగంతో ఆయన యెప్పుడూ వీరులపట్ల ఆ కృష్టుడవుతూనే ఉంటాడు. అశో కునిపట్ల ఆయన కనపరచిన వైఖరి, అక్బర్‌పట్ల కనపరిచిన వైఖరిలాగానే వీరపూజా ప్రవృత్తితో కూడిఉంది. గీతికా మాధుర్యంతో, కవితా పరిపూ ర్ణంగా ఆయన వారిపట్ల తన మెప్పుదలను వ్యక్తం చేశాడు.

## పౌరాణిక రూపకాలు

అశోకుడు. సంఘమిత్ర, బుద్ధుడు చారిత్రకపాత్రలు. 'రాజర్షి భరత్' (1922) అనే రూపకంలో చరిత్రకుగాక పురాణ కథకే ఎక్కువ ప్రాధాన్యం కనపడుతుంది. సంస్కృత నాటకాల వరవడిలోనే కవి దీనిని రచించాడు. ఇందులో భరతుడు, కణ్వుడు, శకుంతల, ఇంకా మానవ, అధిమానవ పాత్రలూ కనిపిస్తారు. భారతదేశ మనే పేరు ఈ దేశానికి రావడానికి కారణభూతుడైన భరతుడు, ప్రతీకాత్మకంగా వసుంధరను (అంటే భూమిని) వివాహం చేసుకోవడం ఇందులోని ఇతివృత్తం. కాళిదాసు శకుంతలకు తరు వాత కథా భాగంగా కనిపించే ఈ రూపకానికీ, కాళిదాసు దివ్యసుందర రససృష్టికీ పోలిక చాలా స్వల్పం. అందులోని పాత్రలనే ఇందులోనూ ఉప యోగించుకోవడం ఒక్కటి తప్ప గొప్ప పోలికలేమీ లేవు. పోలికల సంగతి కేంగాని, నానాలాల్ రూపకంతోకూడా కొన్ని భాగాలలో ఒక విలక్షణమైన

అందం ఉండనే ఉంది. నానాలాల్‌కు కాళిదాసుపట్ల గల అధికమైన గౌరవం, సూటిగానూ, భంగ్యంతరంగానూకూడా ఈ రూపకంలో బాగా వెల్లడి అవుతున్నది.

విశ్వగీత (1927) నానాలాల్ రచించిన ఇతర రూపకాలలో ఒకటి. ఇది ఏ వర్గంలోనూ చేరని రూపకం. దీనికి నాటక లక్షణం వర్తింపజేయటమే అలవిగాని పని. ఈ రూపకం ఉపోద్ఘాతంలో నానాలాల్ యూరోపునాటకాలు గ్రీకు రూపక నమూనాలపై ఆధారపడి సంప్రదాయబద్ధమైన మూడు ఐక్యములు, కాల, స్థల, వస్త్వైక్యతలు పాటిస్తూ రచించినవి అంటాడు. అని ఇంకా ఈ విధంగా అభిప్రాయపడతాడు. మార్లో, షేక్స్పియర్‌లు ఈ సంప్రదాయాన్ని భగ్నం చేశారు. వాళ్లు కేవలం ఒక భావదఘ్నత, భావస్థాయి అనే ఐక్యమును మాత్రమే పాటించారు అంటాడు నానాలాల్.

ఆయన రచించిన 'బాక్‌టు మెథుసెలా' అనే రూపకంలో బెర్నార్డ్‌షా కాలైక్యతకు స్వస్తిచెప్పాడు, అని ఈ విషయాలన్నీ చర్చిస్తూ నానాలాల్ కడపటి మాటగా 'రసైక్యము ఒకటి మాత్రమే ఐక్యము' అనీ తాను దీనిని మాత్రమే పాటిస్తాననీ ప్రకటించి, విశ్వగీతలో ప్రతిపాదించాడు

విశ్వగీత రూపకం చూపు సరిగా ప్రసరింపజేయడానికి సాధ్యంకాని గతంనుంచి, సుదూరభవిష్యత్తువరకూ కాలాన్ని కథావస్తువును అనుసంధానిస్తుంది. బుద్ధుణ్ణి, మహమ్మదును, ఏసుక్రీస్తును, రాముణ్ణి, శంకరాచార్యుల వారిని తీసుకొనివస్తుంది. ఇంకా ఇతర ఋషులు, ప్రపంచ ప్రవక్తలుకూడా ఎందరో వస్తారీ రూపకంలో. ప్రశంసార్హమైన ప్రయత్నాలెన్నో చేశారు వాళ్ళంతా మానవ జీవితాన్ని మాన్యం చేసేందుకు. అయితే వీరంతా ఎన్ని గొప్ప ప్రయత్నాలు జరిపినా ప్రపంచంలో దుష్టత్వం అనే సమస్య అపరిష్కారంగా అలానే ఉండిపోయింది అనే భూదేవి అభియోగం వినడానికే వీళ్ళంతా వస్తారు. ఈ రూపకంలోని పదిహేను రంగాలు, కవి ప్రస్తావించినట్లు భావోత్కర్షతో మాత్రమే సంధానితమై ఐక్యతను పాటిస్తాయి. అంతేకాని ఒక రంగానికీ ఇంకొకరంగానికీ ప్రత్యేకించి సంబంధం ఉండదు. అనుబంధమూ ఉండదు. జీవితంలోని మంచిచెడ్డల ఆధిభౌతిక సమస్యనుగూర్చి లోతుగా పరిశీలనం చేయడమనే భావసూత్రము తప్ప ఈ రంగాలకు ఒకదానితో ఇంకొకదానికి సంబంధం లేదు. అయితే ఈ రంగాలన్నిటినీ ఒక చిత్రకళా

మందిరంలో ప్రదర్శితమైన చిత్రపరంపరవలె దర్శించవచ్చు. లేదా స్వీయ పర్యాప్తతగల ఒకే రూపకపరిధిలోని భావగీతికలవలె భావించవచ్చు. ఈ రూపకంలో అత్యంత ప్రధానమైన, కీలకమైన సన్నివేశ దృశ్యం – ద్రౌపదీ వస్త్రహరణం – రూపకపు తాత్త్విక ప్రశ్న తీవ్రంగా దూసుకొనివచ్చి తల యెత్తేట్లు చేసింది. ఇందులో అంతర్గర్భితంగా ఉన్న విచికిత్స ఏమంటే మంచి చెడ్డ చేతిలో ఎందుకు చిరకాలంగా, కలకాలంగా భంగపాటుపొందుతూనే ఉంది? అని. మహాభారతంనుంచి తీసుకొన్న ప్రఖ్యాత ఘట్టం ఇది. ఈ రూపకంలో ప్రధానంగా, విశదంగా చిత్రితమైంది. రంగస్థలంమీద విశ్వ గీతను ప్రదర్శించడం ఇంచుమించుగా అసంభవమే అయినప్పటికీ, ఈ రూప కాన్ని అధితాత్త్విక సమస్యను మళ్లీ ఇంకొకసారి నాటకీయంగా చిత్రీకరించే ప్రయత్నంగా భావించవచ్చు. నానాలాల్ ఇక్కడ ఈ సమస్యను విశ్వ దర్శనంగా ప్రవేశపెట్టాడు. కవి భావనాశక్తి సమృద్ధికీ, జీవితపు నైతిక విలువలపట్ల ఆయినకుగల ఆందోళనకు నిదర్శనంగా ఈ రూపక కల్పనను ఎంచవచ్చు

# 5

# ప్రేమ భక్తి

నానాలాల్ ప్రేమభక్తిని తన ఆదర్శంగా ఎంచుకున్నాడు. కొన్ని సమయాలలో తన గుప్తనామంగాకూడా చేసుకున్నాడు. నర్మద్ 'ప్రేమవీర్' అని తనను తాను సంభావించుకున్నాడు. ఇదే పోలికతో నానాలాల్ తనను 'ప్రేమభక్తి' గా వ్యవహరించుకొన్నట్లున్నది. నర్మద్ అంటే నానాలాల్‌కు చాలా అభిమానం. అందువల్ల నర్మద్ కవి పెట్టుకున్న గుప్తనామంతో ప్రభా వితుడై నానాలాల్ ఈ పేరు పెట్టుకొన్నట్లు కన్పిస్తుంది. ప్రేమ, భక్తి, విడి విడిగాను, సంయుక్తంగానూ కూడా నానాలాల్ కవితా రచనల్లో ప్రముఖ

స్థాన మాక్రమిస్తాయి. తన కవిత్వంలో వాటి నాయన ప్రధాన రసాలుగా విన్యసింపచేశాడు. నరసింహ మెహతా, మీరాబాయి కవితలలోని ప్రేమ పూర్వకభక్తిలో ప్రేమ భక్తి, సామాజిక, ఆధ్యాత్మిక స్థాయులతో ప్రేమ, భక్తిగా పర్యవసించడం చూడవచ్చు. సాంఘిక తత్త్వంగా ప్రేమ నాయన కవితలలో, పాటలతో, రాసలలో, నవలల్లో, నాటకాలలో వర్ణించాడు. భక్తిని ఆధ్యాత్మిక భావనగా తన పాటల సంపుటమైన ప్రేమ భక్తిభజనావళిలోనూ, అసంపూర్ణమైన 'హరిసంహిత' కావ్యంలోనూ ప్రదర్శించాడు. ఈ పాటల సంపుటి ఒకమోస్తరుగా పెద్ద గ్రంథమే. ఇందులోనివన్నీ భక్తి గీతాలు. 'హరిసంహిత' ప్రథమ భాగం ఆవిష్కరణోత్సవం జవహర్‌లాల్ నెహ్రూ 1959 నవంబర్ 28 న, అహమదాబాద్‌లో జరిపారు. ఈ విధమైన పాటలు ఆయన రూపకాలలోను, పద్యసంపుటాలలోను ఉన్నాయి.

నానాలాల్ తనకు పాడటంగాని ఆడటంగాని తెలియదని ప్రకటించుకొన్నప్పటికీ (గీతమంజరి, ఉపోద్ఘాతం) ఇంటి దగ్గర తంబూరా చేతపట్టుకొని భజన గీతాలు ఒక నియమంగా ఆయన పాడేవాడు. ఒకసారి యూరొపు, ఇంగ్లండ్‌ల పర్యటనకు బయలుదేరే సమయంలో ఆయన ఒక కొత్త తంబూరా చేయించుకున్నాడు. దానిని తప్పకుండా తనతో తీసుకొని పోవలసిందేనని పట్టుపట్టాడు. ఆయనకు చెప్పదగిన కంఠమాధుర్యం లేకపోయినా, కనపరచే శ్రద్ధ, తాదాత్మ్య భావాలవల్ల, నలుగురితో పాడినా, ఒంటరిగా పాడుకొన్నా ఆ పాటలు శ్రోతలను ప్రభావితం చేయగలిగేవి. రాజకోట్‌లో ప్రభుత్వాధికారిగా ఆయన నియమితులైనప్పుడుకూడా అందరి సమక్షంలో ఆయన ప్రేమానందుని 'మామేరు' గానం చేశాడు. తర్వాత ఇంకొక ఏడాదికి విశుద్ధహృదయంతో డాకోర్ వెళ్ళి అక్కడి దేవాలయంలో 'హరిసంహిత' లోని భాగాల నాయన గానం చేశాడు.

స్వామి నారాయణ మతశాఖా సంప్రదాయంలో, ఆ వాతావరణం మధ్య పెరిగి పెద్దవాడైనాడు నానాలాల్. ఈ శాఖను శ్రీ సహజానంద గుజరాతులో ప్రారంభించారు. ఈయననే శ్రీజీమహరాజ్ అనికూడా అంటారు. వీరి ప్రబోధ రచనలు, వేదాంతతత్త్వము, నానాలాల్‌ను ఎంతగానో ప్రభావితం చేసినవి. తల్లి అమృతబా నుంచి చిన్నప్పుడే ఆయన శ్రీ కృష్ణుని గురించిన పాటలు, కథలు ఎన్నో వింటూఉండేవాడు. యూని

వర్శిటీలో చదువుకునే రోజుల్లో, తర్కశాస్త్రమూ, నీతిశాస్త్రమూ అధ్యయనం చేస్తూనే నానాలాల్ మారినోను కూడా (ప్రైప్స్ ఆన్ ఎథికల్ థియరీ, స్టడీ ఆఫ్ రిలిజియన్, సెర్మన్స్) చదివాడు. ఇందువల్ల ఆయనపై ఒక గాఢముద్ర పడింది. ఆయన ఆలోచనలను ఈ పుస్తకాలు ఎంతగానో ప్రభావితం చేశాయి. అటుతరువాత ఆయనకు బ్రహ్మసమాజంపట్ల, ప్రార్థనాసమాజంపట్ల ఆసక్తి కలిగింది. అప్పుడప్పుడు వెళ్ళి ఆదివారాల్లో ఆయన ఆ సమాజాల్లో ప్రబోధ ప్రసంగాలు చేస్తుండేవారు. ఉపనిషత్తులను, భగవద్గీతను కూడా తరువాత ఆయన అధ్యయనం చేశాడు. గుజరాతీలోకి కొన్ని భాగాలాయన అనువాదం కూడా చేశాడు.

దీన్నిబట్టి మతంపట్ల సంకుచితమైన అభిమానం కాని, పాక్షికమైన శాఖాభిమానంకాని, అభినివేశం కాని ఉన్నట్లు అనుకోకూడదు. ఆయన దృక్పథం ఎప్పుడూ మూఢవిశ్వాసాలకూ, అతివాద ధోరణికీ అతీతంగానే ఉండేది. 'వైష్ణవీషోడశ గ్రంథ సారాంశ'మనే పుస్తకానికి ఉపోద్ఘాతంరాస్తూ 'మతవిషయాలలో నేను సమన్వయవాదిని' అని ఆయన అభివర్ణించు కున్నాడు. ఈ మత సామరస్య దృక్పథమే ఆయన అక్బర్ చరిత్రను నూతన దృష్టితో రూపకంగా మలచుకొనేట్లు చేసింది. మొదలు మహాకావ్య రచనకు ఏసుక్రీస్తు జీవితాన్ని ఇతివృత్తంగా ఎంచుకోవాలని ఆయన తల పోశాడు. కాని బాగా ఆలోచించినమీదట కురుక్షేత్రగాథను స్వీకరించాడు. ఒక విషయం మాత్రం చాలా స్పష్టంగా చూడవచ్చు. మతంగాని, వేదాంతం గాని మొదటినుంచీ శ్రీ కృష్ణుని పరంగానే ఆయన్ను అత్యంతమూ ఆకర్షించి నవి. ఆయన కవితల్లో, పాటల్లో, రాసరచనలలో, శ్రీకృష్ణదేవుని దర్శనం ప్రస్తావితమవుతూనే ఉంటుంది. కురుక్షేత్ర, ద్వారకా ప్రళయ, కావ్యాలలో శ్రీ కృష్ణుడే నాయకుడు. భక్తిరస కావ్యాలైన హరిదర్శన, వేణువిహారాలు కూడా శ్రీకృష్ణ నాయకములే.

ఈ విషయమై బహుసుందరమైన నానాలాల్ కీర్తన ఒకటి.

ఓ నాకళ్ళ పరమమైన సోమరితనం
హరిని ఒకింత సేపు కూడా చూడలేదు
ఒక్కవీక్షణం కూడా ఆయనపై బరపలేదు

ఆయన్ని క్షణకాలం దర్శించే ఆనందం కూడా
నా కన్నులకు లేదు

దుఃఖ, భ్రాంతుల తాపజ్వరంతో
నాకళ్ళు మండిపోతున్నాయి
అవి ప్రభు దర్శనానికి నోచలేదు
అవి ప్రభువు దెసకే అభిముఖం కాలేదు
భగవంతుని ఉనికి అంతటా ఉంది
సమస్తసృష్టినీ సంపూరణంగా నింపుతూ
అణుమాత్రం కూడా ఖాళీఉండదు
ఆయన ఉన్నాడు సమస్త చరాచరాల్లో
ఆయన ఆకాశంవలె
సమస్తమూ ఆవరించి ఉన్నాడు
నాచుట్టూ ఎల్లప్పుడూ
మహాప్రభువు ఉచ్ఛ్వాసనిశ్వాసాలవలె
నా అస్తిత్వంలోనే ఉన్నాడు ఎల్లప్పుడూ
కొంచెం కళ్ళు తెరిచి చూస్తేచాలు
అదుగో ఆయన ఉన్నాడు, ప్రత్యక్షంగా చూడటానికి
ముఖాముఖీ

బ్రహ్మమూ, బ్రహ్మాండమూ
(సృష్టీ, సృష్టికర్తా)
ఒక్కక్షణంకూడా ప్రత్యేకాస్తిత్వం కలవికావు
కాని ఐహికపు అజ్ఞానపుపొర ఆటంకపరుస్తుంది
ఆ విషయం ఏమో తెలియకుండా
శాశ్వతంగా జీవితంలో ఉబుకుతున్నదానిని
గుడ్లగూబ నూరేఁడ్లు జీవిస్తుంది
అయినా పగటి వెలుతురునుగూర్చి దానికేమీ తెలియదు
ప్రభువు సముద్రంవంటివాడు
కంటిచూపులో ఇమడడు
నాలుక అలసిపోతుంది ఆగిపోతుంది
'విరాట్, విరాట్' అని ఉచ్చరిస్తూ

ఓ ప్రభూ లోపలికన్ను ఎప్పుడు తెరుచుకుంటుంది
దట్టమైన చీకటి ఎప్పుడు తొలగిపోతుంది
ఓ ప్రభూ వేడుకుంటాను
నా కళ్ళనుంచి అజ్ఞానపుపొరలు తొలగించు
ఓ కన్నులారా, గుచ్చిగుచ్చిచూడండి
హరి ఎప్పుడూ అక్కడే ఉన్నాడు
మీ మాంద్యాన్ని పరిహరించండి
హరిపై మీదృష్టి చెదరకుండా నిలపండి
మనస్సు తృప్తిదీరా ఆయన్ను దర్శించండి.

(కొన్నిగీతాలు, 11)

భగవద్దర్శనంకోసం తీవ్రమైన ప్రతీక్షను వ్యక్తం చేస్తున్నదీ గీతం. (నానాలాల్ వాంఛించేది వేదాంతపరిభాష వ్యక్తంచేసే స్వరూపాన్నిగాదు, ఇష్టదైవాన్ని దర్శించాలని). కాని సమస్త శారీరక మానసికేంద్రియాల బహిర్ముఖవ్యాపారానికీ, బాహ్యవస్తుప్రీతికా ప్రాతినిధ్యం వహించే చర్మ చక్షువులు, భగవంతుని ఆవాసమైన అంతరంగాన్ని దర్శింపజేయగల అంత ర్ముఖత్వంపట్ల మిక్కిలి మాంద్యతను, అలసభావాన్నిమాత్రమే వహిస్తాయి. అంతర్ముఖితనుపూనితే ఎప్పుడెప్పుడు దర్శనం కలగజేస్తామా అని ఆయన నిరీక్షిస్తూ ఉంటాడు.

ఆనంద లోకాలోకనం కోసం గాఢమైన ఆత్మనిరీక్షణం ఇంకొక కీర్తనలో వ్యక్తమైంది. పడవ, పడవమనిషి, యాత్రికుడు మొదలైన ప్రతీకలతో రూపకాలంకారం ప్రతిపాదితమైంది. దీనిమొదటి చరణం మాత్రం ఒక సంప్రదాయ కీర్తన నుంచి తీసుకోవడం జరిగింది.

నేను పడవెక్కినది దాటాలి
సరంగూ తెడ్డువేసి పడవనడుపు
నేను అవలిదరికి చేరాలి
ఆ కుడి ఒడ్డున మథురానగరం ఉంది
ఎడమ ఒడ్డున గోకులంపల్లె ఉంది
ఈ తీరాన నాదేహం ఉంది
అక్కడావైపున ఉన్నది నా ఆత్మ

ఆకాశసముద్రం నిండా నీరుంది
అందులోనే సూర్యచంద్రులున్నారు
ఈ తీరాన మెరక భూమి ఉంది
అక్కడ అవతలివైపున ఆనందలోకం ఉంది
జీవితపుతరంగాలను నెమ్మదిగా నెట్టుకుంటూపో
ప్రపంచపు గాలులతాకిడికి గురి అవుతూ
ఈ తీరాన నా ఆశలపొదరిల్లు ఉన్నది
అక్కడ ఆవలివైపున ప్రేమాలయం ఉంది
సరంగూ తెడ్లువేసి, పడవ నడుపు
నేను ఆవలిదరికి పోవాలి – (జహంగీర్ నూర్జహాన్)

ఇంకొక కీర్తనలో ప్రభుదర్శనంకోసం నిరీక్షించి మగతతో సోలిపోతున్న కండ్లు, ఆనందలోకంకోసం ఎదురుచూస్తున్న ఆత్మ, అరుదైన దివ్యదర్శనాన్ని అనుభవిస్తాయి.

రండి రండి సాహసవంతులారా రండి
మీ చూపులను అనంతంగా పారించండి
పర్వతాగ్రంపై నేను ఒంటరిగా నిలచాను
విశాల ప్రపంచపు విరివిని కనిపెట్టి చూస్తూ
సముద్రపు సుదూరతీరాన్ని అరణ్యాలను
దిక్చక్రరేఖ కావల కనుమరగైపోతున్న ఓడలను
ఆకసపు నడవలో నేను ఒంటరిగా నిలిచిఉన్నాను
నక్షత్రసార్థవాహాన్ని గమనించి చూస్తూ
కాంతికందుకాలు ఆకాశంతో గిర్రున తిరుగుతున్నాయి
నర్తిస్తున్న ప్రభువును చూశాను నేను
అంతరంగంలోని నడవలో నేను ఒంటిగా నిలిచాను
అగాధమైన విశ్వహృదయాన్ని చూస్తూ
లోపల కాంతిస్ఫోటనం
ఖాళీగాఉన్న విశ్వప్రపంచాన్ని చూశాను
తరవాత పూర్తిగా ప్రభువుతో నిండిపోయింది.

(జగత్ప్రేరణ)

పరిపూర్ణ కవితాభావుకతాశక్తితోను, ఉదాత్త దర్శనంతోను, నానాలాల్ అత్యంత ప్రతిభాపూర్ణంగా అద్వితీయంగా రచించిన గీతం 'విరాట్‌నొహిందోలా' - విరాట్‌డోల - లేదా విశ్వడోల అనేది. నరసింహ మెహతా రచించిన అత్యుదాత్త భక్తిగీతాలతో పోల్చదగిన గీతం ఇది.

ఔజ్జ్వల్యంతో మిరుమిట్లు గొలుపుతూ
ఉంది విరాట్ విశ్వడోల
ఊయలతాళ్ళు ఆకాశపుకొప్పులో కొక్కేలకు బంధించారు
పుణ్యపాపాలు తాళ్ళు
మూడులోకాలు డోల
ఉయ్యాల ప్రతిఊపూ
సృష్ట్యాదీ, అంతమూ
ఔజ్జ్వల్యంతో మిరుమిట్లు గొల్పుతూ
ఉంది విరాట్ విశ్వడోల. (విశ్వగీత)

నానాలాల్ జీవితంలోనూ సాహిత్యంలోనూ ఎటువంటి ద్వంద్వ ప్రవృత్తీ లేదు. ఆయన ప్రకటించినట్టు సాహిత్యంలో ఉన్నత నైతిక ప్రయోజనం వాంఛించాడాయన. ఇది తండ్రిగారినుంచి వారసత్వంగా ఆయనకు సంక్రమించింది. తర్వాత ఉపనిషత్తులు, పురాణాలు, భగవద్గీతల అధ్యయనంతోను, మిల్టన్, టెన్నిసన్, మార్టినోలను బాగాచదవడంతోనూ, ఆయనలో ఈ దృష్టి బాగా బలపడింది. జీవితంలో ఆయన ఆస్తికుడు. భగవంతుని నమ్ముకొన్నవాడు. మానవునిలో మౌలికమైన మంచితనంపట్ల, నైతికజీవనంపట్ల విశ్వాసంగలవాడు. ఆయన చాలా పరిశుద్ధతావాది. పవిత్ర గంభీర జీవనలక్ష్యంగలవాడు. అయినా జీవితంలోని సంతోషాన్నీ, అహ్లాదాన్నీ, కాదన్నవాడు కాడు. వాస్తవానికి ఆయన కవిత్వం, రూపకాలు, కీర్తనలు, రాసలు, ఉల్లాసస్ఫూర్తి సంభరితంగానే ఉంటాయి. భగవంతుని పట్ల ఆయన భక్తి కర్మకాండసంబంధీ, మతాచారవిషయికమూ అయినది కాక, ఆధ్యాత్మిక స్థాయికిచెందినది. నానాలాల్‌కు (ఆయన ఇల్లాలు మానిక్‌బాకుకూడా) కొన్ని ఆధ్యాత్మికానుభూతులుకలిగినట్లు చెబుతారు. ఈ మహిమోపేతములైన దివ్యదర్శనాలను గూర్చి మొదటి వచనంలోనూ, అటు తరువాత కవితలోనూ ఆయన 1941-42 సంవత్సరాలలో తన హరిదర్శన, వేణువిహార్‌లలో వర్ణించాడు.

భగవంతుని అవతారాలన్నిటిలోనూ నానాలాల్ శ్రీకృష్ణుని దివ్యావతారంపట్ల మిక్కిలి ఆకృష్టుడైనాడు. శ్రీకృష్ణుడంటే ఆయనకు పారవశ్యంతో కూడిన మోహం. ఆయన చాలా కవితలలో, కీర్తనలలో, రాసలలో, రూపకాలలో, ఏదో ఒక సందర్భంగా శ్రీకృష్ణుడు కనపడటమేకాక, కురుక్షేత్రంలో ప్రతి ఆశ్వాసంలోకూడా ఆయన ఉన్నాడు. ద్వారకాప్రళయలోకూడా ఆయన కేంద్రస్థితుడే. నలభైసంవత్సరాలకుమించి నానాలాల్ శ్రీకృష్ణధ్యానంలో గడిపాడు. 1935 వ సంవత్సరంలో వరసాగా మూడురోజులు ఉదయం ప్రత్యక్షంగా శ్రీకృష్ణుని దివ్యోజ్జ్వల దర్శనం నానాలాల్‌కు లభించినట్లుగా చెపుతారు. ఇది ఆయనకు వ్యక్తిగతంగా లభించిన ఆధ్యాత్మికసంపద. హరి దర్శన్‌లోనూ, వేణువిహార్‌లోనూ దీనినాయన కవిత్వపరంగా సాధించాడు. కవిగారి ఇంటి ఆవరణను దాటి, ఇంట్లో ప్రవేశించి, వేణువు నూది, చిరునవ్వు నవ్వి, కవిగారికళ్ళలోకి చూసి, ఆయన కానందపారవశ్యం కలిగించి అంతర్ధానం చెందాడు కృష్ణుడ.

అపరిమేయపుద్వారాలు తెరచుకున్నాయి
హరి వెళ్ళిపోయినాడు – హృదయంలోకి లేదా
విశ్వాంతరాళంలోకి ?

యాత్రికుడు ఇక నిలుచున్నాడు
ప్రభువు పాదముద్రలు వెతికేందుకు (వేణువిహార్)

ఇంకా కొద్దిరోజులకాయన చనిపోతారనగా నానాలాల్‌కు శ్రీకృష్ణుడు బయట నిలబడిఉన్నట్లు కనిపించాడని చెపుతారు. కవి తన చివరిపాట నోట్లో అస్పష్టంగా పాడుకొన్నాడుట. 'అజ్ మొరెఘర్‌స యొశనయ్యో' అని (ఇవాళ శ్రీకృష్ణుడు మా ఇంటికి వచ్చాడు). కవిగారప్పుడు తన ఇల్లాలిని పిలిచి చెప్పారు. 'బాయ్, అతడు వచ్చాడు. కాని ఇంట్లోకి రమ్మంటే రాలేదు. ఇంట్లోకి రమ్మని పిలువు. చూడబోతే నన్ను పిలుచుకొనిపోవటానికే వచ్చినట్లున్నది. సరే బాగుంది. అయితే నేను వెళతాను. జై శ్రీహరి''.

(ఎన్. శాస్త్రి: కిషోర్, ఫిబ్రవరి 1946)*

* ఈ విషయం నాకు తెలియజేసినందుకు ప్రొ కానుభాయ్‌జని, శ్రీ బచుభాయ్‌రావత్‌లగారికి నేనెంతో కృతజ్ఞుణ్ణి.

నానాలాల్‌కు కేవలం ఆత్మాశ్రయంగా, గాఢంగా కలిగినవంటున్న ఆధ్యాత్మికానుభూతులను రుజువుపరచి నమ్మడంగాని, రుజువుచేయలేక నమ్మలేక పోవడంగాని, సాధ్యపడదు. నానాలాల్ జీవిత చరిత్రకారుడికి ఈ విషయాలు చాలా విశిష్టమైనవి, విలువైనవి కావచ్చు. నానాలాల్ కవిత్వానికి సంబంధించినంతవరకు కవికి కవితావాహిక అయిన సంఘటనలయినందువల్ల ప్రత్యక్షంగా స్పష్టమైన దర్శనాన్ని ప్రసాదించినవి.

ఇంగ్లీషులో తాత్త్వికకవి విలియంబ్లేక్ రచించిన అనుభూతిగీతాలు (సాంగ్స్ ఆఫ్ ఎక్స్పీరియెన్స్) వంటి గూఢకవిత్వం విషయంలో నానాలాల్ కవిత్వానికి పోలిక వర్తిస్తుంది. కవిగారు మరణించేనాటికి హరి సంహిత కావ్యం పూర్తి కాలేదు. భాగవతపురాణంవలెనే 44,000 పంక్తులలో శ్రీకృష్ణుని పుణ్యక్షేత్రాటనను, ఆయన నూరవసంవత్సరంనుంచి నూట పదహారవ సంవత్సరంవరకు చేసిన యాత్రలను పూర్తిగా వర్ణించాలని నానాలాల్ వాంఛించాడు. కాని 27,000 పంక్తులు మాత్రమే ఆయన పూర్తి చేయగలిగాడు తరువాత ఈ గ్రంథం ద్వాదశమండలాలుగా నానాలాల్ స్మారకసమితివారు ప్రచురించడం జ-గింది. స్వీయమైన ఆధాత్మికానుభూతికి చెందిన భక్తిగీతాలనేకాక, ఇంకా భక్తిరసభరితములైన కీర్తనలు, భావ గీతాలు, రాసలు నానాలాల్ రచించారు. మొదట ఇవి ఆయన దీర్ఘకావ్యాలలో, రూపకాలలో, ఇంకా వచనరచనలలో చేరిఉండేవి. తరువాత వీటిని ప్రత్యేక సంపుటాలుగా రూపొందించడం జరిగింది. కీర్తన రచయితగా ఆయనను స్థిరంగా నిలబడగలగటానికి ఇవి చాలు.

ఇతివృత్తం లౌకికమైనదైనా మతవిషయికమైనదైనా, వస్తువు ప్రేమ లేదా భక్తికి సంబంధించినదైనా, లేక ఈ రెండింటి సమ్మిశ్రితమైనా ఆయన రచనలకు ఇది వర్తిస్తుంది. ఈ రచనలలో కూడా చాలావాటిలో శ్రీకృష్ణుని పట్ల కవికిగల గాఢానురక్తి, శ్రీకృష్ణుని సమ్మోహకవేణువూ ప్రత్యక్షమవుతాయి. నిజానికి నానాలాల్ జీవితకాలపర్యంత ప్రేమభక్తి ఈ విధంగా వివిధమైన మధురగీతికాకృతులుగా, మార్గాలుగా రూపుగొన్నది.

# 6

## ముగింపు

1898వ సంవత్సరంలో ఆయన వ్రాసి ప్రచురించిన దీర్ఘకథాకావ్యం వసంతోత్సవతో ఉజ్జ్వలమైన ఆయన కవితా జీవితాధ్యాయం ప్రారంభమైంది. 'కెట్‌లంక్‌కావ్యో' (కొన్ని కవితలు, ప్రథమభాగం) 1903లో వెలువడి అంతకు పూర్వం వెలువరించిన కావ్యంవలెనే ఆదరాన్ని బాగా పొందిన ప్పటికీ నవ్యత అంటే చాలు దేనినైనా నిరోధించే లేదా విధిలేక స్వీకరించే కఠోర చ్ఛాందసులు హర్షించలేక పోయినారు. వాళ్ళు వెంటనే 'అవును కొన్ని మాత్రం కవితలే' అంటూ ఛలగర్భితంగా వ్యాఖ్యానించారు. నానాలాల్ కొత్తగా ఛందాన్ని సృష్టించడమే వాళ్ళ వ్యతిరేకతా, నిరోధమూ కూడా. ఆయన డోలన్‌శైలి అనే లయాత్మకమైన శైలిని సృష్టించడం వాళ్ళకిష్టం లేదు. అనూచానంగా వస్తున్న క్రమచ్ఛందాన్ని ఆయన పాటించక పోవడాన్ని వాళ్ళు అంగీకరించలేదు. 'ఇరవైరెండువందల సంవత్సరాల నుంచి సాగుతున్న ఛందో నిరంకుశత్వాన్ని నిరాకరించి' తన కవితకు నానాలాల్ పరిపూర్ణమైన, బంధరహితమైన స్వేచ్ఛను కల్పించే శైలిని రూపొందించుకొని దానిని తీర్చిదిద్దటం వారికేమాత్రమూ సమ్మతం కాక పోయింది.

తాను ఎంతో అభినివేశంతో రూపొందించి ప్రచారంలోకి తెచ్చిన ఈ నవకవిత ఆశించినంతగా ప్రచారంలోకి రాకపోవడం ఆయన గమనించాడు. ఈ విషయాన్ని ఆయన అంగీకరించాడు కూడా. నర్మద్, దలపత్‌రామ్‌ల కవితవలె ఈ కవిత ప్రాచుర్యం పొందలేదని ఆయన అనుకొన్నాడు. 1908లో తన రెండో కవితాసంపుటికి ఉపోద్ఘాతం వ్రాస్తూ అది బాగా ఆదరణ పొందడానికి పాటించవలసిన నియమాల నాయన నిర్దేశించాడు. ''మా కవిత్వం విశ్వజనీనదృష్టితో కాకుండా కేవలం ఆత్మాశ్రయవ్యక్తీకరణం మాత్రమే అయినందువల్ల సాంఘిక వ్యవస్థాసమస్యలనే ఎక్కువగా ప్రతి

బింబిస్తున్నది. గుజరాతులో, భారతదేశంలో ఇంకా ప్రపంచంలోనే ప్రజల ఆశలను, ఆశయాలను పునరుజ్జీవన స్ఫూర్తిని ప్రతిబింబింపచేయడంతోనూ, విశ్వస్థాయిగల ఉత్తమకవిత్వ శ్రేణిలో చేరే అత్యుత్తమమైన కవితలనే మా కవులు వ్రాయడానికి పూనుకోవడంతోనూ, ఉల్లాసకరమూ, ఉత్తేజభరితమూ అయిన గీతాలలో జీవితపు ఉన్నతప్రయోజనాలను గానం చేయడంవల్లనూ, ప్రవక్తలవలె సందేశాన్ని వినిపించగలగడంవల్లనూ, ఈ నవకవితను ప్రజలు మరింతగా ముందు ముందు ఆదరిస్తూ స్వాగతం పల్కుతారన్నదే నా విశ్వాసం.''

కవిత్వం విశిష్టంగా ప్రచారం పొందడానికి నానాలాల్ నిర్దేశించిన నియమ నిబంధనలుగా మాత్రమేకాక ఇవన్నీ ఆయన కవితాదర్శసూత్రాలుగా మనం గ్రహించవచ్చు. కవిత్వాన్నిగూర్చి కవినిగూర్చి ఆయన భావించే ఉన్నతాదర్శాన్ని ఈ అభిప్రాయాలు వ్యక్తం చేస్తున్నవి. ఈ ఆదర్శాన్ని తన సుదీర్ఘకవితా జీవితయాత్రలో చిట్టచివరిరోజువరకూ నానాలాల్ పాటించడం జరిగింది. గుజరాతీభాషలోనే వ్రాసినా ప్రపంచపు ఉత్తమకవిత్వరాశిలో చేర్చదగిన కవిత నాయన సృష్టించాడు. ప్రాంతీయమైన అభిరుచులను మాత్రమే సంతృప్తిపరచడం ఆయన దృష్టి కాదు. విశ్వజనీనమైన ఉన్నత ప్రమాణాలకోసమే ఆయన దృష్టి సారించాడు. 'అల్పలక్ష్యమే నేరం. అధిక లక్ష్యాన్ని అందుకోకపోవడం కాదు' అనే సూక్తిదృష్ట్యా చూస్తే నానాలాల్ తన ఆశయాలను పూర్తిగా సాధించాడా లేడా అన్నదికాదు ప్రధానం. ఆయన కవితాదర్శం మాత్రం అల్పమైనది కాదు. అత్యున్నతాదర్శంపైనే ఆయన దృష్టినిలిపాడు. విశ్వజనీనస్థాయి నాశించడంతో తన కవితలో అంతర్జాతీయదృక్పథాన్నే ఆయన అవలంబించాడు. ఆయన ఆశించిన అంతర్జాతీయమైన గుర్తింపు రావలసిననాడు ఆయనకు రావచ్చు. అదికాదు ప్రధానం. తన దేశంలో ఇదివరలో ఆయా కాలాలలోని మహాకవులు జ్యోతిష్పథంలో ఆయన స్థానం స్థిరంగానూ, చిరంగానూ ఉంటుందని చెప్పవచ్చు.

'అర్ధశతాబ్దిగా కవిత్వాన్ని ఆరాధిస్తూ గడిపిన తర్వాత కూడా ఎవరైనా వచ్చినా ఆదర్శాలను గూర్చి ప్రశ్నిస్తే? అని జన్మదినోత్సవ సందర్భంగా తన సన్మాన సభలో ప్రస్తావించి నానాలాల్ తనకు తానే సమాధానం చెప్పుకున్నాడు. 'నా లక్ష్యాలు రెండున్నాయి. ఒకటి పునరుజ్జీవన

సందేశాన్ని అందించడమూ. రెండు కవిత్వంలో విశ్వస్థాయినందుకోవడమూ' అన్నాడాయన. 1893 వ సంవత్సరంలో ఆధునిక గుజరాతీ కవితారంగం మీద వాసంత సందేశం అందిచడానికే తన వసంతోత్సవ కావ్యంతో తొలి సారిగా నానాలాల్ అడుగు పెట్టాడు. నానాలాల్ భావనలో వసంతమంటే కేవలం మధుమాస'శోభమాత్రమే కాదు పునరుజ్జీవనానికి పర్యాయపదం షెల్లీ కవి ఆత్మీయతాముద్రతో ఆయన ఈ భావనకు ఎక్కువ పోలిక వుంది. మానవాళికీ, ప్రపంచానికీ చైతన్య పునరుజ్జీవన ప్రతీకగా నానాలాల్ భావన షెల్లీభావనతో సన్నిహితమైన పోలికతో సంవదిస్తుంది వసంతం సౌంద ర్యానికి, సంతోషానికి, నిరంతరమైన ఆశకు సంకేతం. 'హేమంతం ఆగ మిస్తే, వసంతం మాత్రం సమీపవర్తి కాదా!' వజవజలాడించే కరుడుగట్టు కొని పోయేలా చేసే అతి దుర్భర హేమంతం గడిచిపోయి వసంతం ఆగమిం చిందని నానాలాల్ మధుమాసశోభను తనతోటివారిని దర్శింపచేశాడు. ముందు నడిచి వసంతోత్సవం జరుపుకుందాం రమ్మని అందరినీ ఆహ్వానిం చాడు.

స్వయంగా నడుం కట్టి సంఘసంస్కరణ కార్యక్రమంలో పాల్గొనడం కూడా కవి బాధ్యతలలో ఒకటి అని ఆయన అంగీకరించినా, తన పూర్వ కవులలో కొందరివలె చురుకుగా ఈ విషయాలలో ఆయన పాల్గోలేదు. ఈ విషయమై తన అభిప్రాయాలు తన పద్య గద్య రచనల ద్వారా ముఖ్యంగా 'సంసారమంథన్' వంటి రచనల ద్వారా వెల్లడించడంతో ఆయన తృప్తి పొందాడు. కులకట్టుబాట్లు, వివక్షతలు, బాల్య వివాహాలు, వితంతువుల దుర్భర జీవితం, ఆనాటి సంఘ సంస్కరణలోని తీవ్ర సమస్యలు. నానా లాల్ వీటన్నిటినీ కలిసికట్టుగా ఒకే ఊపున పరిష్కరించే సూచన చేశాడు. బాగా ప్రాజ్ఞత తెలిసే ఇరవై, ఇరవైఅయిదు సంవత్సరాల వయసువరకూ యువతీ యువకులు వివాహం చేసుకోకుండా ఉండటానికి నిశ్చయించు కుంటే, తల్లిదండ్రులే సంబంధం నిర్ణయాలుచేసే పరిస్థితి తొలగిపోతే అధిక సంఖ్యలో ప్రేమ వివాహాలు జరుగుతాయి అన్నది ఆయన అభిప్రాయం. సామాజికవేత్తలుగనుక ప్రేమించి పెండ్లి చేసుకోవడాన్ని ప్రోత్సహించక పోతే, పెద్దలు కుదిర్చిన వివాహం కృత్రిమవృక్షం వంటిదయి నిస్సత్తువ లైన శిశువులనే ఇస్తుంది. ఎలా అంటే కృత్రిమ పుష్పాలు సుగంధాన్ని విర జిమ్మలేనట్లు' అని ఆయన హెచ్చరించాడు. ఆయన సాంఘిక రూపకా లన్నిటా పునరావృతమయ్యే ఇతివృత్తం ప్రేమ వివాహం. ఆయన వ్రాసిన

ఇటువంటి రూపకాలు కనీసం దీనికి అనుకూలమైన సాంఘిక వాతావర ణాన్ని సృష్టించడంలోనైనా కృతకృత్యత సాధించాయని చెప్పవచ్చు. ప్రధానంగా నానాలాల్ సామాజికవేత్తకాని సంఘ సంస్కర్త కాదు. ఆయన బ్రాహ్మణుడుగానే పుట్టినా సౌరాష్ట్రలోని ధాసా లో 1918 లో మొట్ట మొదటిసారిగా జరిగిన, అప్పటివరకూ అస్పృశ్యులుగా పరిగణితులవుతున్న హరిజన మహాసభకు అధ్యక్షత వహించడం గమనించదగిన విశేషం. గుజరాత్‌లో అప్పటికి ఈ విషయంలో తీవ్ర ప్రయత్నమింకా ప్రారంభం కూడా కాలేదు. గుజరాత్‌లో అందరికన్నా ముందుగా యువజనోద్యమాన్ని కూడా ప్రారంభించి అహమదాబాద్‌లో విద్యార్థి సంఘాన్ని నానాలాల్ నెలకొల్పడం జరిగింది.

ఒక సందర్భంలో ఆయనొక ఉపాధ్యాయుడితో మాట్లాడుతూ ఉండగా మాధ్యమిక విద్యా పద్ధతులు మెరుగుపరచడంలో తీసుకోవలసిన మెలకువలేమిటని ఆయన నానాలాల్‌ను ప్రశ్నించాడు. నాటకీయ ఫక్కీలో వెంటనే నానాలాల్ తన చొక్కా చేతులు బాగా పైకి మడిచి తన కండలు పట్టి చూడవలసిందిగా ఆ ఉపాధ్యాయుణ్ణి కోరి 'తరుణ విద్యార్థుల విషయంలో మీరు మొదట చేయవలసింది ఇది' అన్నాడు. అంటే నానాలాల్ అభిప్రాయంలో మాధ్యమిక విద్యార్జనస్థాయిలో దేహ సౌష్ఠవం పెంపొందించటం, చాలా ముఖ్యమన్నమాట.

పునరుజ్జీవన మనగానే ఆయన భావనాపరిధికి సంబంధించినంత మటుకు ప్రజల భౌతిక, మానసిక, నైతిక, ఆధ్యాత్మిక, మనోవైజ్ఞానిక, పునరావాసమూ, పునరుజ్జీవనమూ కూడా చేరుతాయి. పునరుజ్జీవనపు మూర్తిమంతమైన, నానావర్ణ సమ్మిశ్రిత, సజీవ సంకేతమే వసంతం కాబట్టి ముఖ్యంగా నానాలాల్ దాని సౌందర్యాన్ని గానం చేయడంలో అలుపు సొలుపులు పాటించలేదు. సబర్మతి సమీపాన ఒక మధుమాస శోభాప్రకృతి మధ్య ఇంకొక కవిమిత్రుడితో (ఆర్. వి. పఠక్) ఆయన పచార్లు చేస్తుండగా అప్రయత్నంగా హఠాత్తుగా నానాలాల్ ఇట్లా అన్నాడు. 'ఇక్కడ మధుమాస శోభ చూడు.' అని ఒక్కక్షణం ఆగి ఇంకా ఇలా అన్నాడు. 'నేను వసంతశోభను అతిశయసుందరంగా వర్ణిస్తానని కొందరనుకోవడం నేను విన్నాను. నిజమే కావచ్చు. నేను అతిశయితంగానే వర్ణించవచ్చు.

కవులు ఒక్కొక్కప్పుడు అట్లా చేయాల్సిరావడంలో వింత లేదు. అయితే నేను వ్రాసేది మాత్రం యథార్థంగా చూసింది మాత్రమే వ్రాస్తాను.' ఆయన ప్రకృతిని చాలా సూక్ష్మేక్షికతో పరిశీలిస్తారు. ముఖ్యంగా గుజరాత్ ప్రకృతి సౌందర్యాన్ని ఆయన బాగా పరిశీలించారు. చిత్రవర్ణసుందరంగా, సంగీత సుభగంగా పరమ శోభాయమానంగా వర్ణించారు. ఈ విధంగా ఆయన ముందుకాని, తరవాతకాని ప్రకృతి సౌందర్యాన్ని వర్ణించగలిగిన కవులు ఎందరో లేరు. ముఖ్యంగా నెమలి, కోయిల, నానాలాల్ కొన్ని కీర్తనలలో కొత్త కాల్పనిక సౌందర్యస్థాయి నందుకొన్నవి.

భారతదేశపు కవితగా, చరిత్రగా జీవించడమే తన ఆదర్శమన్నాడు నానాలాల్. ఆయన తన కవితలలోను, వచనరచనల్లోనూ భారతీయ చరిత్ర, వేదాంతం, అద్భుత పురాగాథలు, పురాణాలు, ఇతిహాసాలు, అన్నీ ప్రదర్శించాడు. సజీవమూర్తులుగా ఆయన చిత్రించిన నాయికానాయకులలో ఉన్నతాదర్శాలు వ్యక్తమవుతూ ఉంటాయి. వెలుగును, వెన్నెలను సంతోషాన్నీ ప్రసరణం చేస్తూ సాగుతారు వాళ్ళు. గుజరాతీ జానపద గీతాల సమ్మోహక శక్తిని ఆయన తన రచనల్లో తిరిగీ ప్రవేశపెట్టాడు. పాశ్చాత్య పద్ధతులలోనే తాను విద్యార్జనం చేశానని ఆయనే చెప్పుకున్నాడు. అందు వల్లనే పాశ్చాత్య చింతన, సంస్కృతుల మేలిగుణాల నాయన చాలా అభిమానించాడు. అయితే ఇందువల్ల భారతీయత ఆయన కారాధ్యం కాకుండా పోలేదు. ప్రాచీన భారతీయ సంస్కృతి, అందులో నిక్షిప్తమై ఉన్న జీవితపు విలువలు ఆయన ప్రచారం చేశాడు. నానాలాల్ సంలీనతాయుగానికి చెందినవాడు. నానాలాల్ రచనలూ, వ్యక్తిత్వమూ కూడా విచక్షణాయుతమైన సంలీనతా దృక్పథానికి మంచి నిదర్శనాలుగా కనపడతాయి. ఆయనకు మిల్టన్, షెల్లీ, బర్క్, టెన్నిసన్, మార్టినోల పట్ల ఘనమైన గౌరవం వుంది. వీళ్ళంతా అయన నేదోవిధంగా ప్రభావితం చేశారు. అయితే నానాలాల్‌కు ప్రాచీన మధ్య కాలాలకు చెందిన ద్రష్టలు, కవులు అన్నా అపరిమితమైన గౌరవం ఉంది.

విశాల దృష్టితో ఆయన తన మనః కవాటాలు తెరచే ఉంచుకొన్నాడు. ప్రాచ్య పాశ్చాత్య సంప్రదాయాల మేలిమి ఆయనకు కవితల్లో, రూపకాలలో సంలీనం చెందాయి. ఆయనే స్వయంగా చెప్పుకున్నాడు. మార్టినో

తత్త్వ దర్శనమూ, టెన్నిసన్ కవీశ్వరుడు 'ది ప్రిసెస్' లో వ్యక్తీకరించిన భావాలూ తనను చాలా ప్రభావితం చేశాయని. ఇక్కడ ముఖ్యంగా గమనించవలసిన అంశం ఏమంటే ఆయనను ఆకర్షించిన భావాలన్నీ భారతీయ సంస్కతి, జీవిత తత్త్వపు విలువలతో సమరసభావంతో సంపూర్ణంగా ఏకీభవిస్తూ ఉండడం. ఈవిధమైన సంలీనతా దృక్పథమనేది ఒక్క నానాలాల్ లోనే కాదు, ఈ విశిష్ట లక్షణం భారతదేశపు పునరుజ్జీవనయుగపు ఉత్తరార్థంలోని విలక్షణంగా భావించవచ్చు. భారతీయ పునరుజ్జీవనోద్యమం పురోగమనం బాగా సాగించిన కొద్దీ, అది బాహ్య ప్రేరణలవల్ల, ఉత్తేజనలవల్లా కాక, పురా భారతీయాత్మపునరుద్ధారకమూ, పునఃప్రతిష్ఠాపకంగానూ, ప్రభావితమై సాగింది. సర్ విలియంజోన్స్. రైశర్, గోథె, మాక్సుముల్లర్, మొదలైన మహనీయులు భారతీయ సంస్కృతి వారసత్వాన్ని మెచ్చి పాశ్చాత్యదేశాలకు వివరించడం సాగించారు. భారతీయులు కూడా అవినాశియైన తమ వారసత్వపు వైభవాన్ని తెలుసుకోగలందులకు ఆ మహనీయులు తోడ్పడ్డారు. భారతీయులలో ఒక ఆత్మవిశ్వాసాన్ని ప్రోది చేశారు. ఒకప్పుడు అన్ని విధాల మహోన్నత దశ ననుభవించిన భారతీయపురాసంస్కృతి వైభవము, విజ్ఞానము, తిరిగీ నెలకొల్పుకోగలమన్న భావాన్ని భారతీయులలో ఉద్బుద్ధం చేశారు. పాశ్చాత్య దేశాలనుంచి దేనినైతే గొప్పగా భావించి స్వీకరించడానికి భారతీయులు ఉవ్విళ్ళూరుతున్నారో, అది నిజంగా ఒకప్పుడు తమ సంస్కృతిలోని, తమ అస్తిత్వంలోని భాగంగానే ఉండేదనీ, తాత్కాలికంగా ఆ భాగం తమ దేహంలో చచ్చుబడి పనిచేయని దుస్థితికి చేరిందనీ భారతీయులు గుర్తించగలిగారు. (ఆధునిక భారతీయ భాషా సాహిత్యాలు: వి. కె. గోకాక్).

తన తండ్రి దలపత్‌రామ్‌నుంచి తనకు సంక్రమించిన వారసత్వాన్ని గురించి నానాలాల్ ప్రస్తావించే ఉన్నాడు. దీనికి సహాయంగా నానాలాల్‌కు స్వామి నారాయణ మత సంప్రదాయానికి చెందిన నైతిక తత్త్వ చింతన గూడా బాగా తోడ్పడింది. "నాకలవడిన విశాలమైన వైష్ణవ దృక్పథం భక్తిమార్గం, పరిశుద్ధతావాదం. నైతికాదర్శవాదం మా తండ్రిగారి వారసత్వంగానే నాకు లభించాయి. తరువాత స్వామి నారాయణ మతసంప్రదాయానికి చెందిన తత్త్వచింతన నన్నెంతగానో ప్రభావితం చేసింది." అన్నాడు నానాలాల్. కళాశాల విద్యాభ్యాసస్థాయిలో పాశ్చాత్య తత్త్వ

శాస్త్రం ఆయన అభిమాన విషయం. అంతేకాకుండా మరణ పర్యంతం ఆయన ఉపనిషత్తులు, మహాభారతం, రామాయణం, భాగవతపురాణం, భగవద్గీతలపట్ల భక్త్యారాధనభావం ఉండేది. వీటినాయన ఎప్పుడూ పరిస్తూనే ఉండేవారు. పాశ్చాత్య ప్రభావమూ, భారతీయ దృక్పథమూ ఆయన వ్యక్తిత్వాన్ని రూపొందించాయి. ఆయన కోరిన జీవితపు విలువలు, అదర్శ నైతికతత్త్వమూ ఒక సంప్రదాయ స్థాయినే నిరూపించగలవు. కవితలలోను, రూపకాలలోను, కాల్పనిక ధోరణి, ఊహాభావ విహారశీలత ఆయన విలక్షణాలు.

జీవితాన్ని గూర్చి సునిర్దిష్టమైన, నిర్వచనబద్ధమైన తాత్త్విక దృక్పథం ఆయనకున్నప్పటికీ నానాలాల్ వేదాంతి కాడు. అసలా దృష్టితో ఆయన్ను పరిశీలించేందుకు అవకాశం లేదు. ఇంతేకాదు. ఆయన ఆలోచనపరుడనికాని, మేధావి అనికాని, మౌలికమైన సిద్ధాంతపు ప్రతిపాదనచేశాడనిగాని చెప్పడానికి వీలుపడదు. కవితాభావాలు కవితాసుందరంగా ప్రతిపాదించడమే ఆయనలో అంతర్లీనంగా ఉన్న ప్రతిభ. అన్నిటా అయన కవి. ప్రేమ అంటే బాగా అరిగిపోయిన అర్థంలోకాదు, ప్రేమ వివాహమంటే, అది ఇప్పుడు వ్యవహృతమయ్యే తేలిక అర్థంలోకాదు, ఆయన కావ్యాల్లో ఈ రెంటినీ ఇతివృత్తాలుగా చేసుకున్నాడు. స్త్రీ పురుషుల మధ్య పరస్పర మర్యాద, స్నేహ సౌహార్దాలు, సమానత్వ దృష్టి, ఉన్నతమైన సామాజిక లేదా మానవీయ దర్శనం, సత్యం, సౌందర్యం వీటిని పాలించడంలో శ్రద్ధాసక్తులు, సుందరతర ప్రపంచదర్శనం, నానాలాల్ రచనలలో పునరావృత మవుతూనే ఉంటాయి. ఆయన వచన రచనల్లోనూ, కవితా రచనల్లోనూ ఇదే ఇతివృత్తాలు.

ఒక ఇంగ్లీషు కవి ప్రవచించినట్లు (ఆర్థర్ వొష్‌విగ్ నెసే) "కవులు స్వాప్నికులు. సంగీతాన్ని సృష్టించారు. వాళ్ళు కనే కలలు, సృష్టించే సంగీతము, సృష్టించనూ గలవు లయం చేయనూగలవు. వాటికాశక్తి సామర్థ్యాలున్నాయి, పనికిరాని పాతబడినవాటిని అవి నశింపచేయగలవు. సత్యమైన, సుందరమైనవాటిని సృష్టించగలవు. నానాలాల్ ఒక సందర్భంలో కవిని గూర్చి (తనని గూర్చి కూడా) 'కలలమ్ముకొనే వీధి వర్తకుడుగా' వర్ణించాడు 'కలలమ్మకొనికుంటే నీవు ఏం కొంటావు' అని అడుగుతాడాయన.

ఇందుకుమార్ నాటకంలో ప్రేమస్వప్నాలను గురించి నాటకీయంగా వివరంగా ప్రదర్శించాడు. జయ-జయంత్ రూపకంలో ఆయన ఉద్దేశించే ఆదర్శ ప్రేమ వివాహాన్ని గూర్చి వర్ణించాడు. ఆత్మైక్యానుసంధానమే ప్రేమ వివాహం. శారీరకమైన సంయోగం విధిగా ప్రేమికుల మధ్య ఉండ నవసరం లేదు అని ఆయన ప్రతిపాదించాడు. "జహంగీర్ - నూర్జహాన్" అమరప్రేమ పారరాతితో మలచిన స్వప్నకావ్యం. షహన్ షా అక్బర్‌లో నానాలాల్ కలలుగనే పరమత సహనం అభివర్ణితం. అంతేకాదు, ఈ నాటకం నానాలాల్ వాంఛించే సాంస్కృతిక సంశ్లేషణకు చారిత్రకమైన ఉదాత్త రూపకల్పనం - అక్బర్‌ను ఇందుకు ప్రతీకగా ఆయన తీర్చిదిద్దాడు

గోపిక అనే రూపకంలో నానాలాల్ కలలుగనే ఆదర్శ గ్రామ స్వరూపం వర్ణితం. ఆదర్శనగరమూ ప్రస్తావితం. నగరంలోని సర్వ సౌకర్యాలు గ్రామంలోను, గ్రామంలోని మేలిగుణాలన్నీ నగరంలోనూ సాధించినప్పుడే అవి ఆదర్శ వ్యవస్థ నందుకుంటాయనేది ఆయన సురుచిర స్వప్నం. ఇంకొక రూపకమైన ప్రేమకుంజ్‌లోని ఇతివృత్తం పవిత్రప్రేమ జ్యోతిని జీవితాలయంలో ప్రతిష్ఠ చేసే ప్రేమికుల కథ. నానాలాల్ రచించి నదే మరొక రూపకమైన సంఘమిత్రలో సర్వ కాలాలకు పనికివచ్చే బుద్ధ భగవానుడి దివ్యసందేశము, ఆశోకుని ధర్మచక్ర పరివర్తనమూ ఇతివృత్తం. కురుక్షేత్ర, సారథి, ద్వారికాప్రళయ రచనలలో విశ్వరూప దర్శన సందేశం వినిపిస్తుంది. భూమి మీద బయలుదేరి భూ దివమ్ములను ఏకం చేస్తుంది ఈ దివ్యదర్శనం. చివరకు హరిదర్శన, వేణు విహార కావ్యాలలో ఆనంద పారవశ్యానుభూతిపూర్వకమైన తన భగవత్ సాక్షాత్కారాన్ని వర్ణించా డాయన.

ఇబ్సెన్, షాలు తమ రూపకాదర్శాలతో సమకాలీన సాంఘిక సమస్య లెన్నిటినో పరిష్కరించే ప్రయత్నంగా రంగస్థలం మీద నిలిచారు. నానాలాల్‌కు కూడా ఇటువంటి ఆలోచన లున్నాయి. సాంఘిక సమస్యలు, వ్యక్తిగత సమస్యలు పరిష్కరించే ప్రయత్నాలకు సంబంధించి. కాని నానాలాల్ దృక్పథమూ, ఆయన అవలంబించిన రచనా శిల్పమూ వారి కన్నా భిన్నమైనవి. మేధాగర్భితమూ, హేతుసహితము, వాస్తవికమూ అయి

నది కాదు నానాలాల్ ధోరణి. భావనావిహారము, కాల్పనికమూ, కవిప్రవక్త ధోరణివలె ప్రాబోధికమూ, ఆదర్శమహితమూ అయినది.

ఆయన కవితలలోను, రూపకాలలోను స్త్రీ పురుషులు ప్రేమను గురించి సంభాషిస్తారు. గానం చేస్తారు. కాని నానాలాల్ దృష్టిలో ప్రేమ చాలా పవిత్రమైనది. వివాహానికి పునాది వంటిది. ప్రేమను ఆదర్శాత్మకంగా, ఊహా కాల్పనిక జగత్తులో చిత్రిస్తా డాయన. ఇదే విధంగా ప్రేమ వివాహాన్ని, స్త్రీ పురుషుల అనుబంధాలను కూడా ఆదర్శోన్ముఖంగా చిత్రిస్తా డాయన ఆనాటి సాంఘిక వాతావరణానికి ఈ విధమైన చిత్రణ చాలా అగతికమై ఉండవచ్చు. (ఒక విమర్శకుడు నాటి ఆ వాతావరణాన్ని సామాజిక పతనంగా కూడా వర్ణించాడు) ఆనాటి వారిలో ఉన్నతమైన భావాలపట్ల, ఆదర్శాలపట్ల ఉన్న ఉదాసీన వైఖరి తొలగించడానికే నానాలాల్ తన ఆదర్శాలను గొప్పగా వర్ణించడం అవసరమై ఉండవచ్చు. ఈ దృష్టితోనే నానాలాల్ లోక వ్యవస్థ ఏ విధంగా ఉండడం అభిలషణీయమో, ఆ విధమైన స్థాయికి అది చేరుకొనేటందుకు అవసరమైన జీవన ప్రవృత్తులను వర్ణించాడు. అంతేకాని ఏ విధంగా లోకంలోని వ్యవస్థ కళ్ళకు కనపడుతున్నదో ఆ విధంగా వర్ణించడమనే ఫొటోగ్రాఫిక్ వాస్తవికత పేరిటి అస్తవ్యస్త చిత్రీకరణకు పూనుకోలేదు. ఉన్నవి ఉన్నట్లుగా పరిస్థితులను చిత్రించడం ఆయన అభిమతం కాదు.

నానాలాల్ ఒక సందర్భంలో కవితను శతతంత్రీ మహితమైన సంగీత సాధనం (సారంగి)తో పోల్చాడు.

ఎన్ని తీగలు పలికించగలిగితే అందుకు తగిన నిష్పత్తిలోనే కవిత కూడా పరిపూర్ణతను సాధించగలదన్నాడాయన.

నానాలాల్ కవిత అన్నీ తీగలనూ పలికించలేదు అయినా అది వినిపించిన సంగీతం ఎందరో కవితా ప్రేమికులను ఉర్రూతలూగించింది. నానాలాల్ సంగీత సాధనం, ఎలిజబెత్ బ్రౌనింగ్ ప్రస్తావించిన సంగీత సాధనం కన్నా భిన్నమైనది. తాను గానం చేస్తున్న పాటలోని విషాదంతా ననుభవించడం లేదు నానాలాల్ విషయంలో. వేదనవల్లనే కవిత్వం జనిస్తుం దనడం నానాలాల్ ఎంతమాత్రమూ అంగీకరించడు. కవిత్వానికి కళత చెందిన హృదయం కావాలి అని కాల్పనిక సిద్ధాంతవాదులు నిబంధి

స్తారు కాని ప్రశాంత పరిపూర్ణ సంతోష హృదయానుభూతి నుంచి కవిత్వం ఉత్పన్నమవుతుందన్నదే నానాలాల్ నమ్మకం. ప్రశాంతంగా నిశ్చలంగా ఉన్న నీటిలోనే ప్రతిబింబం స్పష్టంగా కనబడుతుంది గాని కల్లోల ప్రవాహంలో కాదు కదా! ఈ కారణం వల్లనే నానాలాల్ కవితలో విచార చ్ఛాయ లుండవు. కవిదైన బాధ్యతను గూర్చి, కర్తవ్యాన్ని గూర్చి ఆయన వెల్లడించే భావన కనుగుణంగా, ఆయన తన కవితానాదాన్ని విచారగీతికలలో ఆలాపించడు నానాలాల్ సుఖసంతోషాలను, ఆనందోల్లాసాలను గానం చేసే కవి. ఆయనే అన్నట్లు 'ఈ దేశంలోనూ, ఇతరత్రా ప్రతిచోటా హృదయాలు మృతజీవుల సమాధులైపోగా, స్త్రీ పురుషులు బాధల బరువులతో క్రుంగిపోతూ ఉండగా, కవి సాధించ వలసిన మహత్కార్యం, పోగొట్టుకొన్నవాళ్ళలో విశ్వాసం, ఆశా, ఉల్లాసం మళ్ళీ వెలిగించి దీప్తిమంతం చేయడమే'

కవిత్వాన్ని గూర్చి తా నేర్పరచుకొన్న భావనల దృష్ట్యా మాత్రమే కాక, ఆయన తనకు ముందు కాల్పనిక కవితా ధోరణులను ప్రవేశపెట్టిన వారు కవిత్వంలో తెచ్చిన కాల్పనిక విషాదం కూడా, ఈ విధంగా కవితను గూర్చి తన భావాలు ఆయన వెల్లడించడానికి ప్రేరేపించి ఉండవచ్చు. అందువల్ల కవిత్వాన్ని గూర్చి తన ప్రవచనం ఏమిటో ఆయన వెల్లడించాడు. ఆయనకు ముందున్న కవులలో విషాద శబలితం కాకపోతే కవిత కాల్పనిక కవితాస్థాయికి చేరుకోలేదనే అభిప్రాయం కూడా ఉండేది. విషాదమూ, కాల్పనిక కవితా లక్షణమూ విడదీయరానివి అన్నట్లుండేది వాళ్ళధోరణి. నర్మద్ కవితలో విషాదం తన విశిష్టతగా పరిగణించుకున్నాడు. నరసింహారావు దివాటియా 'ఈ నాదసాధనం (అంటే తానే) విషాద గీతాలంటే ఎక్కువ ఇష్టపడుతుంది, ఇతరవాటన్నిటికంటే' అని అభివర్ణించుకున్నాడు. కాంత్ రచించిన కవిత్వం విషాదశబలితం, నిస్పృహాసంసిక్తం కూడాను. ఇక కలాపి చేతుల్లో కవిత్వం కన్నీళ్ళు కార్పించేదే అయింది. నానాలాల్ రొమాంటిక్ కవిత్వం నుంచి రొమాంటిక్ విషాదాన్ని పరిహరించి, ఆశోల్లాసాలను గూర్చి గానంచేసి కవిత్వానికి ఒక సమాశ్వాసస్థాయిని కలిగించాడు.

మాథ్యుఆర్నాల్డ్ చెప్పినట్లు 'కవిత్వం జీవితవిమర్శ' అనే భావంతో నానాలాల్ కూడా ఏకీభవిస్తాడు కాని, ఆయన కనపరచే జీవిత విశ్లేషణ బాధలకు, వేదనలకూ దూరమైనది కాదు.

జీవితంలోని దుఃఖాన్ని, వేదనను, పాపాన్ని నానాలాల్ కూడా దర్శించకపోలేదు. అయితే విశ్వ స్వరూపావగాహనతో వీటినాయన దర్శించాడు, (ఉదా: కురుక్షేత్రలో మహా సుదర్శనం, జయ - జయంత్‌లో దేవర్షి దర్శించిన త్రికాల పరిజ్ఞాన ఘట్టం) వీటిని ప్రశాంత గంభీర సన్నివేశాలుగా ఆయన సృష్టించాడు. ఆయన రచనలన్నిటా వెలుగే కాని వేడి ప్రదర్శించలేదు. ఒకదృష్టిలో చూస్తే మాథ్యుఆర్నాల్డ్ కూడా ఈయనతో ఏకీభవించే వాడేమో. ఆయన కూడా తృప్తిపడేవాడేమోననుకోవచ్చు. మాథ్యుఆర్నాల్డ్ ఉత్తమ సాహిత్య లక్షణాలుగా వెలుగును, మాధుర్యాన్ని ప్రతిపాదించాడు. ఈ లక్షణాలు రెండూ నానాలాల్ సాహిత్యంలో పుష్కలంగా ఉన్నాయి. ఈ దృష్టితోచూస్తే 'ఆధునిక గుజరాతీ సాహిత్యంలో నానాలాల్‌తోనే వసంతఋతువు ప్రవేశించింది.' అన్న ఉమాశంకర్‌జోషి అభిప్రాయం సార్థకం. జీవితంలోని దౌష్ట్యం నానాలాల్ చాలా రీతుల్లోనే దర్శించాడు. ఆయన రచనలలో ముఖ్యంగా నాటకాలలో ఈ సమస్య పదే పదే ప్రసక్త మవుతుంది. అయితే దుష్టత్వం జయం పొందినట్లుగా మాత్రం ఆయన ఎప్పటికీ వర్ణించడు. దుష్టత్వం, క్రూరత్వం చివరకు నాటకీయంగా మార్పుకులోనై, హృదయ పరివర్తనంద్వారా వెలుగును దర్శించడం జరుగుతుంది. సంస్కృత నాటకాలలో వలెనూ, షేక్స్పియర్ తరవాత తరవాత వ్రాసిన నాటకాలలోమాదిరిగానూ, మంచి చివరకు జయించటం అనేది చూడవచ్చును. అయితే ఈవిధంగా సన్నివేశ కల్పనం బలవంతంగా సాధించవలసిరావచ్చు. బలవంతంగానైనాసరే మరేవిధంగానైనాసరే చిట్టచివరకు యథావిధిగా, సక్రమంగా, నానాలాల్ వాంఛించే జీవితదర్శనానికి అనుగుణంగా సన్నివేశాలు రూపొందవలసిందే.

'ప్రజల విజ్ఞానానికి కారకులు విద్వాంసులు, విద్వాంసులకు ఉత్తేజాన్ని కలిగించేవారు.కవులు. చాలా అరుదుగా మాత్రమేకవీ,పండితుడూ, ఒకేవ్యక్తిలో సంలీనం చెందుతారు' అన్నాడు నానాలాల్. నానాలాల్ తండ్రి దలపత్ రామ్ ఒక ప్రత్యేకమార్గంలో కవిత్వాన్ని విద్వత్తతో సంయోగపరచాడు. తనను

పరిపూర్ణ వికసనస్థితిలోని దలపత్ రామ్‌గా అభివర్ణించుకున్నాడు నానాలాల్. అందువల్ల ఈరకమైన సంయోగాన్ని మరింత నాజూకుగా, సున్నితంగా కవితాత్మకంగా సాధించాడు నానాలాల్. తన తండ్రికెలవిమాత్రం భయసంకోచాలులేకుండా అవసరమైన సందర్భాలలో తాత్త్వికంగా ఉండడానికినానాలాల్ వెనుకాడలేదు.దలపత్ రామ్ కవిత్వం భూమికి సంబంధించింది. అయితే నానాలాల్ కాల్పనిక భావనాశక్తితో ఆకాశవిహారం చేయడానికి వెనుదీయలేదు. నానాలాల్ కవితలో ఈ లక్షణం బాగా కనపడుతుంది. ఆయన భావజాలం పరిమితమైనదే. అయితే వీర సంస్కర్త ఆవేశంతో ఆయన తన భావాలను వివిధ రూపాలలో ప్రతిపాదించాడు. అందువల్ల ఆయన రచనలు బాగా వ్యాప్తినొందాయి.

నానాలాల్‌నుగూర్చిన ప్రస్తావన ఏమీ అక్కడ అవసరం లేకపోయినా, ఎక్కడైనా పెళ్ళి జరుగుతున్నపుడు ఎవరో ఒకరు వివాహాన్ని గూర్చిన నానాలాల్ సూక్తిని ప్రస్తావించకుండా ఉండరు. 'వివాహం అంటే దివ్యత్వంలోకి అడుగుపెట్టడమే' అనేవి ఆ సూక్తి. ఇది విన్నవాళ్ళకు ఏమీ ఆశ్చర్యం కలగదు. ఎందుకంటే ఎన్నిసార్లు ఎన్నిచోట్ల వినివున్నదో యీ సూక్తి.

నానాలాల్ దృక్పథం నీరసమూ, నిస్పృహాయత్తమూ కాదు. వాస్తవికవాదిలో వలె మేధా సంపన్నమూ హేతువాదపూరితమూ కాదు. కవికి ఆదర్శవాదికీ అనుగుణమైన భావోద్వేగపూరితమూ, భావనావిలసితమూ గా ఉంటుంది. విశ్వగీతలో భగవాన్ పతంజలి అంటాడు. 'మేధకు అందని ఎత్తులు ద్రష్ట అందుకోగలడు. ప్రపంచంలో హేతువాదులెందరో ఉన్నారు. అందువల్ల ద్రష్టల దర్శనం ఇప్పుడు చాలా అవసరం.' నానాలాల్ కృతులలో విశిష్టబహుళంగా దర్శనాలున్నాయి. ద్రష్టలుకూడా ఎందరో కనబడతారు. నానాలాల్ దృక్పథంలో కళ కళకోసమే కాదు. కళ, నీతి, కవిత్వం, తత్త్వశాస్త్రం వేరు వేరు కావు. అన్నీ పరస్పర పోషకాలు. ప్రణయం, వివాహంగురించి ఆయన కాల్పనిక ఆదర్శభావనలు, జీవనపావిత్ర్యం, అచ్ఛశీలం, తనకైతాను పాటించే సంయమనం అనే నైతికపరిధిలోనే వ్యవస్థితమై ఉంటాయి. కవి స్థాయిని ప్రవక్తస్థాయితో, దేశికునిస్థాయితో సమానమైనదిగా నానాలాల్ భావిస్తాడు కాబట్టి, ఆయన కూడా ప్రవక్తవలె, దేశికునివలె తనదైన సందేశాన్ని ప్రజలకు అందించాడు. కళలోను, జీవితంలోనూ

ఆయన పరిశుద్ధతావాది. తనతోటి కవులకు ఆయన ఉపదేశం ఏమంటే "కవిత్వాన్ని పవిత్రంగా ఉండనివ్వండి. లేదా దాని జోలికి పోవద్దు." అని.

నానాలాల్ తన కవిత్వాన్ని పవిత్రంగా నిర్వహించాడు. ఆయన వర్ణించిన భావాలు, భావోద్వేగాలు, భావస్థాయులు ప్రచారంచేసిన ఆదర్శాలు పరిశుద్ధమైనవి. ఆరోగ్యకరమైనవి. నైతికోన్నతిని ఆశించేవి. ప్రబోధాత్మకమైనవేకాక కవితారమణీయమైనవి.

అయితే నానాలాల్‌కు ఆయన పరిమితులు కొన్ని లేకపోలేదు. ఏదైతే గొప్ప గుణమో అదే ఒక్కొక్కసారి దోషంగా కూడా పరిణమిస్తుంది ఆయనలో. ఆయన కవితలోని గీతికాలక్షణం సర్వ సమృద్ధంగా విన్యసితమైనచోట్ల అలంకారికమైన ఆడంబరపదవిన్యాసమే అప్పుడప్పుడు చోటు చేసుకోవడంకద్దు. ఉదాత్తవిషయాలను ఉదాత్తశైలిలో వర్ణించే ఆయన సహజ ధోరణి ఔచిత్యదృష్టి లేకుండా అల్పస్థాయికమైన వాటికీ, మహత్తరమైన వాటికి కూడా వర్తింపజేసినప్పుడు అది ఆయనలో వ్యక్తిగతవైపరీత్యంగా రూపొంది, వ్యంగ్యరచయితలైనవారికి సమృద్ధిగా అపహాస్యభాజనమూ, అధిక్షేపపాత్రమూ అయింది. ఆయన కవితా విహారం, భావనా సమృద్ధి, కవిత్వంలో అత్యంత శక్తిమంతమైన అంశమే అయినా తరచు ఆయన కవిత్వాన్ని మోయలేని అలంకారపు బరువులతో నింపటమూ జరిగింది. ఒక వైపున ఆయనకు పదాల పోహళింపులో, మధుర శబ్దగుంఫనలో 'మకరంద భాది' అయిన కవి సరస ఆయనకు స్థానం లభించింది. ఇంకొక వైపున మధురఖాద్య విక్రేత సరసన స్థానం లభించింది అయితే ఈ విక్రేత అమ్మే తీపి పదార్థాలు అతి మాధుర్యంతో వెక్కసంగా ఉంటాయి. నాటకాలలో ప్రధానంగాను, మహా కావ్య రచనలోను, నవలలు, చిన్న కథలలోను, ఇతివృత్త నిర్మాణంలోని లోపం ఔచిత్యానికన్నా ఆడంబర విన్యాసానికి ఎక్కువ దోహదకారి అయింది. చివర వ్రాసిన రచనలలో కొంత పునరుక్తి ఎక్కువగానే కనిపిస్తుంది. ఇందువల్ల ఆయన అనవసరంగా సంఖ్య పెంచుతున్నట్లుగా కూడా అనిపించింది.

అయినప్పటికీ ఆయన గొప్ప రచనల ద్వారా అగ్రేసరుడు. ఒక దివ్య దర్శనం సాక్షాత్కరింప చేయటానికి ఆయన వచ్చాడు. ఒక సందేశం తీసుకొని వచ్చాడు. వసంతర్తు శోభాసందేశమది. భవిష్యత్తులోని తరాలు

తనను వసంత సందేశహారిగా గుర్తుంచుకొంటే చాలునన్న తృప్తి నాయన వ్యక్తం చేశాడు. 'కవి ధర్మం వసంత ధర్మం' అన్నాడు నానాలాల్. ఆయన భావనలో వసంతధర్మమంటే కేవలం మధుమాస శోభ మాత్రమే కాదు. పునరుజ్జీవన చైతన్య స్ఫూర్తి అది. తనతో ఆయన ఆశను, ఉల్లాసాన్నీ తీసుకొని వచ్చాడు. తన రచనల ద్వారా దివ్య సాక్షాత్కార దర్శనానికి తరలించుకొని పోయినాడు. గుజరాతీ కవిత్వంలో ఆధునికంగా కొత్తపేరులాగా కాకుండా కొత్త గొంతుగా ఆయన ప్రవేశించాడు. ఆనంద జీవన కవి ఆయన. అయితే ఆయన ఆనంద తత్త్వంలో ఎపిక్యూరియన్, బకనాలియన్ ఛాయలు మాత్రం ఉండవు. ప్రేమను గూర్చి వివాహ, దాంప త్యాన్ని గూర్చి ఆయన వెల్లడించే ఆదర్శాలలో దైహిక తత్త్వం ఏమీ ఉండదు. ఆయన కవితాభావన ఉన్నత శ్రేణికి చెందినది. ఉదాత్తస్థాయిని చేరుకొన్నది. కొన్నిచోట్ల మృదు మధురమైన సుందరమైన పదవిన్యాసం ఆయన రచనల్లో కనబడుతుంది. అది భాషలోని నవ్య సౌందర్య దీప్తిని, నాజూకుతనాన్ని వెలార్చ గల శక్తిమంతమైనది. ఆయన భావాలలోని సాహసం ఒక్కొక్కసారి ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. పద్య కృతులలోను, రూపకాలలోను ఆయన వెలువరించిన భావోద్వేగాలు, భావస్థాయి, తీవ్రత చిత్తశుద్ధితో కూడి ఉంటాయి. ఆయన రచనలలోని విలక్షణత ఎంత నవ నవంగాను, ప్రత్యేక ముద్రతోను ఉంటుందంటే, ఆయన పేరు చూడకుండానే ఇది ఆయన రచనఅని వెంటనే పోల్చుకోవడానికి వీలుగా ఉంటుంది.

పద్య గద్యాలలో సర్వ ప్రక్రియలు చేపట్టిన ఆయన రచనలు చేశారు. చాలా వేగంగా రచనలు చేయగల శక్తి సామర్థ్యాలాయనకున్నవి. బహుళ సంఖ్యలో ఆయన రచనలు చేశాడు. రచనావిషయంలో అమితమైన జాగ్రత్త వహిస్తాడాయన. ఒకటికి నాలుగుసార్లు పునర్విమర్శ చేసుకుంటూ రచనలను సంస్కరిస్తూనే ఉంటాడాయన. ఆయన రచనలలో తొంభైకి పైగా ఇప్పటికే ప్రచురితమైనవి.

ఆయన కీర్తిశేషుడైన తర్వాత వెలువడే ప్రచురణలుగా ఇంకా కొన్ని వెలువడనున్నవి. ఇంతగా బహుళ రచనావ్యాసంగం చేసినవారు కనుక అన్ని రచనలూ సమానమైన స్థాయిలో, ఉన్నతమైన ప్రమాణాలతో ఉంటా

యని ఆశించే ఆస్కారం లేదు, అయితే ఆధునిక గుజరాతీ సాహిత్యంలో ఆయన రచనలు శ్రేష్ఠ రచనలుగా పరిగణిత మవుతాయి. ఆయన వసంతోత్సవ కావ్యం ఆయనను అసాధారణ ప్రజ్ఞాశాలిగా సాహిత్య రంగానికి పరిచయం చేసింది ఆయన నవలిక ఉషఅసంఖ్యాకులైన తరుణ పాఠకులను ఉ(ద్రూత లూగించి ఆయన అభిమానశ్రేణిలోకి వారిని ఆకర్షించింది. ఆయన రచించిన కీర్తనలు, రాసలు, ఇంచుమించుగా ప్రతి ఇంట్లోనూ స్త్రీ పురుషుల రసనాంచలాలమీద నర్తిస్తూనే ఉంటాయి. ఆయన చిన్న కథల సంపుటం 'పంఖాడి'– అంటే దళాలు అని అర్థం–వచనంలో సుందర భావగీతికా సంపుటం. సారథి అనే ఆయన నవల విశ్వతత్త్వ ప్రదర్శకమై, భారతదేశపు ఆధ్యాత్మిక మార్గదర్శకత్వంలో ప్రపంచ నవజీవనాన్ని దర్శింపచేస్తున్నది. ఆయన వ్రాసిన జీవిత చరిత్ర అయిన కవీశ్వరదలపత్‌రామ్ అనే గ్రంథం తన తండ్రి గారిని గూర్చి విపులమైన జీవితచిత్రణమేకాకుండా సమకాలీన గుజరాత్‌ను గూర్చిన విస్తృతమైన చిత్రణ అని కూడా చెప్పవచ్చు. ఆయన రూపకాలు ఇందుకుమార్, జయ – జయంత్‌లు, నాటకీయంగా ఆయన ప్రదర్శించదలచిన, ఆయన ఆశించిన అత్యుత్తమ ఆదర్శాలకన్నిటికీ రూపకల్పనలు. మొగల్ యుగానికి చెందిన ఆయన రెండు చారిత్రక రూపకాలూ, ఆయన చారిత్రక అవగాహనను, భావనాశక్తిని వెల్లడిస్తున్నాయి. ఆయన రచించిన మహా కావ్యం కురుక్షేత్ర, ఆయన విశ్వదర్శనాన్ని వెల్లడిస్తున్నది.

పద్య రచనా ప్రక్రియకు సంబంధించిన భావగీతం, నాటకీయగీతం, మహాకావ్యం, అన్నీ ఆయన చేపట్టినా ప్రధానంగా ఆయన భావగీతికా కవి అనే చెప్పవలసి ఉంటుంది. కవితా రచనలలో ఆయన అత్యున్నత స్థాయి కవిగా తన శక్తిని ప్రదర్శించింది, లఘుగీతాలలోను, చిన్న పాటలలోనూ అని చెప్పవలసి ఉంటుంది. తనకు పాడటంలో కాని, అభినయించటంలో కాని ప్రవేశం లేదని ఆయన అన్నప్పటికీ, ఆయన రచనలన్నిటా చోటు చేసుకున్న పాటలలో గొప్ప స్వరసుభగత వ్యక్తమవుతుంది. తాత్త్వికచింతనా, భావస్థాయి, భావోద్వేగం, భావనాశక్తి చక్కని సమన్వయం పొంది, అభివ్యక్తిలో ఒక సౌకుమార్యాన్నీ, పొందికను సాధించాయి. భక్తి గీతాలలోని కవితాదర్శనంలో ఆయన ఉదాత్తస్థాయి నందుకొన్నాడు. గుజరాత్‌లో 'గీతి కవితా ప్రభువుగా' ఆయన అనితరసాధ్యమైన స్థానాన్ని బహుకాలం

అధిరోహించాడు. చాలా ప్రసిద్ధి వహించిన కాలంలో ఇంగ్లండులో షెల్లీవలె చాలా మహిమోపేతుడైన వ్యక్తిగా ఆయన పరిగణితుడైనాడు. బెంతామ్ చెప్పిన అధిక సంఖ్యాకులైన జనులకు అత్యధిక సంతోషం చేకూర్చడమే ఉత్తమోత్తమమన్న సూత్రాన్ని కవిత్వానికి వర్తింపచేయడం సబబు కాదు కాని, నానాలాల్ అత్యధిక సంఖ్యాకులైన కవిత్వాభిమానులకు అత్యధిక సంతోషాన్ని మాత్రం చేకూర్చినట్లు నిస్సందేహంగా చెప్పవచ్చు అయితే ఆనందం కలిగించడం మాత్రమే ఆయన ఆదర్శం కాదు ఆదర్శకవి అంటే ఆయన భావన, ఉపదేశకత్వాన్ని ప్రవక్త లక్షణాన్ని సమ్మిళితం చేసుకొని 'గాయాలను ఉపశమింపజేసి జీవనదాయిని అయిన జలాన్ని చైతన్యస్ఫూర్తి కలిగేట్లు జనులపై చిలకరించగల' వ్యక్తిత్వం కలవాడని

అందువల్ల కవిగా ఆయన జీవితధ్యేయం వసంత శుభసందేశాన్ని లేదా పునరుజ్జీవనాన్ని సర్వే సర్వత్రా ప్రసరింపజేయడం. అందరూ అందుబాటులో దాన్ని ఆనందించేటట్లు చేయడం. ఆయన దీనినే దృష్టిలో పెట్టుకొని అన్నాడు. కోకిల స్ఫుటంగా గొంతెత్తి పాడితే, ప్రజలు ఆనందంతో ఆలకిస్తారు అని. నానాలాల్ స్ఫుటస్వరంతో గొంతెత్తి గానం చేశాడు ఆయన గానాన్ని కూడా ప్రేమాభిమానాలతో ప్రజలు ఆలకించడం జరిగింది.

అరవైతొమ్మిది సంవత్సరాల వయస్సున 1946 లో ఆయన మృతి చెందారు. అవిచ్ఛిన్నంగా అర్థ శతాబ్ది కాలం కవిత్వాని కాయన సేవ చేశారు. అంతటి విస్తృత రచనా వ్యాసంగం గల కవి రచనలలో ఏ దేశంలోనైనా ఎక్కడైనా పోల్లూ నెల్లూ కూడా ఉండటం సహజం. నానాలాల్ విషయంలో ఈ అంశాన్ని గూర్చి ఇంకా పరిశీలనం చేయవలసే ఉంది. కాల్పనికమైన భావగీతికా సంరచనము, నైతికాదర్శోన్ముఖత, నానాలాల్ కవిత్వంలో ఉన్నతోన్నతస్థాయిని చేరుకొన్నవి. ఆయన అంచగీతిని(మృతిగీతం)ఆలపించడానికి ముందే గుజరాతీ కవితలో రూపరేఖలు మారిపోవడం ప్రారంభమైంది. ఆకృతి, వస్తువులలో కూడా ఈ మార్పు స్పష్టంగా కనిపించసాగింది. పదాల కూర్పులోని సారళ్యము, చిత్రణలో సూటితనం, ఆలోచనాధోరణిలో స్పష్ట ప్రకటనవైపు, మొగ్గుదలల వైపు కవిత్వం గమించడం ప్రారంభమైంది. కాల్పనికధోరణి స్థానంలో వాస్తవికధోరణి ప్రవేశించింది. పేదప్రజల స్థితిగతుల పట్ల, అవగాహనతో కూడిన ఆందోళన ఎక్కువగా

వ్యక్తమవుతూ వచ్చింది. క్రమక్రమంగా ఈ చైతన్యం కవుల్లో ఎక్కువవుతూ వచ్చింది. దిగువవర్గాలవారి పట్ల, అసహాయులపట్ల, సంఘంలో రక్షణలేని వారి పట్ల, అవగాహనను గొంతెత్తి కవితలో వ్యక్తం చేయసాగారు కవులు. అయితే పూర్వ కవితాధోరణిలోని ఆదర్శలక్ష్యం సాంఘికార్థిక రాజకీయ రంగాలలో ప్రజల అభిలాషలను వ్యక్తం చేయడంలో ప్రభావశీలంగా పని చేయసాగింది. ఈ మార్పు లన్నిటిమధ్య కూడా తన విశ్వాసాల కనుగుణంగానే నానాలాల్ తన కుద్దిష్టమైన కవితాగానాన్నే చేస్తూ వచ్చాడు. కవిని కూడా కాలం శాసించగలదు. కాలానుగుణంగానే అతడి కవితామూర్తిమత్వం రూపొందక తప్పదు. ఫాషన్‌ల లాగానే కవితాభిరుచులు కూడా మారిపోతూనే ఉంటాయి. 'నా తండ్రి ఇంట్లో ఎన్నో భవనాంతర్భాగాలున్నాయి'. అట్లానే కవితా గృహంలో కూడానూ. నానాలాల్ ఈ కవితాగృహంలో సుందరమైన కవితాంతర్భాగం. మానవుడు, ప్రకృతి, భగవంతుడు నానాలాల్ కవితా వస్తువులు. ప్రేమ, సౌందర్యం, సత్యం - వీటికై తనను తాను కవితా పరంగా ఆయన అర్పించుకున్నాడు. ఆయన కవిత్వంలో ఇవి బాగా సమన్వయం పొందాయి. అల్లిబిల్లిగా చక్కగా అల్లుకొనిపోయినవి. 'మానవుడు అందుకో గలిగిన స్థాయి అతడి అవగాహనను అధిగమించాలి అన్నాడు బ్రౌనింగ్. బహుశః నానాలాల్ అటువంటి స్థాయిని అందుకొన్నాడనవచ్చు. ఆయన అవగాహన ఆయన్ను గొప్ప కవులలో ఒకణ్ణిగా చేయడానికి సమర్థమే. చిత్రణలో కాల్పనికము, మౌలికమైన జీవిత దృక్పథంలో సాంప్రదాయిక మార్గానికి చెంది ఉండడమూ, మధ్యయుగపు కవితా తాత్త్విక లక్షణము, ఆకృతిలో కూర్పులో నవీనానుసరణము, నానాలాల్ కవిత్వంలో కనపడతాయి. కేవలం వీటన్నిటి సమ్మిశ్రణం మాత్రమే కాదాయన కవిత. వీటన్నిటి పరిపూర్ణమైన సంలీనతా లక్షణంతో సమన్వయరూపసిద్ధి కనపడుతుంది ఆయన కవిత్వంలో. అంతే కాదు విలక్షణమైన, స్వీయవిశిష్టమైన ప్రత్యేక ముద్ర ఆయన కవిత్వంలో కనపడుతుంది. అందువల్ల నానాలాల్ ప్రత్యేకమైన వ్యక్తిత్వాన్ని ఇట్టే ఎవరైనా సులభంగా గుర్తించవచ్చు.

నానాలాల్ శైలీ నిర్మాత. శైలినిబట్టి వ్యక్తిని గుర్తించవచ్చు అన్న సూక్తి నానాలాల్ విషయంలో పూర్తిగా అన్వయిస్తుంది. నిస్సందేహంగా ఆయనను శైలినిబట్టి గుర్తించవచ్చు. ఆయనపై పాశ్చాత్య భావనావాయువులు

వీచినా 'భారతీయ కవితగా, చరిత్రగా జీవించడానికాయన నిబద్ధుడైనాడు.' కవిత్వం, గీతికా రచన, రూపక రచన, మహాకావ్య రచన మొదలైనివాటిని వేరు పరచి చూపడం కష్టం. వీటి మధ్యగల విభేదం రేఖా మాత్రంగానే ఉంటుందేమో. ఆయన వచన రచనను కూడా తగినట్లు కత్తిరింపుల కూర్పు చేస్తే కవిత్వంగానే బహు చక్కగా చెలామణి కావడానికి సందేహం లేదు. అందులో కూడా ఆయన విలక్షణమైన లయాత్మక శైలి కనపడుతూనే ఉంటుంది. 'ప్రభూ, మజ్జిగను చిలుకు, మృదువుగా నెమ్మదిగా నీ చేతితో' అనేది ఆయన సుప్రసిద్ధమైన ఒక కీర్తనలో మొదటి చరణం. నానాలాల్ గురించీ, ఆయన కవితా కళను గురించీ, శిల్పాన్ని గురించీ ఈ వర్ణననే అన్వయించవచ్చు ఆయన చేయి ఏనాడూ బరువుగా సాగలేదు. ఉద్ధృతంగా సాగలేదు. ఆయన చిన్న చిన్న కవితలు కొన్ని గాలిలో తేలియాడే మంచు తరకలవంటివి. లేదా అతి మృదులమైన పట్టు పోగులవంటి మసృణమైన పోచలు. అవి ఎంత మృదువైనవంటే, ఎంతో జాగ్రత్తగా వాటిని స్పృశిం చాలి. ఆయన మధురమైన కీర్తనలు కొన్ని నోటిలో తీయగా కరిగిపోతాయి. విన్న తరువాత ఎంతసేపో వాటి సుమధుర నాదం చెవుల్లో వినిపిస్తూనే ఉంటుంది. ఆయన భక్తి కీర్తనలు కొన్ని స్వీయానుభూతి దఘ్నంగానూ, భక్తి సాంద్రతతోను విలక్షణమైనవి. అలౌకికమైన దివ్యదర్శన సాక్షాత్కా రానికి, సత్యమైన ఉదాత్త పారమ్య పరిధులకు తీసుకొనిపోగలవు.

1935 వ సంవత్సరంలో ఆయన మూడో కవితా సంపుటం వెలువ రించాడు. దానికాయన రాసిన ఉపోద్ఘాతంలో తన మొదటి కవితా సంపుటం ఏ విధంగా మెప్పుదలకు, ఒప్పుదలకూ గూడా గురి అయిందో, రెండో కవితా సంపుటం వెలువడేనాటికి ఏ విధంగా అధికంగా మెప్పుదలే లభించిందో, మూడో సంపుటం వెలువరిస్తున్న ఈ సమయానికి 'నవ్య కాల్పనికతా విశిష్టమైన తన కవిత్వం పట్ల ఆనందస్పదనం వ్యక్తీకరించని విద్యావంతు లైన స్త్రీగాని పురుషుడుగాని గుజరాత్‌లో వెదకి చూచినా లేనే లేరేమో అన్న స్థితికి' తన కవిత్వం చేరిందో ఆయన ప్రస్తావించారు. తమ కవిత్వాన్ని గూర్చి తామే యథార్థమైన అంచనా కట్టడంగాని, సమర్థమైన విమర్శ ప్రకటించడానికిగాని, కవులు అన్ని వేళలా కృతకృత్యులు కాలేకపోయినా, నానాలాల్ తనను గూర్చి వ్యక్తీకరించిన అంచనా మాత్రం సరి అయినదే,

అనడానికి సమకాలీనమైన సాక్ష్యం కావలసినంత ఉంది. సాహిత్యంలో కఠోర సాంప్రదాయికులు, నానాలాల్ మొట్టమొదటిసారి 'కొన్ని కవితల' పేరుతో కవితాసంకలనాన్ని ప్రకటించినప్పుడు. 'నిజమే! కొన్ని కవితలే ఏమో!' అని ఛలగర్భితంగా పలికిన వాళ్ళు, క్రమక్రమంగా అన్నీ కవితలే అని ఒప్పుకునే స్థితికి వచ్చారు.

కాని నానాలాల్ లఘు కావ్యాలు ప్రచురించడంతో మాత్రమే తృప్తి పొందలేదు. వాటిని తమ కాళ్ళపై తాము నిలబడటానికి పిల్లవాళ్ళు చేసే ప్రథమ ప్రయత్నాలుగా తప్పటడుగులుగా ఆయన పోల్చారు. ఈ లఘు గీతికా రచనలు నానాలాల్ రచనాభ్యాసంగానికి నాంది ప్రస్తావనలాగా ఉపకరించినవని చెప్పవచ్చు. తన కవితా రచనా రూపకాల కివి ప్రస్తావన ప్రాయాలని ఆయనే చెప్పుకున్నాడు. ఆయన దృష్టి విశాలం కావడానికి ఆయన కవితాభావన శక్తిలో ఒక ఊపు రావడానికి ఇవి తోడ్పడ్డాయి. తరువాత తరువాత ఆయన రచించిన కవితా రూపకాలలో, ప్రేమ, వివాహం, జీవితం మొదలైన వాటినిగూర్చిన ఆయన ఆదర్శ భావనలు, ఆలోచనలు, నాటకీయశిల్పంతో పొందుపరచడానికి, ప్రదర్శించడానికి, తొలి రచనలు ఆయనకు సాధకావస్థగా ఉపకరించాయి. ఆయన మధుర కవితకు మరో పేరు అని చెప్పదగిన ఆయన పాటలు 'మధురనాదం, పండువెన్నెల, అనుభూతి ఏకమై' ఆకృతి ధరించినవాటిని ఆయన రచిస్తూ రూపకాలలో చేరుస్తూనే వచ్చాడు. కురుక్షేత్రంవంటి మహత్ బృహత్కావ్యంలో కూడా ఆయన పాటలు చేర్చాడు. ఆయన కవితాసిద్ధికి శిఖరంవంటిదిగా కురుక్షేత్రాన్ని ఆయన భావించుకున్నాడు. చివరకు 'మధురనాద సుధాప్రవాహం' వంటి 'హరి సంహిత' ఆవిర్భవించింది. ప్రేమకూ భక్తికీ మధ్య ఉండే ఆ సన్ననిరేఖామాత్రమైన అంతరాన్ని కూడా తొలగించి 'ప్రేమభక్తి' గా ఈ కావ్యంలో పర్యవసింప చేశాడాయన.

1898 లో నానాలాల్ కవితారచన ప్రారంభించిన కాలానికి ఇప్పటికి ఒక శతాబ్దిలో మూడు పాదాల కాలం గడచిపోయింది. 1946 లో ఆయన మృతిచెందిననాటికి నేటికి పాతిక సంవత్సరాల పైబడి కాలం గడిచింది. 1977 లో ఆయన శతజయంతి, కవిగా నాటకకర్తగా, ఆయన సముచిత స్థానాన్ని నిర్ణయించడానికి తగిన ఘట్టమే అని చెప్పవచ్చు.

శతాబ్ది కాలం ఇటువంటి నిర్ణయానికి అల్పమైన కాల వ్యవధి కాదు. ఆయన వచన రచనలు లెక్కకు మిక్కిలి సంపుటాలుగా ప్రచురితమైనవి. వాటన్నిటిని కూర్చి ముందు ముందు విశ్లేషించినా రూపక కర్తగా, కవిగా ఆయన స్థానం ఇప్పుడు నిర్ణయించవచ్చు. సాంఘిక సమస్యల పరిష్కారం గురించి, మానవ సంబంధాలనుగూర్చి, మౌలికమైన భావాలనుగూర్చి, నానాలాల్‌లో అన్వేషించి ప్రయోజనం లేదు. ఆయన వచన రచనలలో అత్యధిక భాగం ఆయన నవలలూ, కథా సంపుటాలూ, శిల్పదృష్టితో నిశితంగా, అధ్యయనం చేసి పరిశీలించడం ముందు ముందు జరగవచ్చు. ఇందు కుమార్, జయ-జయంత్, జహంగీర్, నూర్జహాన్, షహన్‌షా అక్బర్ మొదలైనవి కొన్ని రూపకాలూ, మహా కావ్యమైన కురుక్షేత్రంలోని కనీసం ఆరాశ్వాసాలు, ఆయన గీతికా రచనలో హెచ్చుభాగమూ, ఆయన రచించిన పాటలూ, రాసలు అనేక సంపుట పరిమితమైనవీ, నానాలాల్ మహాకవి అనే విషయాన్ని సర్వదా ప్రకటించగలవు.

# అనుబంధం - 1

## నానాలాల్ రచనలు

| కృతి పేరు | ప్రచురణ కాలం (మొదటి ముద్రణం) |
|---|---|
| 1. కెటలంక్ కావ్యో, ప్రథమ భాగం | 1903 |
| 2. రాజసూత్రోని కావ్య త్రిపుటి | 1903-5-11 |
| 3. వసంతోత్సవ | 1905 |
| 4. కెటలంక్ కావ్యో, ద్వితీయ భాగం | 1908 |
| 5. ఇందుకుమార్, మొదటి అంకం | 1909 |
| 6. నానారాస, ప్రథమ భాగం | 1910 |
| 7. భగవద్గీత (అనువాదం) | 1910 |
| 8. జయ్-జయంత్ | 1914 |
| 9. మేఘదూత్ (అనువాదం) | 1917 |
| 10. ఉష | 1918 |
| 11. చిత్రదర్శనో | 1921 |
| 12. రాజర్షి భరత | 1922 |
| 13. ప్రేమ-కుంజ్ | 1922 |
| 14. ప్రేమభక్తి భజనావళి | 1924 |
| 15. సాహిత్యమంథన్ | 1924 |
| 16. వైష్ణవీ షోడశగ్రంథో (అనువాదం) | 1925 |
| 17. అమరపంథనో యాత్రడు | 1925 |
| 18. శకుంతలను సంభరణు (అనువాదం) | 1926 |
| 19. కురుక్షేత్ర I | 1926 |
| 20. కురుక్షేత్ర XII | 1927 |
| 21. ఉద్బోధన | 1927 |
| 22. అర్ధ శతాబ్ది అనుభవ బోల్ | 1927 |
| 23. సంసారమంథన్ | 1927 |

## అనుబంధం

| | | |
|---|---|---|
| 24. | విశ్వగీత | 1927 |
| 25. | ఇందుకుమార్, రెండో అంకం | 1927 |
| 26. | నానారాస, ద్వితీయభాగం | 1928 |
| 27. | గీతమంజరి | 1928 |
| 28. | జహంగీర్ – నూర్జహాన్ | 1928 |
| 29. | కురుక్షేత్ర IV | 1928 |
| 30. | కురుక్షేత్ర V | 1928 |
| 31. | కురుక్షేత్ర XI | 1929 |
| 32. | కురుక్షేత్ర II | 1930 |
| 33. | షహన్ షా అక్బర్ | 1930 |
| 34. | పంఖాడియో | 1930 |
| 35. | కురుక్షేత్ర X | 1930 |
| 36. | సంబోధన | 1930 |
| 37. | దాంపత్య స్తోత్రో | 1931 |
| 38. | శిక్షాపూర్తి (అనువాదం) | 1931 |
| 39. | బాలకావ్యో | 1931 |
| 40. | ఉపనిషదపంచాక (అనువాదం) | 1931 |
| 41. | సంఘమిత్ర | 1931 |
| 42. | ప్రస్తావమాల | 1932 |
| 43. | ఇందుకుమార్, మూడో అంకం | 1932 |
| 44. | కవీశ్వర దలపత్‌రామ్, ప్రథమ భాగం | 1933 |
| 45. | ఒజ్ అనెఅగర్ | 1833 |
| 46. | జగత్ కాదంబరి యొమన్ సరస్వతిచంద్ర | 1933 |
| 47. | అప్నాసాక్షరరత్నో, ప్రథమ భాగం | 1934 |
| 48. | కవీశ్వర దలపత్‌రామ్, ద్వితీయ భాగం (అ) | 1934 |
| 49. | అప్నా సాక్షర రత్నో, ద్వితీయ భాగం | 1935 |
| 50. | గోపిక | 1935 |
| 51. | కెట్‌లంక్ కావ్యో, మూడో భాగం | 1935 |
| 52. | గురుదక్షిణ | 1935 |
| 53. | పుణ్యకాంత | 1937 |

84. రాస, నాలుగో భాగం ,,
85. మహాకావ్య అభినందోత్సవ్ ,,
86. నవ ఉపనిషదో ,,
87. చంద్ర అనె చంద్రిక ,,
88. విచారణ, ప్రథమ భాగం ,,
89. విచారణ, ద్వితీయ భాగం ,,
90 ధర్మమంథన్, ప్రథమ భాగం ,,
91. ధర్మమంథన్, ద్వితీయ భాగం ,,
92. హరిసంహితన మండలో ,,
ఇతరములు ముద్రణ కావలసి ఉన్నవి
93. వ్యవహార గుజరాతీ వ్యాకరణ్
94. వ్యవహార అంగ్రేజి వ్యాకరణ్ ,,
95. గుజరాత్ని భూగోల్, ప్రథమ భాగం ,,
96 గుజరాత్ని భూగోల్, ద్వితీయ భాగం ,,

# అనుబంధం - 2

## గ్రంథసూచి


1. దవే ఈశ్వరలాల్ — నానాలాల్ - న - భావన ప్రధాన్ నాటకో
2. గోకాక్ వి.కె. (సంపా.) — లిటరేచర్ ఇన్ మోడరన్ ఇండియన్ లాంగ్వేజెస్
3. జవేరి కె.ఎమ్. — మైల్ స్టోన్స్ ఇన్ గుజరాతీ లిటరేచర్
4. జవేరి ఎమ్.ఎమ్. — నానాలాల్
5. కలేకర్ కాకా — నారీ గౌరవ నో కవి

6. కొంతాకేరమణ్‌లాల్ నానాలాల్ - నొ - కావ్య ప్రపత్

7. మెహతా సి.సి. కవి శ్రీ నానాలాల్ - న నా ట కొ

8. మున్షి కె.ఎమ్. గుజరాత్ అండ్ ఇట్స్ లిటరేచర్

9. పరీఖ్ బాలచంద్ర (1) నానాలాల్ : పొయెట్‌లారి యట్ ఆఫ్ మోడరన్ గుజరాత్

(2) పెరినియల్‌ఫౌంట్ : లిరిక్స్ ఆఫ్ ఎడరేషన్ అండ్ లవ్

(3) రసద్రష్ట కవివర్

(4) రసగంధ

10. పరీఖ్ ఆర్.సి. కవివర్-ని ప్రతిభ అనె కురుక్షేత్ర -ను మహాకావ్య

11. పథక్ ఆర్.వి.(సంపా.) కవి శ్రీ నానాలాల్ స్మారక్ గ్రంథ్

12. రావల్ ఏ.బి. నానాలాల్ మధుకోశ్

13. సాహిత్య అకాడెమీ (ప్రచు.) కాంటెంపరరీ ఇండియన్ లిటరేచర్

14. సంజాన జె.ఇ. స్టడీస్ ఇన్ గుజరాతీ లిటరేచర్

15. సుందరమ్ అర్వాచీన కవిత

16. వైద్య వి.కె. (సంపా.) కవిశ్రీ నానాలాల్ జన్మ సువర్ణ మహోత్సవ (కౌముది - ప్రత్యేక సంచిక)

17. వైద్య వి.కె. నానాలాల్ కవిని జీవనదృష్టి